# సుందరి

శ్రీ ప్రభాతకుమార

ముఖోపాధ్యాయ విరచితము.

శ్రీ శివశంకరశాస్త్రి

వంగభాషనుంచి [redacted]ంచినది.

ప్రొఫెసర్. కంచిభట్ల ఆంజనేయ సిద్ధాంతి

గ్రంథప్రకాశకులు

ఒంగోలు.

# అ ం కి త ము

కంచెరగ్రామవాస్తవ్యులు, నామిత్రులు

శ్రీ వాసిరెడ్డి బుచ్చినాయుడు గారికి

# విజ్ఞప్తి

మన దేశభాష లన్నిటికంటె బంగాలాభాష సాహిత్యంలో అగ్రస్థానాన్ని ఆక్రమించింది. వేలకొలది ప్రతులు స్వల్పకాలంలోనే అమ్ముడు పోవడం బంగాలీవారి మాతృభాషాభిమానం వ్యక్తపడుతు వుంది. అన్నిటికంటె అతి మాధుర్యంకల తెలుగుభాష పైకివచ్చేమార్గాలు కనుపించక ప్రథమముద్రణమైన పుస్తకాలు పదిసంవత్సరాలకు కూడా అమ్ముడుపోకపోవడం మనవారి అభిమానం ప్రతిఫలిస్తు ఉంది. సాటివారగు అరవలు రెండు మూడు పత్రికలను పోషిస్తు ఉంటే మనం ఒక దినపత్రికను సంరక్షించుకోలేని స్థితికి లోనుగావడం మనకున్న మాతృభాష యందలి ప్రేమ బైటపడుతువుంది. మనమాతృభాషను మనమే ప్రేమించకపోతే మరెవ్వరు ప్రేమిస్తారు ?

పత్రికల రేట్లకు అతిచౌక ధరలతో పుస్తకాలు వెలువరించి ఆంధ్రభాషాసేవ చేయాలి అనే అభిప్రాయంతో స్వర్గీయ "ఆంధ్రరత్న" దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి స్మారకముగా భావవిజయ దశమినాడు "ఆంధ్రరత్నగ్రంథమాల" స్థాపించబడినది. యువ ఉగాది కానుకగా "సుందరి"ని ఆంధ్రలోకానికి అందజేశాము. అడిగినంతనే లేదనక తమ "సుందరి"

మాతృకనొసంగిన శ్రీశివశంకరశాస్త్రిగారికి కృతజ్ఞుడను. ముద్రిణమునకు సహాయపడిన సుజనరంజనీ ముద్రాశాలాధిపతులు శ్రీపోతాప్రగడ సూర్యనారాయణరావుగారికి ఆంధ్రభాషామతల్లి సకల శుభంబు లొసంగుగాత!

యువ ఉగాది,
ఒంగోలు.

కంచిభట్ల ఆంజనేయ సిద్ధాంతి

సంవత్సరముచందా ముందుగా బంపువారికి పోస్టేజి మేమే భరించి 7-0.0 లకు 12 పుస్తకాలంపుదుము. చందాదారునికి పోస్టేజి కాక 0-8.0 ఒక పుస్తకం పంపబడును. ప్రతిపుస్తకం క్రౌనుసైజులో 150 పేజీలు తక్కువకాకుండ 300 పేజీలకు ఎక్కువకాకుండ యుండును.

రాబోవునవి:— గణేశరాజు, స్వయంకృతాపరాధము, స్వప్నవాసవదత్త, ఆంధ్రిమహావీరుడు, బంకిం గ్రంథావళి, 1, 2, 3, 4, 5, 6 వాల్యుములు, గోవిందరాముడు.

## ఉ ద్ధా ర కు లు

శ్రీయుత పోతాప్రగడ సూర్యనారాయణరావు పంతులుగారు
సుజనరంజనీ ముద్రాశాలాధిపతులు, రాజమండ్రి.

,, పసుమర్తి సుబ్బారాయుడుగారు, వర్తకులు
తోరగుడిపాడు, (ఒంగోలు తాలూకా)

# సుందరి

## ౧

పియాలీనది సుందరవనములో ప్రవేశించేచోటికి ఉత్తరముగా మూడుకోసులదూరాన విశాలాక్షి అనేగ్రామముకలదు. ఆగ్రామము నదికి తూర్పుగట్టున ఉన్నది. నదిదగ్గరనుంచి చూస్తే విశాలాక్షి అమ్మవారి దేవాలయశిఖరముమాత్రము కనిపిస్తుంది. ఇండ్లచుట్టూ మామిడిచెట్లూ వెదురుపొదలూ దట్టముగా ఉన్నవి. పియాలీనది, ఉత్తరాన విద్యాధరిలోనూ దక్షిణాన మాతలానదిలోనూ కలుస్తుంది. పియాలీమీదుగా పెద్దపెద్ద పడవలు సుందరవనములోనుంచి అడవికర్రలూ, కలపా, తీసుకొని కలకత్తాకు పోతవి. కలకత్తానుంచి పోర్టు క్యానింగుకు వెళ్ళేరైల్వేదారికి వంతెన విశాలాక్షికి మూడు కోసులదూరాన ఉత్తరముగా పియాలీనదిమీద కట్టినారు.

వంశపారంపర్యముగా వంద్యోపాధ్యాయులు విశాలాక్షి జమీందార్లు. ఈవంశానికి కొంచెము అపఖ్యాతి ఉన్నది. ఈజమీందార్లవంశవృక్షము పరిశీలిస్తే పూర్వకాలములో ప్రసిద్ధికెక్కిన ఒకరిద్దరు బందిపోటు నాయకుల పేర్లు దొరు

కుతవి. నూరేళ్ళకు పైగా కంపెనీవారి ఫౌజుదారు ఒకాయన అప్పటి జమీందారును పట్టుకొనడానికి వచ్చాడట. ఆజమీందారు ఫౌజుదారును బంధించి విశాలాక్షి అమ్మవారి సన్నిధానములో బలి యిచ్చాడట అయితే ఇప్పటిబాబులు ఈకథ లేపి అంగీకరించరు. జ్ఞాతివైరముచేత శోణాపురము బాబులు ఇలాంటి వాడుకలు చేస్తారని అంటారు

కాంతిచంద్రబంద్యోపాధ్యాయుడు ఇప్పటి వంశకర్త. ఈయన సంపత్తి చాలాగొప్పది. సుందరవనములో చాలా భాగము ఈయన భుక్తములో ఉన్నది. జమీలో కాంతిచంద్రుని అధికారము అప్రతిహతము. ప్రజలను శాసించడములో ఈయనతో సమాన మైనవాడెవ్వ లేదని చెప్పవలసి వస్తుంది. వసూలుకావలసిన సిస్తుకోసము ఇప్పటి జమీందార్లవలె ఈయన రైతులమీద కోర్టులో దావా వెయ్యడు; నగ్దీని పంపి, రైతులను పట్టి తెప్పించి, వేపచెట్లకు కట్టివేయించి, కొరడాదెబ్బలు కొట్టించి, డబ్బు వసూలుచేస్తాడు. దెబ్బలు తిన్నవాళ్ళు కోర్టులో శరణు జొచ్చరా? కొందరు కొందరు అలాగే చేశారు. కాని వాళ్ళ నివాసగృహాలలో ఇప్పుడు ఎలుకలు, పందికొక్కులు, గబ్బిలాలూ విహారాలు చేస్తున్నవి! అనేకమంది లాఠీవాళ్ళు జీతాలు పుచ్చుకొంటూ బహిరంగముగా వెనకటి జమీందార్లదగ్గర ఉండేవారు. ఇంగ్లీషువారి శాసనాలవల్ల వాళ్ళు ఉండడానికి వీలులేదు.

అయినప్పటికీ రహస్యముగా కొంతమంది లాఠీవాళ్ళు ఉండనే ఉన్నారు.

కాంతిచంద్రబాబుగారి హవేలీ గ్రామముమధ్యఉన్నది. సింహద్వారముమీద నౌబత్ ఖానా. గుమ్మముదాటగానే రెండువైపులా పుష్పఫలజాతులతోట. అందులో రకరకాల పెంపుడుపక్షులు తిరుగుతూ ఉంటవి. కొంచెము దూరము వెళ్ళితే దక్షిణపువైపున తెల్లరాతితో కట్టిన నిర్మలసరస్సూ, కూర్చోడానికి రెండు కొయ్యబెంచీలూ ఉన్నవి. ఎడమపక్క కచ్చేరిభవనము. దాని వెనకనుంచి అంతఃపురము సరిహద్దు.

అది వైశాఖమాసము. మధ్యాహ్నకాలము. జ్యేష్ఠ ఆషాఢ మాసాలలోవలె ఎండ తీవ్రముగా ఉన్నది. అంతఃపురము వెలుపల తయఖానాలో ఒక గదిలో కాంతిచంద్రబాబు విశ్రాంతి తీసుకొంటున్నాడు. వెలపల కూర్చుండి హరిచరణుడు పంఖా లాగుతున్నాడు. గది లోపలిభాగము చక్కగా అలంకరించి ఉన్నది. కలకత్తానుంచి ఇంగ్లీషు కంట్రాక్టరు వచ్చి గోడలకు రంగువేసి వెళ్ళినాడు. ఎదురుగా ఉన్న కిటికీలోనుంచి ఎండ వచ్చి "ఛిన్నమస్తాదేవి" బొమ్మమీద పడుతున్నది. అందువల్ల అమ్మవారి రక్తధార అగ్నిధారవలె కనబడుతున్నది. ద్వారముపైభాగాన బ్రాకెట్టుమీద రాతితో చేసిన స్త్రీవిగ్రహము ఉన్నది. ఆవిగ్ర

హాము చేతిలో గుండ్రని గడియారము టిక్కు-టిక్కు మంటున్నది. తఖ్తుమీద మంచి తివాసీ పరిచి ఉన్నది. పాలవలె తెల్లనిగలీబులు తొడిగిన బాలీసులు, దిండ్లూ దానిమీద ఉన్నవి. ఒకదిండుమీద వాలి అరమోడ్పుకన్నులతో కాంతిచంద్రబాబు హుక్కా పీలుస్తున్నాడు.

ఈయనకు ౫౦ సంవత్సరా లుంటవి. దీర్ఘకాయుడు. మేలిమి బంగారమువంటి శరీరచ్ఛాయ. విశాలమైన నేత్రాలు. పెద్ద గడ్డము. బలిష్ఠుడు. లలాటాన అనేక రేఖ లున్నవి. చూస్తే ఈయనకు చాలాచింతలు-దుశ్చింతలేమో-ఉన్నట్టుతోస్తుంది. బంగారపుపీక రెండువేళ్ళతో పట్టుకొని కాంతిచంద్రబాబు పెదవులదగ్గర చేర్చినాడు. సమీపములో ఢస్లాం వెండిపనిచేసిన హుక్కా ఉన్నది. దాని గొట్టాలు రెండింటికీ జలతారుగుడ్డ చుట్టి ఉన్నది. హుక్కాపొగ కొంచెము కొంచెముగా వస్తున్నది.

ఇంట్లోగాని వెలుపలగాని మనుష్యుల కంఠధ్వని వినబడడము లేదు. ఎడతెగని పంఖా చప్పుడు, గడియారపుటిక్కు-టిక్కు, హుక్కా అస్ఫుట కాకలీస్వరమూ గదిలో గాలికి మాంద్యము కలిగిస్తున్నట్టు ఉన్నవి. దూరపు అడవిలోనుంచి కుక్క యేడుపు గాలిమీద తేలుతూ మధ్యమధ్య కిటికీవెంట లోపలికి ప్రవేశిస్తున్నది.

హుక్కా గుడగుడ అంతకంతకు మందగించి చివరకు ఆగిపోయింది. దానిస్థానే జమీందారుగారి నాసికాధ్వని ఉపక్రమించింది. బాబుగారినోట్లో ఉన్నగొట్టము ఈమంచి తరుణములో ఆయన చేతిలోనుంచి ముక్తి చెంది, పక్క మీద పడిపోయింది. కాస్త విశ్రాంతి పొందుదామని దానికికూడా అభిలాషే. కాని ఆవేళకే సరిగా గడియారము కొట్టడము ప్రారంభించింది. మొదట కురుర్రుమని, తర్వాత రింగ్ టింగ్ అని, చివరకు జన్ జన్ అన్నది. పర్వతమయమైన స్విట్జర్లాండు దేశములో, ఒకానొకగ్రామములో, ఒకనాడు ఈ గడియారానికి ప్రాణప్రతిష్ఠ జరిగింది. జలమయమైన వంగదేశములో ప్రకోష్ఠశాలలో, ప్రవాసములో ఉన్న గడియారాన్ని గంటగంటకూ పూర్వస్మృతి మోగిస్తూ ఉంటుంది. టంగుటంగు మని నాలుగుదెబ్బలు కొట్టేసరికి కాంతి చంద్రబాబుకు మెళుకువ వచ్చింది. బాబు కళ్ళు నులుముకొని, లేచి కూర్చుని, హుక్కాగొట్టము నోట్లో పెట్టుకొని, గడియారముకేసి చూసి, "కోయీ హై"! అని కేకవేసినాడు.

"ధర్మావతార్!" అని హరిచరణుడు వెలుపలనుంచి కేక వేసి పంఖాతోడు ఆపి, తలుపు తెరచి, లోపల ప్రవేశించి, తల వంచుకొని నిలుచున్నాడు.

కాంతిబాబు వాడివంక చూసి "వాకిట్లో ఎవరున్నారు ?" అని ప్రశ్న చేసినాడు.

"భోలా బాగ్డీ ఉన్నాడు హుజూర్ !"

"రాంసింగ్ కో తలబ్ కర్."

"చిత్తం, ధర్మావతారా," అని హరిచరణుడు బయటికి పోయి భోలాకు హుకుం ఇచ్చి, మళ్ళీ పంఖా లాగడము మొదలుపెట్టినాడు.

అంతట కాంతిచంద్రబాబు పక్క మీదినుంచి లేచి, ఉత్త కాళ్ళతో ఇటూ అటూ పచారు చేయసాగినాడు. కొంత సేపటికే కిటికీవద్దకు పోయి కొబ్బరాకులు మృదువుగా కదలుతూ ఉండడము చూస్తూనిలుచున్నాడు. కొబ్బరిచెట్టు మీద కూర్చున్నగద్ద కాంతిబాబుగారి తీక్ష్ణదృష్టి తనమీదపడ్డదనుకొని భయపడి అరిచి, ఎగిరిపోయింది.

రామసింగు వచ్చి యజమానికి నమస్కారముచేసి నిలుచున్నాడు. దీర్ఘకాయుడైన ఆపశ్చిమదేశస్థుడు ఒకొక్కప్పుడు దర్వాంజీగా ఉంటాడు; మరొకప్పుడు జమీందారుగారి అంగరక్షక పదవిలో ఉండి కృతార్థుడవుతాడు.

కాంతిబాబు రామసింగును చూచి "చిన్నబాబు ఎక్కడున్నాడు?" అని అడిగినాడు.

"తొమ్మిదిగంటలప్పుడు బోటుమీద షికారు వెళ్ళారు హుజూర్"

"తుపాకీవాళ్లు ఎవరెవరు వెంట వెళ్ళినారు?"

"గులాం-ఆలీ, ఫౌజుదార్ సింగు, భగవాన్ తేవారీ వెళ్ళారు హుజూర్."

"ఉహుం" అని కాంతిబాబు ఒకటిరెండు నిముషాలు ఏమో ఆలోచిస్తూ నిలుచున్నాడు. యజమాని ఆజ్ఞకోసము రామసింగు వినయముతో నిలుచుని ఎదురుచూస్తున్నాడు.

"రాయజీకి కబురు పంపు" అని కాంతిబాబు ఇంతలో హుకుం ఇచ్చినాడు.

"జోహుకుం హుజూర్" అని రామసింగు వెళ్ళిపోయినాడు.

# ౨

కాంతిచంద్రుడు జోడు తొడుక్కొని తయఖానానుంచి బయటికి వచ్చినాడు. ఆయనశిరస్సు మీదుగా గొడుగు పట్టి హరిచరణుడు వెంట నడుస్తున్నాడు. మార్గములో మధ్యమధ్య కనబడుతున్న ఆశ్రితులు నమస్కారాలుచేసి తొట్రుపాటుతో పక్కకు తొలుగుతున్నారు.

జమీందారు బైఠక్ ఖానాకు వచ్చినాడు. పరివారములో పిల్లలిద్దరు ఆవరణములో ఒకమూల కూర్చుని ఆడుకొంటున్నారు. కాంతిబాబును చూడగానే వాళ్ళు ఆట ఆపివేసి, బెదురుతూ లేచి, మునివేళ్ళమీద నడుస్తూ వెళ్ళిపోయినారు. కాంతిచంద్రుడు మందగమనముతో మెట్లెక్కి పైకి వెళ్ళినాడు. ఖాన్‌సామా తాంబూలమూ, పొగాకూ ఇచ్చి వెళ్ళిపోయినాడు. జమీందారు కూర్చుండి తాంబూలము వేసుకొంటూ రాయజీకోసము ఎదురుచూస్తున్నాడు.

రాయజీ అంటే సీతానాధరాయలు; జమీందారుకు చిన్ననాటి స్నేహితుడు. జమీవ్యవహారాలలో ఆయనకు కుడిచెయ్యి. ఈచిన్న విశాలాక్షీ జమీకి "సాల్సబరీప్రభువు" వంటివాడు. ఈబ్రాహ్మడు తంత్రాలు పన్నడములో కృత

హాస్తుడు. ఇప్పుడు ఒకానొక గొప్పవిషయములో జమీందారు ఈయన సలహా తీసుకోవలసి ఉన్నది.

తనయేకపుత్రుని బుద్ధినిగురించి కాంతిచంద్రుడు ఏమో ఆలోచిస్తున్నాడు. కుమారుణ్ణి కలకత్తాలో ఉంచి ఇంగ్లీషు ట్యూటరును పెట్టి చదువు చెప్పించడము చాలా పొరపాటయినదని ఆయన అనుకొన్నాడు. ఇంగ్లీషువారితో కలవడమువల్ల కుర్రవాడి స్వభావము ఇంగ్లీషువారి స్వభావమువలె అయిపోయిందనుకొన్నాడు. వేట విషయములో తన కొమారునకున్న వ్యసనాన్ని గురించి ఆయన తలపెట్టనే లేదు. వంశాను గతముగా తనవారి కందరికి ఆగుణము ఉన్నదే. ఆయనకు మాత్రము షికారులో ఎక్కువ వ్యసనము లేదు. ఆయన తండ్రి పినతండ్రులకూ వేటంటే మహాప్రీతి. ఆయన రెండో పినతండ్రి చాలా చిన్నతనములోనే ఎన్నో సార్లు అదృష్టమువల్ల పులి నోటినుంచి యివతల పడి బతికినట్టు లోకులు కథలు చెప్పుకొంటారు. తనకుమారునకున్న యీవ్యసనాన్ని గురించి ఆయన లెక్కచెయ్యలేదు, కాని కొడుకుఎప్పుడో ఒకప్పుడు క్రైస్తవుడయిపోతాడని మాత్రముచింతించినాడు.

కాంతిచంద్రుడు ఈ ఆలోచనలలో ఉండగా సీతానాథ రాయలు దయచేసినాడు. అతను పొట్టివాడు, లావాటివాడు, కారునలుపు, ముఖాన వెట్రిక అన్నమాట లేదు, నెత్తి

ముందరకూడా అంతే. కాలొకటి పొట్టిది కావడముచేత అతను కాలుకొంచెము ఎగురవేస్తూ నడుస్తాడు.

ఆయనకు సంస్కృతము వచ్చు నన్న ఖ్యాతి ఉన్నది. మాట్లాడేటప్పుడు ఎక్కువగా సాధు భాషనే వాడుతాడు రాయలు. ఆయన లోపలికివచ్చి తనరాకకు గుర్తుగా "అబ్బా, గ్రీష్మము ఈవేళ చాలా ప్రచండభావము వహించిందే" అన్నాడు. పెడముగము పెట్టుకొని కూర్చున్న కాంతిచంద్రుడు సీతానాథుని కేసి తిరిగి చిరునవ్వు నవ్వి "నిజమే. భోజనానంతరం కాస్త విశ్రాంతికోసం ప్రయత్నించాను, కాని నిద్ర అసలే రాలేదు" అన్నాడు.

"నేనూ ప్రయత్నించాను, కాని కృతకృత్యుణ్ణి కాలేకపోయినాను. యత్నే కృతే యది న సిధ్యతి కోత్ర దోషః" అని బిగ్గరగా నవ్వి, నవ్వడమయినతర్వాత "ఈవేళ అసమయంలో పిలిపించారేమి అన్నగారూ!" అన్నాడు.

"కూచో. చాలాసంగతులున్నవి."

రాయలుకూర్చున్నాడు.

"సూర్యపురము సంబంధంమాట ఆలోచిస్తున్నాను." అన్నాడు కాంతిబాబు.

ఎదురుగా ఉన్న పాన్‌దానులోనుంచి తమలపాకుచుట్ట తీసి వేళ్ళతో తిప్పుతూ "ఏమి స్థిరపరిచారు?" అని సీతానాథు డన్నాడు.

"ఇంతవరకు ఏమీ స్థిరపరచలేదు. ఏమి జబాబు ఇస్తామని ఆలోచిస్తున్నాను."

"నాఆలోచన కావలెనంటే తక్షణం స్థిరపరచండి. హరిహర చట్టోపాధ్యాయ బాబుకు ఒక్కతే కూతురు. గొప్పఆస్తి. చివరకు మీయింటికే వస్తుంది."

కాంతిబాబుకు అదే నమ్మకము. అయినప్పటికీ ఇలాగ న్నాడు: "ఆస్తి మాయింటి కెలా వస్తుంది? హరిహరబాబు కొమార్తెని పెంచుకోడా?"

"ఆవిషయమై మీరు నిశ్చింతగా ఉండవచ్చు. నేనాసంగతి బాగా భోగట్టా చేశాను. ఆయన పెంపుడు చేసుకోరు. హరిహర బాబు హిందూకాలేజీలో చదువుకొన్నాడు. బుద్ధి అంతా ఇంగ్లీషు బుద్ధి. నాఆస్తి నాకూతురూ అల్లుడూ అనుభవించాలి గాని ఇంకొకళ్ళ పిల్లవాడిని తీసుకు వచ్చి వాడి కిస్తానా అంటాడు."

"అవును. ఆసంగతి నేనూ విన్నాను. కాని ఆయన ఇస్తాన న్నదానికి మనం ఎలా రాజీపడతాము? సుందరవనంలో ఆయన హిస్సా మనకు వ్రాసిస్తే తక్షణం వివాహం నిర్ధారణ చేస్తాను."

సీతానాథుడు కొంచెము ఆలోచించి "మీరు చెప్పింది బాగానే ఉన్నది. కాని ఒక్కసామెత ఉంది-"ఎక్కువగా లాగకు,

తెగేను.'' సుందరవనంలో భూమి ఈవేళ కాకపోతే రేప యినా మీాదే అవుతుంది" అని చెప్పినాడు.

కాంతిచంద్రుడు కొంచెము దూకుడుతో ఇలా గన్నాడు: "రేపు కాదు, ఈవేళే కావాలి! నాజమీా పక్కదే ఈ జమీా. నాదృష్టి దీనిమీాదనే ఉంది. నాకు డబ్బూ అక్కర లేదు, జవాహరీ అక్కరలేదు. ఈ భూమి మీాంద చేవ లుండ నియ్యను. మెట్టభూమి చేస్తాను."

"ఎప్పటికైనా వస్తుంది."

"ఎప్పటికైనా వస్తుందని ఎవ రన్నారు? ఆయన ఎవరినీ పెంచుకో డనుకొందాము. ఆయన భార్యకు సంతానం కలగ దనుకొందాము. ఇవి వదిలినా, నీ కింకో సంశయం కలగడం లేదా!"

సీతానాధరాయలు బాగా ఆలోచిస్తూనే ఉన్నాడు. కాని జమీాందారు బుద్ధికుశలతకంటె తనబుద్ధికుశలత కాస్త తక్కువగా కనబరిచి మధ్యమధ్య ఆయనను సంతోషపెట్టవలెనని అతని అభిప్రాయము. కాబట్టి "నాకేమీా స్ఫురించడం లే" దన్నాడు.

"స్ఫురించడం లేదా? మంచిది, హరిహరబాబుకు వయ స్సెంత?"

"పదుచువాడే. మీాయీా డనుకొంటాను."

"ఆయనభార్య నేడు చనిపోతే రేపు మళ్ళీ ఆయన పెళ్ళాడడా!"

అప్పుడు సీతానాధరాయలు ముఖాన ఆశ్చర్యదీప్తి తెప్పించుకొని, తల పంకించి "అవునవును. ఆమాట నాకు తోచింది కా" దన్నాడు.

కాంతిచంద్రుడు మోసపోయినాడు. ఈకల్ల మాటలకు భ్రమించి కొంచెము దర్పముతో త్వరత్వరగా పలుకాకూయీల్చసాగినాడు.

"ఆలాగయితే నేను సూర్యపురం వెళ్ళి మాట్లాడుతా" నన్నాడు రాయలు.

"మంచిది, కుదుర్చు. రెండువేలు దక్షిణ యిస్తాను" అని కాంతిచంద్రుడు నవ్వినాడు.

సీతానాధుడు మనస్సులో గుణించుకొంటూ "రెండువేలు. అపక్షంవారు మరో రెండువేలు. వెరసి నాలుగువేలు" అనుకొన్నాడు.

కాంతిచంద్రుడు ఇంకొక తములపాకు చుట్ట నోట్లో వేసుకొని "మంచిది. సూర్యపురంవారు ఎలాటి కులీనులు? ఇదివరలో మాకూ వారికీ ఎన్నడూ సంబంధాలు జరగలేదు" అన్నాడు.

"సూర్యపురమువారు లక్ష్మిపాశాకులీనులు. వారి అసలు నివాసము మీలక్ష్మిపాశాగ్రామంలోనే. వారి చరిత్ర మీకు తెలియదా?"

"వారు రామానంద చక్రవర్తి సంతతివారేనా?"

"అవును. రామానంద చక్రవర్తి శాకడగంజి జిల్లాలోని నరమంగళ గ్రామమునుంచి నివాసము మార్చుకొన్నాడు. తన కులమర్యాదలు రక్షించుకొనడానికి ఒక మోస్తరుగా పారిపోయినట్లు లోకులు చెప్పుకొంటారు. తర్వాత లక్ష్మి పాశా సమీపగ్రామము-ఏమిటి చెప్మా" అని సీతానాథుడు తల వాల్చి, కళ్ళు మూసి, ఆలోచించసాగినాడు. అతని యెడమచేతి తర్జని అప్పుడే పట్టుకొన్న బొమ్మిడాయి చేపవలె కదులుతూ ఉన్నది. ఇంతలో ఆగ్రామము పేరు జ్ఞాపకము వచ్చింది. తత్క్షణము సీతానాథు డిలాగన్నాడు: "ఆఁ, ధోపాదాగ్రామము-ధోపాదావచ్చి చాలాబలవంతముమీద ఆయన మజుందారువారి పిల్లను పెళ్లాడినాడు. వారిపిల్లను పెళ్ళాడడముచేత కులగౌరవము కొంచెము తగ్గినమాటవాస్తవమే. కాని ఆయనకు చాలాధనము లభించింది. అప్పటినుంచీ లక్ష్మిపాశాకులీనుల ఉత్పత్తి. కాబట్టి ఆవిషయమై సూర్యపురపు చట్టోపాధ్యాయులను ఎవ్వరూ తక్కువగా చూడలేరు." శాంతిచంద్రుడు కొంచెము పరధ్యానముగా ఉండి "గోపాలుడికి ఒకటిరెండు మాసాలలో వివాహం చేతామని

నిర్ధారణ చేసుకొన్నాను. వాడికి ఈడు వచ్చింది. ఆలస్యం చెయ్యడము యుక్తము కాదు" అన్నాడు.

సీతానాథుడు నవ్వుతూ "మనుమడిముఖం చూతామని అభిలాష కలిగినట్టుంది. కుఱ్ఱవాడికి వివాహం చెయ్యండి. ఈడు వచ్చిం దనకండి. ఇరవైయేళ్ళు ఏమంత పెద్దయీడు! బాల్యం ఇంకా పూర్తిగా వీడలేదు." అన్నాడు.

మాణిక్యాగొట్టము నోటిలోనుంచితీసి సీతానాథునిచేతికిచ్చి "కాదు కాదు. ఒకటిరెండు సంగతులను గురించి కొంత ఆలోచిస్తున్నాను. గోపాలుడి స్వభావం తెల్లవాళ్ళ స్వభావం వలె కనబడడం లేదా?" అని కాంతిచంద్రుడన్నాడు.

"ఆవిషయమై బెంగపెట్టుకోవద్దు. అలా సంశయించడానికి హేతువు లేదు, చిన్నతనంచేత కొంచెం విశృంఖలంగా ఉంటాడు. ఈ యీడప్పుడు మీసంగతులు జ్ఞాపకం తెచ్చుకోండి!" అని సీతానాథుడు జమీందారుమీద సాభిప్రాయదృష్టి ప్రసారించి మందహాసము చేయసాగినాడు.

"నాఉద్దేశం ఏమిటో తెలుసునా? ఇక వాణ్ణి కలకత్తా పంపను. వ్యవహారాలు చక్కబెట్టడానికి ఇదివరకు వచ్చిన వ్రాతకోతలు చాలు. ఇంగ్లీషు మాట్లాడుతాడు. ఆనాడు మేజస్ట్రీటు వాడితో మాట్లాడుతుంటే ఎంత బాగున్నది! బాబూ, మీఅబ్బాయి ఇంగ్లీషువారివలె ఇంగ్లీషుమాట్లాడు

తాడని ఆయన నాతో అన్నాడు. ఇక వాణ్ణి ఇంటిదగ్గర వుంచి జమీా వ్యవహారాలు కొస్త కొస్త నేర్పవలె అని అభిప్రాయం. అందుకని పెద్దపిల్లకోసం వెతుకుతున్నాను."

"అలాగా! చిన్నబాబుకోసం ప్రయత్నం చేస్తున్నారా! బుద్ధి పాశ్చాత్యభావాలతో నిండిపోయుం దంటిరే-బాబు వివాహానికి అంగీకరిస్తాడా? ఈకాలపువాళ్ళు తమ యిష్టాను సారంగా వివాహాలు చేసుకొంటారని వింటాము."

ఈమాటలకు కాంతిచంద్రుడు నిర్లక్ష్యముగా మందహాసము చేసి "కాంతిచంద్రుడి అభిమతానికి విరుద్ధంగా ఏపనైనా జరగడం నీ వెన్నడైనా విన్నావా?" అని చదరంగపు డబ్బి తెరిచి సీతానాథుణ్ణి పావులు పెట్టుకోమని సైగచేసి, ఆట ప్రారంభించాడు.

తన కుమారుడే తనకు ప్రతికూలముగా ఉంటాడన్న ఊహ కాంతిబాబుకు కలగలేదు. రాయీ రాయీ రాచుకుంటే అగ్ని పుట్టుతుంది.

# 3

శ్రీమతి కమలాదేవి కాంతిచంద్రుని సహధర్మిణి. ఆమె తండ్రి నిధిరామ భట్టాచార్యులు చాలా ధనవంతుడు. ఆయన చనిపోయి పదేళ్ళయినది. ఆయన వ్రాసిపోయిన విల్ ప్రకారము కమలాదేవికి పిత్రార్జితములోనుంచి నెలకు రెండు వందల రూపాయల చొప్పున యావజ్జీవమూ ముట్టుతుంది. తండ్రిపోయిన తర్వాత ఆమె సోదరులకు ఆస్తి విషయమై పెద్ద తగాదా వచ్చింది. ఆసమయాన కాంతిచంద్రుడు జోక్యము కలిగించుకొని నేర్పుతో సమస్తమూ సంభాళించకపోయినట్లయితే ఆస్తి యావత్తూ నిస్సంశయముగా పాడయిపోయేదే. కమలాదేవి కిప్పుడు నలభై యేళ్ళు వెనుకటిరోజులలో ఆమె చక్కనిదని ఖ్యాతి ఉండేది. కమలాదేవి సాక్షాత్తుగా కమలాదేవి! సార్థకనామము అని లోకు లనేవారు. ఆవిడ శరీరాన ఇప్పటికీ సౌందర్యచిహ్నాలు లేకపోలేదు. లావు కావడము మానివేసి కొంచెము సన్నబడడానికి ఆమె సంకల్పించినట్లయితే ఇంకా కొన్ని సంవత్సరాలవరకూ సౌందర్య ఖ్యాతికి చలనము ఉండదు. ఆమె నేత్రాలు విశాలమైనవి; ఇప్పుడవి పూడుకుపోతున్నవి. చాలానగలు బిగుతు అవుతున్నవి. కమలాదేవికి మొదట స్త్రీశిశువు కలిగి మూడేళ్లు పెరిగి

పోయింది. తర్వాత అయిదుసంవత్సరాల దాకా సంతానము కలుగలేదు. ఇంట్లో పెద్దవాళ్ళు ఆలోచన చేయసాగినారు. సాధువుల వల్ల ఓషధులు తాయెత్తులూ పుచ్చుకొని, దేవతలకు మొక్కుకొని కమలాదేవి చివరకు నవగోపాలుని కన్నది అందుచేత గోపాలుడంటే మహా గారాబము. అతని తర్వాత ఇద్దరు ఆడపిల్లలు పుట్టినారు. ఆమె వితంతు ఆడబిడ్డ వాళ్ళను పెంచు తున్నది. కమలాదేవి స్వయముగా నవగోపాలునిసంగతులు చూస్తూఉంటుంది.

అప్పుడు తొమ్మిదిగంట లయింది. పూజాగృహములో కూర్చుని కమలాదేవి పూజ చేస్తున్నది. అవతలనుంచి కుమారుడు అమ్మా అమ్మా అని పిలిచినాడు

“ ఏమి నాయనా? ”

“ ఎక్కడున్నావు అమ్మా? ”

“ ఇక్కడున్నాను, పూజామందిరంలో నాయనా ! ”

నవగోపాలుడు లోపలికి అడుగుపెట్టి భయముతో మళ్ళీ బయటికివెళ్ళి జోడువిప్పి వట్టి కాళ్ళతో లోపల ప్రవేశించినాడు. అతనికి ఇరవై సంవత్సరము లుంటవి. దేహము సుందరము, బలిష్ఠము. అతని కేశములు కొంచము పొడుగుగా ఉన్నవి. పచ్చని రొమ్మునిూద యజ్ఞోపవీతము పొడుగుగా కనబడుతున్నది. అతని నేత్రాలు వికాసముగా ఉన్నవి. అతను పీట వేసు

కొని తల్లిదగ్గరగా కూర్చుని « అమ్మా, నిన్ను తాకనా ?" అన్నాడు.

« వద్దు నాయనా, నీవి మైలబట్టలు, పూజ ఇంకా పూర్తి కాలేదు."

« తాకుతా నమ్మా" అని గోపాలుడు చేతులు తల్లిదగ్గిరికి తీసుకుపోయినాడు.

కమలాదేవి శరీరము ముడుచుకొని « ఎందుకీ దుష్టుతనం ! తాకితే పట్టుబట్ట కట్టుకుని వచ్చి తాకు" అన్నది.

సరే అని నవగోపాలుడు లేచివెళ్లికొంచెము సేపటిలో నీలవర్ణపు పట్టుబట్ట కట్టుకొని వచ్చి పీటమీద కూర్చుని "ఈ సారి తాకనా?" అన్నాడు.

« ఆగు ఆగు. గంగాజలముతో చేతులు కడుక్కో."

నవగోపాలుడు చేతులు చాచినాడు. తల్లికొడుకు చేతులలో గంగోదకము వేసి వేలితో అతని అవయవముల మీద చల్లింది. చల్లటినీళ్లు మీద పడడముచేత అతని ఒళ్లు జలదరించింది.

« గంగా గంగా గంగా అనునాయనా"

« గంగా గంగా"

« మూడుసార్లు అను."

"గంగా గంగా గంగా" అంటూ నవగోపాలుడు రెండు చేతులతో తల్లిని తాకినాడు.

కమలాదేవి ప్రేమతో కుమారుని శిరస్సుమీద హస్తముంచి కేశములు సవరిస్తూ "సంధ్యావందనం బొత్తిగా మాని వేశావే" అన్నది.

"ఎందుకు చెయ్యాలి అమ్మా!"

"చచ్చువాళ్ళము! కబుర్లు నేర్చుకున్నావు. సంధ్య మాని వేస్తే ఎలా? పైగా నారాయణపూజా శివపూజా చెయ్యవలె. సంవత్సర మయిందో లేదో అంతా చల్లబడ్డావి!"

"సంవత్సరము చేశాను చాలదూ?"

"ఏమి చాలుతుంది? బ్రాహ్మణ పిల్లవాడు ప్రతినిత్యమూ సంధ్యావందనం చేయవలసిందే"

"చూడు అమ్మా" రోజూ సంధ్యావందనం చేస్తే ఏమీ లాభం లేదు. వెనుకటి రోజుల్లో లిపి లేకపోవడంచేత మంత్రాలూ, తంత్రాలూ, వేదాలూ బ్రాహ్మణుల నోళ్లలో ఉండేవి. అప్పుడు ఋషులూ మునులూ మరుపు తగలకుండా రోజూ ఆవృత్తి చేసేవాళ్ళు. ఇప్పుడు అచ్చువచ్చింది. మరిచిపోయినా మరేమీ నష్టం లేదు. ఈరోజుల్లో రెండు పూటలా సంధ్య వారిస్తే కాలహానన మవుతుంది"

"పిచ్చిమాటలు మాట్లాడుతున్నావు! చాలా పెద్దవాడివయి పోయినావు! నియమప్రకారం సంధ్యావందనం, ఆహ్నికం

మొదలైనవి చేస్తే ఆరోగ్యం కలుగుతుంది. తెలుసునా ?" నవగోపాలుడు బిగ్గరగా నవ్వి "అమ్మా, శాస్త్రజ్ఞానం ఈ విశాలాక్షీ గ్రామములోనికి కూడా వచ్చిందా ? పట్నాల సరిహద్దులలోనే దీని పరిభావం అనుకొన్నాను !" అన్నాడు.

"ధర్మకార్యాలలో బుద్ధి ఉన్నవాళ్లకు ఆరోగ్యముంటుంది. పట్నపుసరిహద్దులలోనే ఉండడ మేమి ? శాస్త్రపరిభావం అన్నిచోట్లా ఉంది."

కిటికీలోనుంచి కొంచెముకొంచెముగా గాలి విసురుతున్నది. మందువాలో ఉంచిన మారేడు మొక్క కొద్దిగా కదులుతున్నది. నవగోపాలుడు దానికేసి చూస్తూ "అమ్మా, పాఠశాలలో పండితుడు హరుచక్రవర్తి మంచి నిష్ఠాపరుడేనా ?" అన్నాడు.

తల్లి కొంచెము చురుకుగా "నిష్ఠాపరుడు కాకేమి? మూడు వేళలా సంధ్య వార్చంది మంచినీళ్ళయినా తాగడు" అని చెప్పింది.

నవగోపాలుడు తల ఆడిస్తూ చిరునవ్వుతో "అయితే నెల కొకసారి ఆయనకు చలిజ్వరం వస్తుం దెందుకు ?" అని అడిగినాడు.

"అవును. మలేరియాజ్వరం తగిలితే మనిషి ఏం చేస్తాడు ?" అన్నది తల్లి.

నవగోపాలుడు కోర్టులో వకీళ్ళవాదాలు విన్నాడు. వాళ్ళ వలె కృత్రిమరోషము తెచ్చుకొని పీట కదిలించి "మలేరియా కానీ, డింగీజ్వరము కానీ, ఎందుకు రావాలి జ్వరము? రెండుపూటలా సంధ్యావందనం చేసేవాళ్ళకు ఆరోగ్యము నిలిచేపక్షంలో హారాధనచక్రవర్తికి నెలనెలకూ జ్వరం ఎందుకు తగులవలి?" అన్నాడు.

కమలాదేవి మౌనముతో గంధము తియ్యడం మొదలు పెట్టింది.

"జవాబు చెప్పవే మమ్మా. జ్వ౦ మెందుకు తగులుతుంది?" అన్నాడు కొడుకు.

కోపమువచ్చి తల్లి "వెళ్ళి ఆయన్నే అడుగు" అన్నది.

జయము కలిగినట్లుగా ఎంచి విజయుడు తల త్రిప్పుతూ "అయితే అమ్మా, నాకు జ్వరం తగలదేమి?" అన్నాడు.

తల్లి గంధము తీస్తూ "హోహో, మహా తెలివితేటలు కనబరుస్తున్నావు! మహా ఆరోగ్యవంతుడవు, శూరుడవు!" అన్నది.

"అడివిలో మొన్న రెండుపందులు చంపానమ్మా"

"మహాగొప్పపని చేశావు!"

"నే నెందుకు సంధ్యావందనం చేస్తాను? ఇదివరకే తేలిపోయింది — చెయ్యకపోయినా ఆరోగ్యం ఉంటుందని. తేలిందమ్మా, తేలింది."

హోహో అని తల్లి గట్టిగా గంధము తీస్తున్నది. ఆమెకు విసుగు పుట్టిందని గమనించి నవగోపాలుడు "అయితే అమ్మా, సమాధానం చెప్పలేదే. నేనైతే ఏం చెప్తానో తెలుసునా?" అన్నాడు.

"ఏం చెప్తావు?"

"సుఖంగానీ దుఃఖంగానీ కర్మఫలాన్నిబట్టి వస్తుందా! చాలా మంది తల్లిదండ్రులపుణ్యంవల్ల తప్పించుకుంటారు. కొంత మంది పుణ్యాత్ములు పెద్దలపాపంవల్ల జ్వరం తగిలి క్వైనా మింగి చచ్చిపోతారు."

కమలాదేవి కుమారుని తీక్ష్ణబుద్ధికి సంతోషించి "నీవలె నేనూ నెలజీతాలిచ్చి చదువుకోలేదు నాయనా" అని నవ్వింది.

# ౪

శివపూజ చెయ్యడానికి కమలాదేవి ఇప్పటికి ఆయత్తమయింది. ఈపర్యాయ మామె పూజమీద దృష్టి నిలిపింది. నవగోపాలుడు కూర్చుని పూజ చూస్తూ ఉన్నాడు.

ఆమె శివధ్యానము ప్రారంభించింది. „ధ్యాయే ర్నిత్యం మహేశం”

నవగోపాలుడు „ఊహుఁ, ధ్యాయే ర్నిత్యం కాదు, ధ్యాయే న్నిత్యం. ధ్యాయేత్ + నిత్యం = ధ్యాయే న్నిత్యం” అన్నాడు.

„ధ్యాయే న్నిత్యం? మంచిది. ధ్యాయే న్నిత్యం మహేశం రజతగిరినిభం చారుచంద్రవతనాశమ్”

„అయ్యో, కాదు కాదు, వతనాశం కాదు; చారుచంద్రావతంసమ్. అంటే, చారుచంద్రుడు అవతంసం ఎవనికో ఆయనను.”

„అవతంసమ్? మంచిది, చారుచంద్రావతంసమ్. రత్నకల్ప జలంఘుం—”

నవగోపాలుడు నవ్వి „అంతా తప్పులు చదువుతున్నావు. జలంఘుం ఏమిటి? ఆహాహా!” అన్నాడు.

"అయితే ఏమిటి?

"రత్నకలోజ్జ్వలాంగమ్. ఆమె శరీరం ఎలా ఉజ్జ్వలంగా ఉన్నది? రత్నకల్పం, అంటే రత్నంతో సమానంగా."

"ఏమన్నావు?"

"రత్నకలోజ్జ్వలాంగమ్"

"నాకు ఉచ్చారణ కుదరదురా నాయనా! ఆడవాళ్ళం, మాకేమి తెలుస్తుంది? బహుకాలం ఏది అలవాటో అదే అంటూ వుంటాము."

నవగోపాలుడు ఇంటిదగ్గర ఉన్నప్పుడు మధ్యమధ్య పూజా సమయాన ఇలాగే వచ్చి కూర్చుంటాడు. స్తోత్రాలు పఠించే సమయములో తల్లి నుస్రతాన తప్పులు పట్టడము ప్రస్తుత కాలములో అతనికి ప్రధానసంతోషము. తల్లికి కోపము వచ్చిందని అతడు కొంచెముసేపు ఊరుకొన్నాడు కాని మళ్ళీ ఒకటి రెండుచోట్ల సవరణ చెయ్యకుండా ఉండలేక పోయినాడు. కమలాదేవి నోరు ఏమన్నప్పటికీ హృదయము మాత్రము అసామాన్యమైన కొడుకు పాండిత్యానికి పొంగి పోతున్నది.

ఆమె స్తోత్రం ముగించినతర్వాత నవగోపాలుడు "అమ్మా, చూడు. నాకు కాస్త పైసా ఇస్తావా?" అన్నాడు.

"ఎందుకు? ఏంచేస్తావు?"

“పిట్టలు పెంచుతాను. పక్షులను పెంచవలెనని చాలా కుతూహలంగా వున్నది.”

పూజాద్రవ్యాలు ఎదుటినుంచి తీసి సర్దుతూ కమలాదేవి “అదికాదు. ఎన్ని రూపాయలు కావలి?” అని కొడుకు నడిగింది.

“ఇప్పుడు తెలియదు. ఎన్ని రూపాయలు కావలసి వస్తే అన్నీ ఇస్తావా?”

“పిట్టలు పెంచడానికి ఎన్ని రూపాయలు కావలసివస్తవి? పదో, మహా ఐతే ఇరవై రూపాయలో, ఇప్పుడే యిస్తాను.”

“మంచిది. ముమ్మాటికీ ఇస్తావా, ఇస్తావా, ఇస్తావా?”

“ముమ్మాటికీ అంటా వెందుకు? ఇస్తానుగా” అని తల్లి నవ్వుతూ అన్నది.

అప్పుడు నవగోపాలుడు ఒళ్ళు కుదిలించి నిటారుగా కూర్చుని “అమ్మా, చెప్పేసెయ్యి. చివరకు నే నివ్వలేనంటే వల్లపడదు. నే నెలాంటి పిట్టలను పెంచుతానో తెలుసునా? ఏవో రెండో మూడో చిలకలో గోరువంకలో పెంచుతా ననుకొన్నావా యేమిటి? నాకూ ఒ పంజరం అనుకొన్నావేమో!” అన్నాడు.

“కాకపోతే ఏమిటి?”

“అలా అయితే పదిరూపాయలతోటే అయిపోతుంది. అది కాదమ్మా, అదికాదు. నేను చెప్పేది వింటే పూర్తిగా

ఆశ్చర్యపడతావు." అప్పుడు పరిచారిక వచ్చి "దాదా బాబూ అన్నం వడ్డించారు" అని వెళ్ళిపోయింది.

"ఏమిటో చెప్పు, వింటాను" అన్నది కమలాదేవి.

"నేను పెంచేది రెండో మూడో పిట్టలు కావు, అనేకం పెంచుతాను. వాటిని మామూలు పంజరాల్లో పెట్టి వేళ్లాడదియ్యను. పంజరంలో పిట్టలకు చాలా కష్టంగా వుంటుంది. ఎగరడానికి వీలుండదు. రెక్కలు మూసుకుపోతవి. వాటికి ఎగరడమే మహానందం. అది నాస్తి పోతుంది. తర్వాత, పిట్టను పంజరంలో ఒంటిరిగా వుంచడం మహా అన్యాయం! ఒంటిరిగా వుంటే దాని కేమీ తోచదు. "అందుచేత పెద్దపంజరాల్లో ఒక్కొక్క రకం పిట్టలు అనేకం వుంచుతాను. అవి యిష్టం వచ్చినట్టు ఎగిరి గంతులు వెయ్యడానికి వీలుంటుంది. పంజరం ఒక్కొక్కటికి ఈ గదంత వుంటుంది."

"పోరా పిచ్చివాడా! గదంతా పంజరా లెందుకు? నే నెన్నడూ వినలేదు. ఇంత పెద్దవి ఎక్కడ వేలాడదీస్తావు?"

"ఎక్కడ వేల్లాడదీసేదీ అప్పుడు చూతువుగాని లే. వాటి మధ్య రకరకాల చెట్లు వుంటవి, ఎత్తువుగా వుండవు. మంచి మంచి పళ్ళజాతు లుంటవి, కొంతవరకు స్వతంత్రంగా వున్నట్టే పక్షులు అనుకుంటవి."

"వాటిమధ్య రెండుమూడు మనసులుండవూ? పిట్టలు నీళ్ళెక్కడ తాగుతవి?" అన్నది తల్లి నవ్వుతూ.

"నవ్వకో కమ్మా, అంతా తయారయినతర్వాత చూతువు గాని. పంజరం ఎలా వుంటుందో విను. ఉక్కుతీగెల తడకలు తోటలో పళ్ళచెట్లువున్నచోట చుట్టిస్తాను. తెలిసిందా? మధ్య నేల, చుట్టూతా, పైనా తీగెలతడకలూ, ఎండా వానా అన్నీ నిరభ్యంతరంగా లోపలికి వచ్చేస్తవి. ఇటువంటి ఒక్కొక్కయింట్లో ఒక్కొక్కజాతిపక్షులు చాలా వుంటవి."

"ఛీ పిచ్చివాడా! చిడియాఖానా తయారు చెయ్యమంటావా? అంతడబ్బు ఎక్కడనుంచి వస్తుంది? ఇరవయ్యో, కటపెట్లమీద ముప్ఫయ్యో ఇవ్వగలను. వాటితో ఏం వస్తే అది చెయ్యి."

"ముప్ఫైరూపాయలతో ఏ మవుతుంది? వాటితో అయితే నిన్నడగడ మెందుకు? వెయ్యిరూపాయలకు తక్కువ కావు!"

"అమ్మో! వెయ్యిరూపాయిలు ఖర్చుచేసి ఎవరూ పిట్టలు పెంచినట్టు వినలేదు. అది జరగడం వట్టిది!"

"వల్లపడదు—ఇస్తానన్నావు, ఇచ్చి తీరాలి!"

"ఇస్తానన్నప్పుడు ఇంత కార్ఖానా కట్టించాలని నాకు తెలుసునా? పిట్టలు పెంచేవాళ్ళు రెండుమూడు పంజరాలు చేయిస్తారు, రెండుమూడుపిట్ట లుంచుతారు. ఈకాలపు నీపద్ధతి నాకెలా తెలుస్తుంది?"

నవగోపాలుడికి కోపము వచ్చింది. చిన్నప్పటినుంచీ కమలా దేవి కొడుకును గారాబముతో పెంచి చెడగొట్టింది. కుర్రి వాడు ఏది కావలెనని పట్టుపట్టితే అది జరిగేది. కమలా దేవి ధనవంతుడిబిడ్డ, ధనవంతుడి భార్య. అందుచేత అనాయాసముగా డబ్బు ఖర్చుచేసి కొడుకుముద్దు లన్నీ తీర్చేది. ఇప్పుడు అతను వింటాడా ?

అతని కళ్ళవెంట నీళ్ళు వచ్చినవి. అప్పుడు తల్లి కొంచెము మెత్తపడి " మంచిది. ఒకపని చెయ్యి, బాగా వుంటుంది. నీపంజరానికి తడకలు గిడకలు వద్దు. ఆకాశమే పై కప్పు. గాలే గోడలు ! తోటలో వున్నవతు లన్నీ నీవే అనుకో " అని కొడుకుగడ్డము పట్టుకొన్నది.

నవగోపాలుడు నేలవంక చూస్తూ ఏమీ బదులు పలకలేదు. తల్లిమాటలకు అతని కళ్ళవెంట నీళ్ళు బొటబొటా కారినవి. అప్పుడు తల్లి ప్రేమతో " ఒక్కసారి చూడమ్మ ! కళ్ళ నీళ్ళు విడుస్తారా పిచ్చిపిల్లవాడా ! ఎంత వెర్రివాడవురా !" అని కన్నీళ్ళు తుడిచింది.

అయిదువందలరూపాయలకు చివరకు రాజీ అయింది.

అప్పుడు నవగోపాలుడిముఖాన మళ్ళీ మందహాసము కనబడ్డది. అతను ఉత్సాహముతో "చూడమ్మా, నేను పెంచే పిట్టలను ఎల్లకాలమూ పంజరంలో వుంచుతా ననుకోకు. అవి

గుడ్లు పెడతవి. అయి పిల్లలై యెదిగినతర్వాత ముసలిపిట్ట లను వదిలేస్తాను" అని చెప్పినాడు.

"ముసలిపిట్ట బిడ్డలను వదిలిపెట్టి వెళ్ళడానికి ఇష్టపడతవా? నిన్ను వదిలిపెట్టి నన్ను ఎక్కడికైనా పొమ్మని ఎవరైనా అంటే నేను వెళ్ళగలనా?" అన్నది తల్లి.

నవగోపాలుడు ఆదరణతో తల్లిముఖముకేసి చూచినాడు. ఆమెముఖాన దయ తాండవమాడుతున్నది.

పరిచారిక మళ్ళీ వచ్చి "దాదాబాబూ, మీకు వడ్డించి చాలాసే పయింది. చల్లారిపోతున్నది" అని చెప్పి వెళ్ళిపో తున్నది.

"అమ్మభోజనంకూడా నాగదిలోనే వడ్డించమని చెప్పు" అన్నాడు నవగోపాలుడు.

పనికత్తె యజమానురాలి ముఖమువంక చూచింది. కమలా దేవి సమ్మతి కనబరుస్తూ తల తిప్పింది. పరిచారిక వెళ్ళి పోయింది.

నవగోపాలుడు తల్లితో "అయితే రూపాయ లియ్యి. రేపే కలకత్తా వెడతాను సామానులు యావత్తూ కొనడానికి. రైలుమీద వెళ్ళను, పడవమీద వెడతాను. పిట్టలు, కర్రలు, తీగతడకలూ కొని పడవలో వేసి ఇంటికి తీసుకువస్తాను. ఇవన్నీ రైలులో తేవడం అట్టే వీలుగా వుండదు" అన్నాడు.

"మంచిది. అన్నీ చేతువుగాని. పద నాయనా, ఇక భోజ నానికి" అన్నది తల్లి.

# ౪

విశాలాక్షికి అయిదుకోసుల దూరాన ఉత్తరముగా పినాకినీ నదిఒడ్డునే మహేశపుర మనేగ్రామ మున్నది. పేరులో ఉన్న పటాటోపము గ్రామములో లేదు. అసలు అది గ్రామమే కాదు, కాసిని యిళ్ళు. పైగా దూరదూరముగా ఉన్నవి. ఎదురుగా అడివినడుమ ఉండే జీర్ణగృహము గదాధరచట్టోపాధ్యాయుడిది. కాంతిచంద్రుడికి ఎదురుపార్టీ సోణాపుర శాబుల తరఫు వ్యవహారాలు చూస్తూఉంటాడు గదాధరుడు. నదికి ఇటూ అటూ ఉండే కొన్నిగ్రామాలకు ఆయన గుమాస్తా. ఆగ్రామవాసుల దగ్గరనుంచి పన్ను వసూలు చేసేభారము ఆయనదే. పైసా వసూలుచేసి అప్పుడప్పుడు సోణాపురము కచ్చేరీకి వెళ్ళి పెద్దనాయబుకు లెక్కచూపించి వస్తూ ఉంటాడు.

ఆయనవంశానికి ఒక్కలోప మున్నది. అందుచేత పదేళ్ళ కిందట భార్యపోయినా ఆయనకు వివాహము కాలేదు. ఆయనకుమారుడు పశ్చిమమున ఉద్యోగము చేస్తున్నాడు. అతనికి వివాహము చెయ్యడానికి ఇంతవరకూ వీలు కాలేదు. రమాసుందరి, రాజలక్ష్మి, అని ఆయనకు ఇద్దరుకూతుళ్ళు. రమాసుందరికి పధ్నాలుగేళ్ళు వెళ్ళిపోతున్నప్పటికీ పెళ్ళి

కాలేదు. ఇంత యెదిగినపిల్లకు పెళ్ళి కాకుండా ఉన్నదని గదాధరుడు చాలా విచారపడుతాడు. కాని ఉపాయ మేమిటి? ఈపిల్లలు కాక, ఇంట్లో ఆయనవితంతు అక్క ఉన్నది. ఆమెకు కళ్ళు బాగా కనపడవు చెవులు బాగా వినపడవు. అయినప్పటికీ ఏదో తవుకుకుంటూ ఇంట్లోపను లన్నీ చేస్తుంది. లక్ష్మి అనే హిందూస్థానీ దాది కూడా ఉన్నది. ఆమె రాజపుత్రివంశములో పుట్టింది. ఆమెతండ్రి బలవంతసింగు సిపాయీలతిరుగుబాటులో ధనప్రాణాలు కోల్పోయినాడు. ఆమె తోబుట్టువుకొడుకువంశము వారు ఇప్పటికీ ప్రతాపగడ రాణాలు. కాని ఆమెవంశములో బాలబాలికలు కొందరు బిచ్చమెత్తుతూ, కొందరు దాస్య వృత్తి అవలంబించి, జీవనము చేస్తున్నారు. గదాధరుడు పదిపేనేళ్ళకిందట పనిమీద సకుటుంబముగా కాశీ వెళ్ళి ఆరుమాసము లున్నాడు. అప్పుడు లక్ష్మి ఆయనపరివార ములో చేరింది. చిన్నతనములోనే తల్లి పోయినందువల్ల అతనిపిల్లలను తన పద్ధతులప్రకారము పెంచి పెద్దవాళ్ళను చేసింది లక్ష్మి.

రమ చాలా చక్కనిది. అందగత్తె అయితేనేమి—దాది పెంపకమువల్లనో, జన్మనక్షత్రప్రభావమువల్లనో రమ పట్ట శక్యముకానిది. అదృష్టవశాత్తు వాళ్ళు అడవిలో ఉంటు న్నారు కాబట్టి సరిపోయింది, కాని నలుగురిలో ఉంటే

తల యెత్తుకొని తిరగడానికి వీలు ఉండేది కాదు. అడివిపిల్ల వలె రమ చెట్లెక్కుతుంది. స్నానానికి వెళ్ళి పియాలీనదిని ఒకొలిక్కి తీసుకొని వస్తుంది. పుష్కరిణిలో చేపలు పట్టు తుంది. ఇంత యెందుకు—అలుగులు కూడా విడుస్తుంది. రమ అంటే లక్ష్మి ప్రాణము విడుస్తుంది. చిన్నప్పటినుంచీ లక్ష్మి రమను తన బిడ్డవలె ప్రేమించి, కుచ్చెళ్లు పోసి బట్ట కట్టుకొనడము నేర్పింది. రమ తరుచుగా ఇప్పటికీ అలాగే బట్ట కట్టుకొంటుంది. లక్ష్మి స్వహస్తాలతో అల్లికపని చేసిన అంగీ రమ ఒంటిమీద ఉంటుంది. వేషభూషలలో రాజలక్ష్మి అక్కతో పాటయినా స్వభావముమాత్రము అక్క స్వభావముతో క్షత్రియోచితము కాదు.

మధ్యాహ్నము లక్ష్మి రమను, రాజలక్ష్మిని, ఇరుగుపొరుగు ఇళ్ళ పిల్లలను కూచోబెట్టి వచ్చీరాని వంగభాషలో స్వదేశపుకథలూ, సిపాయీల తిరుగుబాటునాటి కథలూ చెప్పేది. వీరులరక్తము శరీరములో ప్రసరిస్తున్న ఆరాజపుత్రస్త్రీ నోట వీరరసాత్మక చరిత్రలు వింటున్నప్పుడు రమాదేవి అంతరంగము మహోత్సాహముతో ఉద్దీప్తమయ్యేది. యుద్ధాదివర్ణనలు వింటున్నప్పుడు రమ నిద్రమాటే మరచి పొయ్యేది. పొరుగింటి యదునాథ పురోహితుడిభార్య అపరాహ్ణవేళ మహాభారతము చదివేది. రమ వారింటికి వెళ్ళి నిశ్చలముగా కూర్చుని వినేది. ఆమెకు బాగా నచ్చిన

ఘట్టాలు మళ్ళీమళ్ళీ వినవలెనని పట్టుపట్టేది. పురోహితుడి భార్య సంతోషపూర్వకముగా రమాదేవికోరిక చెల్లించేది. ఈవిధముగా చాలాసార్లు వినడముచేత మహాభారతఘట్టాలనేకము రమకు ముఖస్థమయినవి.

అలుగులు విడవడముకూడా లక్ష్మి నేర్పింది. మొదట చెట్లు బోదెలకు గురిపెట్టి రమ అమ్ములు విడిచేది. ఒకసారి అమ్ము పిట్టకు తగిలింది. ఆర్తధ్వని చేసి పక్షి కింద పడిపోతే రమ విల్లూ అమ్ములూ అవతల పారవేసి పిట్టను రొమ్ముకు హత్తుకొని నీళ్ళు చల్లి, కన్నీళ్ళు విడుస్తూ దాన్ని బతికించవలెనని చాలా ప్రయత్నము చేసింది. కాని పిట్ట బతికలేదు. నాడు మొదలు నేటివరకూ రమ విల్లంబులు మూలపడవేసి మళ్ళీ ముట్టుకోలేదు. ఎవరైనా పిల్లలు అవి ముట్టుకోబోతే "జాగ్రత్త! ముట్టుకోవద్దు" అనేది. అయితే చాలాసార్లు ఆమెమనస్సులో ప్రలోభము కలుగుతూ ఉండేది.

పుష్కరిణిఒడ్డున మామిడితోపు. మధ్యాహ్నపుఎండ చరచరలాడుతున్నది. అది మొత్తముమీద మామిడితోపు అయినప్పటికీ ఖర్జూరాలూ, కొబ్బరిచెట్లూ మొదలైనవి కొన్ని ఉన్నవి. కొబ్బరిచెట్లనిండా పచ్చిబొండాలు. ఖర్జూరగుత్తులు ఆకుపచ్చగా ఉన్నవి; అక్కడక్కడ కొన్నికొన్ని పసుపు రంగులోకి దిగినవి. మామిడికాయలు ఇంకా దోరపట్టలేదు. గదాధరుడి దొడ్డిగుమ్మము తెరిచి కొందరుపిల్లలు వెలుపలికి

వెళ్ళినారు. మామిడికాయలు పడవెయ్యడానికి కొంకికర్రి చేత్తో పట్టుకొని అందరికంటె ముందు రమ నడుస్తున్నది; వెనక బాలురు, బాలికలు, కొందరిచేతుల్లో చిన్నబుట్టలు, కొంతమందిచేతుల్లో పేముబుట్టలు, చిన్నచిన్న పాత్రిలూ ఉన్నవి. ప్రితిసంవత్సరము చేసే "కాసుందీ" (ఉప్పు, చింతపండు, ఆవాలు, మామిడికాయలపాకము) కోసము పిల్లలు మామిడికాయలు కొయ్యడానికి తయారయినారు.

రమ పెద్దచెట్టుకిందికి వెళ్ళి, కొంగు నడుముకు కట్టుకొని, కాయలు రాల్చడం ఆరంభించింది. కాయలు నిండుగా ఉన్నకొమ్మకు కొంకికర్రి తగిలించి సత్తువకొద్దీ లాగేది; ఒకసారి మామిడికాయలగుత్తి పడవేసేది. తపతప మని నాలుగువైపులా మామిడికాయలవాన కురిసింది. అందరూ పరుగెత్తివెళ్ళి కాయలు పోగుచేశారు. ఒక చిన్నపిల్లవీపు మీాద పెద్దమామిడికాయ పడ్డది దెబ్బకు పిల్ల యేడ్చింది; అంతా నవ్వినారు. రమాసుందరి నిర్లక్ష్యముతో "కాయ వీపుమీాద పడిందని అంత యేడుస్తారా!" అన్నది.

"నీమీాద పడితే అప్పుడు తెలుస్తుంది" అన్న దాపిల్ల.

రమ వెంటనే "మంచిది. వంగి నిలుచున్నాను. మీాలో ఎవరో నావీపుమీాద కాయ రాల్చండి" అని ధనుస్సువలె వంగి నిలుచున్నది. ఆమె వీపుమీాద కాయ రాల్చడానికి ఒక్కొక్కరే ప్రియత్నించారు. లాభము లేకపోయింది.

కాయలు అటూ ఇటూ పడ్డవి కాని ఆమెమీద పడనే లేదు.

కాయలు రాల్చడానికి పిల్లలు ఒకచెట్టుదగ్గరనుంచి మరో చెట్టుదగ్గరకు వెళ్ళినారు. బుట్టలన్నీ నిండిపోయినవి కాయలు రాలుతూ ఉన్నవి, ఒకపక్క తినడముకూడా జరుగుతున్నది. కొంగుకు కట్టి మామిడికాయలు చెట్టుకువేసి కొట్టి పిండి చేస్తున్నారు. తర్వాత వెంటతెచ్చిన ఉప్పు కలిపి తిన్నారు. క్రమముగా పళ్ళు పులిసినవి, ఒళ్ళు గరిపొడిచింది. తినడము మాత్రము మానలేదు.

అదివరలో మామిడికాయ పడి దెబ్బతగిలిన పిల్లను గండు చీమ కుట్టింది. కుర్రది గట్టిగా ఏడవసాగింది. రఘు వెళ్ళి ఓదార్చి, మంత్రము వేసి, ఫూ అని ఊదింది. ఏమీ లాభము లేకపోయింది. ఆపిల్ల యేడుస్తూ వెళ్ళిపోయింది.

ఇంతలో చెట్టుమీద పిట్టకూత వినబడ్డది. అందరూ ముఖాలు పైకెత్తి చూచారు. ఆకుపచ్చని పెద్దపిట్టలు రెండు ఎగురుతున్నవి. ఆఅడవిలో చాలా పిట్టలున్నవి. అవన్నీ పిల్లలు బాగా గుర్తుపట్టగలరు. కాని ఈపిట్టలు వారు ఎన్నడూ చూడలేదు. ‹‹ చిలకా?›› అన్నారొకరు. ‹‹ చిలకెందుకయింది—ఇంత పెద్దదిగాఉంటుందా? పైగా ముక్కు ఇంత లా వుంటుందా?›› అన్నారు మరొకరు.

"ఈపిట్టలు ఇక్కడివి కావు. పట్టుకుంటాను" అని రమా దేవి చప్పున ఇంట్లోకి వెళ్ళి పిట్టలు పట్టేవల తీసుకు వచ్చింది.

అప్పటికి పిట్టలు రెండూ ఒకచెట్టుమీద వాలినవి. వల బుజముమీద వేసుకొని రమ చెట్టెక్కింది. పిట్ట లున్న కొమ్మకు కొంతదగ్గరగా ఉన్నకొమ్మ కెక్కి నెమ్మదిగా పిట్టలమీద వల విసిరివేసింది. ఒకటి తప్పించుకొన్నది. రెండవది వలలో చిక్కుకొని తన్నుకొంటూ వలతోపాటు కింద పడిపోయింది.

పిట్ట కింద పడడము చూచి కొందరు పిల్లలు ఆవైపు పరుగెత్తినారు. రమ చెట్టుమీదినుంచే "జాగ్రత్త! ముట్టుకొనేరు! ఎగిరిపోతే మజా చూపిస్తాను" అని కేక వేసింది. బాలికలు బెదిరి దూరముగా నిలుచున్నారు. తర్వాత ఆమె కిందుగా ఉన్నకొమ్మ పట్టుకొని వేలాడింది. కొమ్మ ఆమెతోపాటు పైకీ కిందికీ ఊగింది. కాస్తసేపు ఈవిధముగా ఖులాసాగా నాట్యముచేసి చివరకు "జయ, జననీ, కాళీ" అంటూ నేలమీదికి దూకింది. మామిడికాయలబుట్ట ఒకటి వెంటనే ఖాళీచేసి బోర్లించి పిట్టను ఉపాయముగా వలలోనుంచి తప్పించి బుట్టలో ప్రవేశపెట్టింది; పెట్టి, రెండవ పిట్టను వెదకడానికి వెంటనే బయలుదేరింది. ఆమె యెక్కే చెట్టూ దిగేచెట్టూ అయినదే కాని లాభము లేకపోయింది.

పిట్ట ఒకచెట్టుమీదినుంచి మరొకచెట్టుమీదికి వాలడము మొదలుపెట్టింది. విసుకుపుట్టి రమాసుందరి సావాసకత్తెలతో "మీరు వెళ్లి పిట్ట ఏచెట్టుమీద ఉన్నదో కనిపెట్టి ఉండండి. నేను ఇంట్లోనుంచి పంజరము తెచ్చి పిట్టను జాగ్రత్తచేసివస్తాను" అని చెప్పింది. వాళ్ళు పిట్టను వెతకబోయినారు. రమ ఇంట్లోనుంచి పాతయినపపంజరము తెచ్చింది. బుట్టలోనుంచి పిట్టను తప్పించి పంజరములోకి చేర్చడము ఎలాగనేది సమస్య. పిట్ట వలలోనుంచి బుట్టకిందికి తేలికగానే వెళ్ళింది, కాని బుట్టలోనుంచి బయటికి తీసేటప్పుడు ఎగిరిపోకుండా చూడవలె. రమ ఆలోచించి ఒక ఉపాయము చేసింది. బుట్టకు ఒకపక్క బాగా సందు చేసి నాలుగువైపులా చేతితో తట్టడము మొదలుపెట్టింది. అందువల్ల పిట్ట నాలుగుమూలలా తిరుగుతూ హఠాత్తుగా సందులోనుంచి తోక బయటికి పెట్టింది. రమ వెంటనే కాలితో తోక నొక్కిపట్టి బుట్ట తెరిచింది. పిట్టను చేతితో పట్టికొని పంజరములో వెయ్యబోయేటప్పుడు పిట్ట వేలు కరిచింది. అది పంజరములో పడ్డది. కాని రమ వేలివెంట బొటబొటా నెత్తురు కారింది.

పంజరముతలుపు వేసి ఆమె పుష్కరిణి దగ్గిరికి పోయి గాయమయిన వేలు నీళ్ళలో పెట్టింది. నెత్తురు కారడము తగ్గిపోయిన తర్వాత చీరెకొంగు చించి వేలికి కట్టు కట్టుకొన్నది. మంటమాత్రము తగ్గలేదు.

తర్వాత రను చెట్టుక్రిందికి వెళ్ళి పిట్టమీద నిప్పులు కురిపించింది. కాంకికర్ర తీసుకొని పంజరము మీదా పక్కలనా కొట్టుతూ "దౌర్భాగ్యపు పిట్టా! ఇంకా కరుస్తావా, ఇంకా కరుస్తావా, ఇంకా కరుస్తావా!" అన్నది. అప్పుడామె ముఖమండలము మహోజ్జ్వలముగా ఉన్నది, ఆమె వైఖరి చిత్తరువువలె ఉన్నది. ఆమె కావిషయము తెలియదు, కాని చూచేవారు ఎవరైనా అక్కడ ఉంటే ముగ్ధులయిపోతారు. కోపము తగ్గినతర్వాత రను పంజరము ఇంట్లోపెట్టి రెండవ పిట్టకోసము వెళ్ళుదా మనుకొన్నది; అనుకొని పంజరము తీసుకొని వెనక్కు తిరిగింది. ఉన్నతకాయుడయిన సుందర యువకుడు అక్కడ నిలుచుని మందహాసము చేస్తున్నాడు.

# ౬

యువకుడు రమాసుందరి చేతిలో ఉన్న పంజరమువంక చూస్తూ "ఈపిట్ట నాది. ఇచ్చివెయ్యి" అన్నాడు. రమ జయజననీ కాళీ అంటూ చెట్టుమీదనుంచి క్రిందికి దూకింది మొదలుకొని జరిగిన విషయమంతా దూరమునుంచి చూచి నాడు.

ఇతరులతో ఆట్టే పరిచయములేని రమాసుందరి అతనివైపు హేళనగా చూస్తూ "ఈపిట్ట మీదా? మీరెవరు! పిట్టమీద మీపేరు వ్రాసి ఉన్నదా యేమి!" అన్నది.

యువతి నోటివెంట నిస్సంకోచముగా ఇటువంటి మాటలు రావడముచేత నవగోపాలుడికి ఆనందము కలిగింది. సంతోషము పైకి కనబడనియ్యక "పిట్ట నాదే. పడవలోనుంచి వస్తున్నాను. పంజరము తెరిచేటప్పటికి పిట్టలు తప్పించుకు పోయినవి. వాటిని వెతుకుతూ వచ్చాను" అని గోపాలుడు అన్నాడు.

రమ కంఠస్వరము కాస్త తగ్గించి "ఆ, పడవ యేమిటి? పిట్టలేమిటి? అన్నది."

"పడవనిండా పిట్టలు"

"ఏమి పిట్టలు? అన్నీ ఇటువంటివేనా?"

ఆమె భావము మారిపోవడము కనిపెట్టి నవగోపాలుడు లాలించే కంఠస్వరముతో "పడవనిండా పిట్టలున్నప్పుడు అన్నీ ఇటువంటివే ఎందుకు కావాలి? చిన్నవి, పెద్దవి, నల్లవి, ఎర్రవి, పచ్చవి — కొన్ని రంగురంగులవి, కొన్ని రంగులు లేనివి" అన్నాడు.

"పక్షుల వ్యాపారము చేస్తారా మీరు?"

నవగోపాలుడు కొంచెం ఆలోచించి అవునన్నాడు.

"మీ పడవ ఎక్కడున్నది? నాకు మీ పిట్టలన్నీ చూపిస్తారా?" అని రమ అడిగింది.

నవగోపాలుడు ఘట్టమువంక వేలు చూపుతూ, "అక్కడ మా పడవ కట్టివేసి ఉన్నది. చూడవలెనంటే నావెంట రా" అన్నాడు.

రమాసుందరి పొంగిపోయి "కొంచెము ఉండండి. ఈపంజరము ఇంట్లోపెట్టి వస్తాను" అని ప్రత్యుత్తరము కోసము ఎదురు చూడకుండా ఇంట్లోకి వెళ్ళిపోయింది.

అక్కడే నిలిచి నవగోపాలుడు ఆలోచనలో పడ్డాడు.

ఇంత వింత కన్యను అతను ఎక్కడా చూడలేదు. రూపరేఖలు, హావభావములు చూస్తే బాలికవలె ఉన్నది. అయినా, యువతి వాక్కు చూస్తే వంగదేశ వనిత, కాని వస్త్రములు చూస్తే పశ్చిమ దేశ స్త్రీవలె కనబడుతున్నది.

ఈమె యెవరో తెలుసుకోవలె. ఇంతపెద్దపిల్ల, పెళ్ళికాలేదేమి చెపుమా! ముఖాన కుంకుమబొట్టు లేదు.

రమాసుందరి వచ్చింది. మల్లవేషము తీసివేసి, ముఖమూ చేతులూ శుభ్రముగా కడుక్కొని వచ్చి నవగోపాలుడి వద్దనము వైపు చూచి "పోదాము పదండి" అన్నది.

ఇద్దరూ బయలుదేరినారు. ఆప్రదేశము అడవివలె ఉన్నది. పెద్దపెద్దచెట్లు చాలా ఉన్నవి. ఒక్కొక్క చోట తలయెత్తి చూస్తే ఆకాశము కనబడదు. అడవిలో చాలా భాగము చెట్లకు తీగలు అల్లుకొని ఉన్నవి. తీగలకు రంగురంగుల పూలు పూచి ఉన్నవి. వైశాఖ మాసపు ఎండవేడికి నేల మీద గడ్డి ఎండిపోయింది. ఏడాదిలో ఎక్కువభాగము నేల బురదబురదగా ఉంటుంది. తోవలో ఇద్దరికీ సంభాషణ ప్రారంభ మయినది. ఎన్నోవిధాల ప్రశ్నలువేసి నవగోపాలుడు ఆమె సంగతులు చాలా తెలుసుకొన్నాడు. తాను పిట్టల వ్యాపారము చేసేవాడు కాడనే సంగతి విప్పిచెప్ప లేదు.

మాట్లాడుతూ వారు నదీతీరము చేరినారు. పడవ కట్టివేసి ఉన్నది. పడవ పైభాగమున మంచెవంటి ఆచ్ఛాదనము ఉన్నది. దానికింద పక్షుల పంజరాలు చాలా ఉన్నవి. ఒక్కొక్కజాతి పక్షులు ఒక్కొక్క పంజరములో పెట్టినారు. కొన్నికొన్ని పంజరాలలో పదిపన్నెండు పిట్టలుచొప్పున

ఉన్నవి. నవగోపాలుడు రమనువెంట బెట్టుకొని ఒక్కొక్క పిట్టనే చూపుతున్నాడు. రమ ఉత్సాహముతో పక్షులను గురించి ఎన్నో సంగతులు అడిగింది. చూపడము కాగానే గోపాలుడామెతో "పద, నిన్ను మీయింటిదగ్గర దిగబెట్టి వస్తాను" అన్నాడు. పైనుంచిదిగి ఒడ్డున అడుగుపెట్టబోతూ రమ పడవలోకి చూచింది. అక్కడ తుపాకి కనబడ్డది. "ఆ తుపాకి ఎవరిది?" అన్నది రమ.

"నాదే."

"తుపాకీ పేల్చడం మీకు తెలుసునా?"

"తెలుసును."

"ఒకసారి కాల్చి చూపుతారా?"

"అలాగే" అని నవగోపాలుడు తుపాకీ తోటాలు బర తీసుకువచ్చి "ఇక్కడ కాలిస్తే పిట్టలు బెదురుతవి. కొంచెము దూరము పోదాము" అన్నాడు.

ఇద్దరూ పడవ దిగినారు. "తుపాకీ పేల్చడము నేనెప్పుడు చూడలేదు" అన్నది రమ. ఆమె కంఠస్వరములో వినయమూ, దైన్యమూ పొడచూపినవి.

"నీవు తుపాకీ కాలుస్తావా?" అని నవగోపాలుడు ఉత్సాహముతో అన్నాడు.

"ఎలా కాల్చాలో నాకు తెలియదు."

"నీకు నేర్పుతాను. ముందు నేను కాలుస్తాను. చూడు. ఇలా చేత్తో పట్టుకోవాలి. ఇలా తోటాలు దూర్చాలి. తర్వాత ఇలా - గుర్తుపెట్టుకొని, గుర్రాన్ని ఇలా ఒత్తాలి" అంటూ నవగోపాలుడు తుపాకి పేల్చినాడు. తుపాకి నోటి నుంచి చాలా పొగ వచ్చింది.

"ఈసారి నేను కాలుస్తాను" అంటూ రమ అతనిచేతులలో నుంచి తుపాకి తీసుకొన్నది. మొట్టమొదట ఆమెకు తోటాలు పెట్టడము చేతకాలేదు; నవగోపాలుడే దూర్చి యిచ్చినాడు. రమ తుపాకిమడమను రొమ్ముమీద పెట్టుకోబోయింది.

"ఊహూం. అలా కాదు అలా కాదు. గుండెమీద పెట్టుకో
డదు. కాల్చినప్పుడు తుపాకి ఎదురు తన్నుతుంది. ఒక్కొక్క
ు మనిషిని పడవేస్తుంది. ఈమాదిరిగా డొక్క మెను
సరిగా మోచెయ్యి తగిలేలాగు పట్టుకోవలి."

ను చెప్పిన ప్రకారము తుపాకీ పట్టుకొని రమాసుందరి
్రము నొక్కింది. తుపాకి పేలి పెద్దమోత మోగింది. రమ
హోత్సాహముతో "ఇంకోసారి కాలుస్తాను" అన్నది.

ఆమె సాహసము ఉత్సాహమూ చూచేసరికి నవగోపాలుడికి చాలా ఆశ్చర్యము కలిగింది.

తర్వాత ఇద్దరూ ఇంటివైపు బయలు దేరినారు. తుపాకీ యజమాని మీద ఆమెకు నిండుభక్తి ఏర్పడ్డది. మళ్ళీ ఒక

సారి ఆమె అతనికేసి చూచి "మీరు ఏయే జంతువులు వేటాడినారు ?" అని అడిగింది.

"లేళ్ళు, అడివిపందులు, పక్షులూ—చాలా చంపాను."

పక్షులను చాలా చంపాను అనే మాటలకు రమ మనస్సు చివుక్కు మన్నది. "పెద్దపులిని ఎప్పుడైనా చంపారా?" అన్నది.

"ఒకసారి"

"ఎలా చంపారో చెప్పరూ!" అంటూ ఆమె ఆదుర్దాతో నిలుచున్నది. నవగోపాలుడు ఆమెను స్నిగ్ధదృష్టితో చూచి నాడు. ఆమె సరళ నేత్రములలో కుతూహలము కనబడ్డది. "పెద్దపులిని ఎలా చంపానో వింటావా నువు?" అన్నాడు. వెనుకటి వలె ఆతురతతో, చెప్పండి, అన్నది.

"ఒకసారి పడవమీద నదిమధ్యగా వెళ్ళుతున్నాను. అప్పుడే చీకటి పడుతున్నది. నీటిలో చబ్ చబ్ అనే శబ్దము వినబడ్డది. బాబో, పెద్దపులి, అని పడవవాళ్ళు చెప్పారు. వెంటనే తుపాకి తీసి కాల్చాను. గుండు పులికి తగిలిందో లేదో తెలియదు. అయితే పులి ఒడ్డుకు పోతు న్నది. పడవ కూడా దాని వెంటనే పోనివ్వండి అన్నాను. పులి ఒడ్డు ఎక్కగానే మళ్ళీ తుపాకి పేల్చాను. భయంక ముగా బొబ్బ పెట్టుతూ పులి నిలువునా ఎగిరి కింద పడి చ్చిపోయింది" అని నవగోపాలుడు చెప్పినాడు.

ఈవేట సంగతి వింటూ రమ ఆశ్చర్యముతో విస్ఫారిత నేత్రములు అతని మీద నిలిపి నిలుచున్నది. కొంత సేపటికి నిట్టూర్పు విడిచి "వేటాడటము చేతనైతే బాగుండును!" అన్నది.

మొదటినుంచీ నవగోపాలుడు ఈమె పనులు పరిశీలిస్తూ ఉండడముచేత ఆశ్చర్యము మీద ఆశ్చర్యము పొందినాడు. జయ జననీ కాళీ అని ఆమె మీదినుంచి కిందికి దుమికింది మొదలుకొని తుపాకి కాల్చేవరకూ ఆమె పనులన్నీ అసాధారణముగా ఉన్నవి. ఆమె వేటాడవలెనని వుగ్రత చూపినప్పుడు అతనికి వింత కలగలేదు. "ఒకనాడు వేటకు వెళ్ళుదాము. నావెంట వస్తావా రమా?" అన్నాడు గోపాలుడు.

ఆమె కన్నులు కృతజ్ఞత చూపిస్తూ నిగనిగలాడినవి. "నన్ను తీసుకు వెళ్ళుతారా?" అన్నది రమ.

"అలాగే. ఎప్పుడు వెళ్లుదామో చెప్పు."

"మీరు ఎపుడు తీసుకు వెళితే అప్పుడే."

"ఎల్లుండి పోదామా?"

"సరే. ఎల్లుండి రెండు ఝాములకు ఈఘట్టము దగ్గర వస్తాను."

"మంచిది. మరిచిపోగూడదు!"

ఇంతలో వారు ఇంటిదగ్గరికి చేరినారు. "మరిచిపోగూడదు సుమా" అంటూ రమ ఇంట్లోకి వెళ్ళింది. నవగోపాలుడు రెప్ప వాల్చకుండా రమకేసి చూస్తూ నిలుచున్నాడు. అతను పూర్తిగా ఆశ్చర్యములో మునిగిపోయినాడు. అందుచేత తనప్రస్తావన సంబు అవునా కాదా, జరుగుతుందా జరగదా అనే మాటలు అతనికి తోచనేలేదు.

## ౭

సాయంకాలము ప్రాంగణమున పెద్దవాన చినుకులు పడు తున్నవి. రాయగృహిణి వంటయింటి వసారాలో చిత్రాసనము మీద కూర్చుని జపమాల పట్టుకొని జపము చేస్తున్నది. వంటయింట్లో వెలుగుతున్న దీపపుకాంతి కిటికీగుండా వసారాలో పడుతున్నది. ఆ వెలుతురులో రాయగృహిణిని గుర్తించవచ్చును. ఆమె దగ్గరగా నల్లపిల్లి కూర్చుని అర్ధనిమీలిత నేత్రాలతో మత్స్యాల కోసము ధ్యానము చేస్తున్నది. వెలుతురు బాగా పడుతున్నట్లయితే ఆమె పెదవులు కదులుతున్నట్లు కనబడేవి. ఇప్పుడు ఆమె కంఠస్వరము మాత్రము మృదువుగా వినబడుతున్నది.

హరే కృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే
హరే రామ హరేరామ రామరామ హరేహరే.

దూరాన కాలిచప్పుడు వినబడ్డది. రాయగృహిణి చెవి యొగ్గి విన్నది. శబ్దము దగ్గరకు వస్తున్నది. సీతానాథుడు మెట్లెక్కి వసారాలోకి వచ్చి నిలుచున్నాడు.

“సీతూ” అన్నది తల్లి.

“ఆఁ నేనే.”

“వానలో తడిశావా?”

« లేదు. ఎందుకు తడుస్తాను? గొడుగు వెంట తీసుకు వెళ్ళాను."

« బట్టలు తడవలేదు గద!"

సీతానాథుడు ధోవతి చెంగులు పట్టుకొని చూచి, "అక్కడక్కడ నాలుగుచినుకులు పడ్డాయి. ధోవతి తడిసి పోలేదులే" అన్నాడు.

నమ్మకము కలగక "దగ్గిరికి రా, చూస్తాను" అన్నది తల్లి. కుమారుడు దగ్గరకు వెళ్ళి నిలుచున్నాడు. తల్లి అతని ధోవతి పట్టుకొని చూచి « తడవలేదా? బాగా తడిసిపోయింది. పో, పోయి త్వరగా ఇంకోబట్ట కట్టుకో" అన్నది. తల్లిఆజ్ఞ నెరవేర్చడానికి సీతానాథుడు తనగదిలోకి వెళ్ళి పాలుకాక్క తయారుచెయ్యమని నౌకరుతో చెప్పినాడు. మేజామీద పరుపువేసి ఉన్నది. పొడిబట్ట కట్టుకొని సీతానాథుడు పరుపుమీద కూర్చుని ధూమపానము ప్రారంభించినాడు.

రాయగృహిణి గోముఖముపట్టుకొని మెల్లిమెల్లిగాకుమారుడి గదిదగ్గిరికి వెళ్ళి నిలుచున్నది. ఆమె కొంచెము పొడుగాటిది. కొద్దిరోజులకిందట తీర్థయాత్రకు వెళ్ళి తీర్థరాజమైన ప్రయాగలో శిరోముండనము చేయించుకొన్నది. కొద్దిగా పెరిగి ఉన్న వెంట్రుకలు మగవాళ్ళవెంట్రుకలవలె ఉన్నవి.

ఆమెముఖాననుగాని అవయవాలలోగాని స్త్రీజాతికి సహజమైన కోమలత్వము లేదు. ఆకిరసనాయిలుదీపము వెలుతురులో ఆమె మగవానివలె కనబడుతున్నది. ఆమెకు డెబ్బై యేళ్ళుంటవి. అంతవయస్సులోకూడా ఆమెకు సామాన్యగృహిణులందరికంటె ఎక్కువ సత్తువ ఉన్నది. రాయగృహిణి అనవసరమైన ఉపోద్ఘాతము లేకుండా కొడుకును చూచి "కాంతి ఎందుకు పిలిపించావు నన్ను?" అని అడిగింది.

"ఒకసంగతి ఆలోచించడానికి"

"ఏమిటది?"

"పిల్లవాడిపెళ్ళివిషయము."

"నవ్వాపెళ్ళా? నాకు జ్ఞాపకమున్నదీ—బి. యే. అయ్యేదాకా గోపాలుడికి పెళ్ళిచెయ్యరట కాదూ?"

"అవును. ఇదివరలో ఆలాగే అనేవాడు. కాంతిబాబు మనస్సు మారిపోయింది. పిల్లవాణ్ణి ఇంక చదివించడుట."

రాయగృహిణి గంభీరముగా "అవునన్నమాట. అయితే సంగతి? ఎక్కడనుంచయినా సంబంధం వచ్చిందా యేమి?" అన్నది.

సీతానాథుడు ఆలోచించి నీళ్ళు నములుతూ "ఫలానా అని ఇంకా లేదు. ఏదో అనుకోవడముమాత్రమే" అన్నాడు.

"ఎక్కడేమిటి?"

"సూర్యపురము జమీందారు కూతురు."

"నిజంగానా!" అని ఆమె ఊరుకొన్నది. ఆమె ముఖభంగి ఎంతమాత్రము ప్రసన్నముగా లేదు. సీతానాధుడు ధూమపానము చేస్తున్నాడు.

కొంచెముసేపుండి తల్లి "నీ అభిప్రాయమేమిటి?" అన్నది.

"నా అభిప్రాయమా? నా అభిప్రాయమువల్ల ప్రయోజనమేముంటుంది?"

"ప్రయోజనమేముంటుందా?" అని ఆమె చురుకుగా అన్నది. "ప్రయోజనము లేకపోతే నీతో ఆలోచించవలసిన అవసరమేముంటుంది? ఎవరి ఆలోచనవల్ల కాంతిబెనర్జి ఇంతవాడయినాడు!"

"నాయిష్టానిష్టాలతో ఏమి. సంగతి సందర్భాలు వివరించడానికి సూర్యపురము వెళ్ళవలెగా."

ఈమాటలు వినగానే ఆమెముఖాన అప్రసన్నత తొలిగిపోయింది. "అయితే మంచిదే" అన్నది.

"ఏమిమంచి?"

"కాంతి అంతా ఒక్కసారే బందోబస్తు చేసుకోలేదు. నీమీద భారము వేశాడు. మంచిదికాదూ?"

"ఎందుకు? ఏమవుతుందీ! నీ ఉద్దేశము ఏమిటి?"

కుమారుడి భావము తల్లికి తెలియకుండా ఉండదు. కుమారుడు బాలుడో మూర్ఖుడో అయితేతప్ప తల్లిభావము అతనికి తెలియకుండా ఎక్కువకాలము దాగి ఉండదు.

రాయగృహిణి దృఢస్వరముతో "ఏమిటూ ? నీకొమార్తెకూ నవగోపాలుడికీ వివాహ మవుతుందని " అన్నది.

సీతానాథుడు నవ్వుతూ పూపూ అని పొగవిడిచి "పిచ్చిదాని వవుతున్నా వమ్మా! అది అసంభవము!" అన్నాడు.
"ఎందుచేత ? అదేమంత మహా గొప్పవిషయమా యేమిటి!"
"గొప్పవిషయమే ఏమిచ్చి ఏనుగుపిల్లను కొనగలను ? నాకేముంది ?"

"నీ ఉద్దేశ్యము ఎవరిమీద ఉన్నది? చాలారోజులనుంచీ నాకు మనస్సులో ఉన్నది ఇది. నీకూతురో చిన్నది. నవ్వూ బి. ఏ. కానిది కాంతిబెనర్జీ పెళ్ళిచెయ్యడు. అందుకని ఇన్నాళ్ళూ ఊరుకున్నాను."

సీతానాథుడు తనలో ఇలా అనుకొన్నాడు. "బంధువయితే మాత్రమేమి ? ఇదేమి పరిణయసంబంధమైన బాంధవ్యమా? ఇదంతా స్వార్థముకోసము. ఎంతకాలము తనపనులకు ఉపయోగిస్తానో అంతకాలమూ కాంతిబాబుకు నేను బంధువును. నాకు ఉపయోగించినన్నాళ్ళూ ఆయన నాకు బంధువు. బంధుత్వము !"

సీతానాథుడు తల్లితో "ఆ ఆశ వదులుకో అమ్మా." అన్నాడు.

"తేలికగా వదులుకోను. నీబుద్ధికి అనేకము తోస్తూవుంటవే.! ఈమాత్రము నెరవేర్చలేవూ ?"

"ఈవిషయము ఆలోచించలేదనుకొన్నావా అమ్మా? ఆలోచిస్తూనే ఉన్నా. ఏమి లాభము? గగనకుసుమము! కాంతిబెనర్జీకి ఆశ యెంతవరకున్నదో తెలుసునా? హరిహర ఛాటర్జీ జమీలో సుందరవనమంతా అల్లుడిపేర వ్రాసి ఇవ్వాలట." అని సీతానాథుడు చెప్పేటప్పటికి తల్లి ముఖము వికసించింది.

"అమ్మా, ఎంతసేపు నిలుచుంటావు? చిత్రాసనము తెచ్చి వేస్తాను."

"వద్దు వద్దు. ఇక్కడే కూర్చుంటా" అని ఆమె మేజా మీద కూర్చుని "ఎన్నాళ్ళలో వెళ్ళాలి నీవు?" అన్నది. "అయిదారురోజుల్లో" అని కొడుకు చెప్పేటప్పటికి తల్లి ముఖము మరింత విప్పారింది. "సరే, మంచిది" అని ఆమె బయటికి చూచింది. అంధకారముతప్ప మరేమీ కనబడలేదు. అంతట ఆమె లేచి తలుపు వేసి వచ్చి నెమ్మదిగా కుమారుడితో "అలాఅయితే బాగానేఉన్నది. ఒకపని చెయ్యి. సుందరవనములో సెంటు తక్కువయినా పిల్లను చేసుకోడానికి ఒప్పుకోకుండా ఉండేలాగు కాంతిబెనర్జీకి పురి

యెక్కించు ఈనాలుగైదురోజుల్లో. హరిహరచాటర్జీని నేను బాగా ఎరుగుదును. అతను అంత తొందరపడి ఇంతపెద్దఆస్తి చెయ్యి జారవిడిచే దద్దమ్మ కాడు" అని చెప్పింది.
"హరిహరబాబుకు ఒక్కతే కొమార్తె అని నీకు తెలుసునా అమ్మా! ఇంకా సంతానము కలిగేఆశకూడా లేదు. ఒకవేళ ఒప్పుకుంటే!"

రాయగృహిణి కొంచెము కర్కశస్వరముతో "అతను ఒప్పుకొనేటట్టయితే నీవు వెళ్ళడ మెందుకు? అంగీకారము కాకుండా ఉండేలాగు మాట్లాడు. అసలుసంగతి యేమి టంటే, నీవు యీసంబంధము కుదరకుండా చెయ్యి. ఈమాత్రము ఆలోచన తట్టలేదా నీకు!" అంటూ వేసిన తలుపు కేసి సంశయముతో చూచింది.

సీతానాథుడు నిశ్శబ్దముగా ధూమపానము చేస్తున్నాడు. అతనితల్లి పెదిమలు కదులుతున్నవి గోముఖములో జపమాలిక కటకటలాడింది. శబ్దము మృదువుగా వినబడుతున్నది.

హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే
హరేరామ హరేరామ రామరామ హరేహరే.

సీతానాథుడు చివరకిలా అన్నాడు. "నాబుద్ధి చాలావరకు వెళ్ళింది. ఈసంబంధము చెడగొట్టడము ఏమంత ఆశ్చర్యకరము కాదు. అయితే మనపిల్లను వాళ్ళు చేసుకుంటారనే

నిశ్చయమేమిటి? లాభసాటిలో ఉండి వచ్చేదికూడా పోగొట్టుకోవడమెందుకు? కథామాలలో కుక్క—ప్రతిబింబము కథాదశ పడుతుంది."

"ఎలాగ?"

"సంబంధము కుదిర్చితే రెండువేలిస్తానన్నాడు కాంతి బెనర్జి. ఆవైపునుంచి కూడా రెండువేలు సంపాయించక లేకపోను. ఈనాలుగువేలూ ఏఆశతో పోగొట్టుకొంటానో ఆఆశ నెరవేరుతుందనే నిశ్చయము లేదు."

"అవునుగాక. దృష్టి మరీదగ్గర ఉంచకు; కాస్త దూరదృష్టితో చూడు. కార్యము సానుకూలమయితే ఎంతసుఖమో ఆలోచించు. నీకూతురు రాణీ అవుతుంది. బంగారము, రత్నాలతో ఒళ్ళు నిండిపోతుంది. రెండువేలు నాలుగువేలు అని ఆశపడకు. ప్రయత్నించు; ప్రయత్నిస్తే ఏది కాదు? తుపాను వస్తుందని పడవ ముంచబోకు.

కేవలము అసంభవమని మనిషి ఏది మనస్సులోకి కూడా రానియ్యలేడో అదే ఇతరొకరు పృథముగా నచ్చచెప్పితే ఎందుకు కాదంటాడు. మొదట కొంచెము ఉలికిపడతాడు. ఆప్రస్తావన స్వార్థానికి బాగా అనుకూలించేదయితే అనుకూలమైన యుక్తులే అతని మనస్సులోకి తేనెయీగలలాగు పోగవుతవి. తర్వాత అతని పూర్వవిశ్వాసములో మార్పు

కలుగుతుంది. సీతానాథుడి స్థితికూడా అంతే అయింది. "నీవు చెప్పింది ఆలోచించి చూస్తానమ్మా" అన్నాడు. రాత్రి అతనికి నిద్రపట్టలేదు, ఇంకో ఆలోచన కలుగలేదు. తెల్లవారి సీతానాథుడు నిద్రలేచి చూచేసరికి తల్లి వరాండాలో కూర్చుని జపమాల తిప్పుతున్నది. తల్లిదగ్గరికి వెళ్ళి నమస్కారము చేసి పాదధూళి శిరస్సున ఉంచుకొని "నీఆజ్ఞ శిరసావహించానమ్మా" అన్నాడు. ఇటువంటి విశిష్టసమయాలలో సీతానాథుడి మాతృభక్తి నదీప్రవాహామువలె మహావేగముతో పొంగుతుంది. తల్లి ఏమీ అనకుండా ఆశీర్వాదరూపముగా జపమాలికతో పుత్రుని శిరస్సు స్పృశించింది. అటుతరువాత ఆమెజపము జోరయింది. పెదవులు బాగా కదలినవి.

"హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే
హరేరామ హరేరామ రామరామ హరేహరే."

# ౮

వారము గడిచింది. నేడు సీతానాథుడు సూర్యపురము వెళ్ళుతున్నాడు.

తల్లి కుమారుణ్ణి పూజామందిరములోకి తీసుకొని వెళ్ళింది. గదినడుమ కుశాసనము పరిచి ఉన్నది. దాని కెదురుగా బొమ్మమీద ఇత్తడిబిందె పెట్టినారు. అందులో మామిడి మండలు వేసినారు. సీతానాథుడు వెళ్ళి కుశాసనముమీద కూర్చున్నాడు. కలశానికి నమస్కారము చేయడముతోనే దేవతను ప్రార్థించవలసిన మాటలు తల్లి అతనికి చెప్పింది. ఎదట నారాయణమూర్తివిగ్రహము ఉన్నది. కలశానికి నమస్కారము చేసినతర్వాత తల్లి నారాయణమూర్తిని చూపించి "జయ బాబా, సత్యనారాయణ, మధుసూదన!—బాబాజీకి భక్తితో ప్రణామము చెయ్యి" అన్నది. సీతానాథుడు ఆప్రకారమే చేసినాడు.

గోడమీద కాళికాదేవిపటము మేకుకు వేలాడదీసి ఉన్నది. తల్లి ఆబొమ్మ చూపి "జయ మా కాళీ, ఘాటేర్ కాళీ, కరాళవదనా, అభీష్టము నెరవేర్చు అమ్మా! ఆమెకు ప్రణామం చెయ్యి నాయనా!" అన్నది. కుమారుడు అలాగే చేసినాడు. ఆర్టుస్టూడియోవారు ముద్రించిన దశభుజాదేవి

పటము గుమ్మముపైన చట్టములో వేలాడుతున్నది. తల్లి కుమారుడిదృష్టి అటుపైకి మళ్ళించి “ జయ మా, జగజ్జననీ ఆదిశక్తీ, భగవతీ, భక్తులవైపుచూడు తల్లీ ! ప్రణామం చెయ్యి నాయనా !—జయ జననీ, కటాక్షించు తల్లీ. నాలుకమీద నిలు వాగ్దేవీ ! సిద్ధి గణేశ్వరుడికి నమస్కారము చెయ్యి నాయనా! బాబా, సర్వసిద్ధిదాతా, గజానన, లంబోదర, కార్యసిద్ధి చెయ్యి తండ్రీ !” అన్నది.

దేవతల కందరికీ నమస్కారాలు చేసినతర్వాత సీతానాథుడు తల్లికి ప్రణామము చేసినాడు. “ యుద్ధములో విజయివయి రా తండ్రీ !” అని తల్లి ఆశీర్వదించింది. పూర్వము మనము వీరజాతిగా ఉన్నప్పుడు ఏప్రకారముగా ఆశీర్వచనాలు జరుగుతూ ఉండేవో ఇప్పుడుకూడా ఆలాగే జరుగుతున్నవి. అయితే యుద్ధమంటే కొంచెము మార్పు జరిగింది. ఈరోజులలో యుద్ధమంటే గవర్నమెంటు ఉద్యోగము దొరకడముగాని, దావాలో గెలిచిరావడముగాని, యూనివర్సిటీపరీక్షలో ప్యాసుకావడముగాని అని తేలింది. సీతానాథుడు లేచి నిలుచోగానే పెరుగు కలిపినపసుపుబొట్టు అతనినొసట పెట్టి, మారేడాకు చేతి కిచ్చి తల్లి “ ఇది వాసన చూసి చెవులో పెట్టుకో ” అని, కొంగుముడి విప్పి కొద్దిగా ప్రసాదము అతనిచేతిలో పెట్టి “ ఇది నమిలి తిను ” అని చెప్పింది.

తరువాత సీతానాథుడు బయటికి వచ్చినాడు. పల్లకీ మోసే బేహారాల భోజనము ఇంకా కాలేదు. అందుచేత పొగాకు తెప్పించి నములుతూ, వాళ్ళు తయారుకాగానే మేనాలో ఎక్కి పడుకొన్నాడు. తల్లి వాకిలిదాకా వచ్చి "దుర్గా దుర్గా దుర్గా, సిద్ధిదాతా గణేశ, సిద్ధిదాతా గణేశ" అంటూ నిలుచున్నది. మేనా ఎత్తుకొని బేహారాలు అద్భుతమైన అరుపులు అరుస్తూ వెళ్లిపోయినారు.

సూర్యాస్తమానము కాకముందే సీతానాథరాయుల మేనా సూర్యపురము చేరింది. కులకాంతలు బిందెలెత్తుకొని ఒళ్ళు తూగాడుతుండగా తోపవెంట వస్తున్నారు. మేలిముసుగులలోనుంచి నేర్పుతో వారు సీతానాథుడి కృష్ణవిగ్రహము చూచినారు!

అది చిన్న గ్రామము, కాలవఒడ్డున ఉన్నది. బహుకాలము నుంచీ వ్యవసాయానికి చాలా ప్రసిద్ధికెక్కింది. జమీందారు హరిహరచట్టోపాధ్యాయులుగారి మేడ గ్రామసమీపములో కాలవదగ్గర ఉన్నది. సీతానాథుడు వస్తాడన్న సంగతి జమీందారుగారి ఉత్తరముద్వారా అమధ్యాహ్నమే తెలిసింది. ఆయన పెద్దయుద్యోగస్థులలో ఒకరు ఎదురుగా వెళ్ళి, సీతానాథుని మేనాలో దింపి, ఖాన్‌సామాను పిలిచి, కాళ్ళూ చేతులూ కడుక్కోడానికి ఏర్పాటుచేసి జమీందారుగారికి చెప్పడానికి వెళ్ళినారు.

హరిహరబాబు వచ్చి "ఓహో రాయజీ, రాయజీ! కుశలమా? ఇంట్లో అంతా కుశలమా? ఎంతసేపయింది వచ్చి?" అని అడిగినాడు.

సీతానాథుడాయనప్రశ్నలకు మందహాసముతో సమాధానము చెప్పి, హరిహరబాబుగారి కాయక మానసిక పారివారక కుశలప్రశ్నలు అడిగినాడు. ఇంతలో సేవకుడువచ్చి టీ తయారుగా ఉన్నదని విన్నవించినాడు. వారిద్దరూ బైఠక్ ఖానాలోకి వెళ్లి టీ పుచ్చుకొన్నారు.

సీతానాథుడు ప్రయాణపుబడలికతో ఉండడము చూచి, త్వరగా భోజనము సిద్ధముచేయించవలసిందని జమీందారు ఆజ్ఞయిచ్చినాడు.

భోజనాలయినతర్వాత "విశేషాలు రేపు ఉదయము మాట్లాడుదాము" అని హరిహరబాబు అన్నాడు. సీతానాథరాయలు వెళ్ళి మంచముమీద వాలగానే ఖాన్‌సామా ఆయనకాళ్ళు పట్టనారంభించినాడు.

# ౯

వెలపల యెండ కాస్తున్నది. తోటలోనుంచి తుమ్మెదల ఝుంకారము వినబడుతున్నది. హరిహరబాబు వార్తాపత్రిక తీసుకొని పరధ్యానముతో తిరగవేస్తున్నాడు. ఇంతవరకూ అసలుసంగతి ప్రస్తావన చెయ్యనేలేదని సీతానాథుడు "అమ్మాయి పెద్దదయిందా?" అన్నాడు

హరిహరబాబు వార్తాపత్రిక కిందికి దింపి "మా అమ్మాయా? పదోయేడు వచ్చింది" అన్నాడు.

"ఒహో అయితే పసిదే."

"ఔను, పసిదే. ఇంతవరకు పెళ్ళిమాటావుడి ఏమీలేదు."

తనఅభిప్రాయానికి అనుకూలముగా ఉన్నదని సీతానాథుడు కాస్త శాంతించి, బాల్యవివాహ మెందువల్ల కూడదో ఆలోచింతా మనుకొన్నాడు. "సంబంధము కుదర్చడానికి వచ్చాను. ఇటువంటిస్థితిలో అటువంటిసంగతి మాటాడితే హరిహరబాబుకు సందేహము కలుగవచ్చును. నేనేదో ఆలోచించుకొని వచ్చానని అనుమానపడవచ్చును" అనుకొని సీతానాథుడు బహిరంగముగా "మా నవగోపాలుణ్ణి చూచారా?" అన్నాడు.

"చూచాను. మూడునాలుగేళ్ళయింది. కలకత్తాలో కాంతి వెంట వస్తే చూచాను."

"మంచి కుర్రవాడు. కార్తికేయుడిమోస్తరు."

హరిహరబాబు ఈపురాణోపమానము విని చిరునవ్వు నవ్వి "ఈరోజుల్లో వివాహసందర్భాలలో ఇవ్వడము పుచ్చుకొనడమూ అనే కొత్తచిక్కు ఒకటి యేర్పడ్డది. కాంతిచంద్రుడు ఈవిషయములో మీతో ఏమీ చెప్పలేదా ?" అన్నాడు.

"చెప్పకేమి! మీరు గొప్పయింటివారు. నజరానా హెచ్చు. అలంకారాలు ధనమూ మీకు ఇష్టపూర్వకముగా ఎంత యిస్తే అంత పుచ్చుకోవలసిందే. ఆవిషయములో చెప్పేదేమీలేదు. అయితే వారి వంశాచారం ఒకటుంది. అల్లునికి కొంతభూమి అరణం ఇవ్వవలసి ఉంటుంది."

"మంచిమాట. అల్లునికి అరణముకింద ఆస్తి ఇత్తామనే ఊహ మాకూ ఉన్నది. చాలారోజులనుంచీ, అందులో ఏమీ ఆటంకములేదు."

ఉందో లేదో కనబడుతుందనుకొని సీతానాథుడు కొంచెము సంశయిస్తూ "మీకు తగినమాట అన్నారు" అని పొగడినాడు.

"ఎటువంటిభూమి కాంతిబాబుకు ఇష్టమో ఏమైనా సూచించాడా ?"

"సూచించకేమి?"

"ఏమని?"

"సుందరవనములో మీవంతు జమీ అల్లుడిపేర వ్రాసి ఇవ్వవలసి ఉంటుందని వారు కోరుతున్నారు" అని సీతానాథుడు ఆదుర్దాతో ఆయనముఖమువంక చూచినాడు.

హరిహరబాబు కొంచెము సేపూరుకుండి "సుందరవనములో మాహిస్సా యెన్నియెకరాలో తెలుసునా?" అన్నాడు.

జమీవిస్తీర్ణము, ఆదాయము, గవర్నమెంటువారికి ఇవ్వవలసిన సిస్తు మొదలైనవిషయాలన్నీ అతనికి బాగా తెలుసును. కాని ఆశ్చర్యము అభినయిస్తూ "నాకు తెలియదు" అని బొంకినాడు.

"మంచిది. ఊహించి చెప్పండి."

సీతానాథుడు ఆలోచించి వెర్రిమొగము వేసి "ఏమాత్రము? వెయ్యియెకరాలు ఉంటుందా?" అన్నాడు.

"వెయ్యియెకరాలయితే అల్లునిపేర వ్రాసియివ్వడానికి అటూఇటూ చూచేవాడినే కాను."

ఈ మాటలు వినేసరికి సీతానాథుడికి ఉత్సాహమూ ధైర్యమూ కలిగినవి. "ఓహో! అయితే చాలాభూమి ఉన్నదనుకొంటాను" అన్నాడు.

"ఎనిమిదివేలయెకరాలు."

"ఆహా, చెప్పరేమి ! ఎనిమిదివేలయకరాలా ?"

"ఎనిమిదివేలు."

"అంత అనుకోలేను. మా శాంతిబాబుగారికి సుందరవన ములో పదివేల యకరాలు ఉంటవో ఉండవో. లాభసాటి వ్యవహారమే."

"ఇప్పు డేమిలాభము ? క్రమంగా అడివి కొట్టివేసి, నివాసా లేర్పరిచి వ్యవసాయము చేయించగలిగితే ఉత్తరోత్తరా లాభము ఉండవచ్చు."

"అయితే అటువంటియేర్పాటు లేమీ చెయ్యలేదాయేమి ?"

"చెయ్యకేమి. ఇందుకోసము చాలాడబ్బు పారబోశాము."

ఈసంగతులన్నీ సీతానాథుడికి బాగా తెలును. అన్నీ మరుగు పరిచి ఏమీ తెలియనివాడివలె "అలాగా" అన్నాడు. అంటే ఏ మిస్తారని దాని కర్థము

చివరకు హరిహరబాబు ఇలా గన్నాడు ? "శాంతిబాబు భూమి కావలెనంటే మంచి తాలూకా ఏదయినా నవగోపా లుడిపేర వ్రాసి ఇవ్వడానికి సిద్ధముగా ఉన్నాను. ఆయన కిష్టము వచ్చిన తాలూకా ఏదైనా సరే."

సీతానాథుడు నిట్టూర్పు విడిచి "సుందర వనములో జమీ విడిచి పెట్టడం మీకెంత మాత్రమూ సమ్మతము కాదు. నిజమే అంత భూమి—అందులో అంత డబ్బు ఖర్చుపెట్టిన మీదట."

“ కొంతతో ఇలాగని చెప్పండి. అంత భూమి యివ్వవలసి వస్తుందని కాదు. నా కొకతే ఆడపిల్ల. ఇంక సంతానము లేదు. నాతదనంతరము ఆ స్త్రీలో చాలాభాగము మాఅమ్మాయి కే సంక్రమిస్తుంది. సుందరవనములో భూమికూడా ఎప్పటి కైనా అల్లుడికి చెందేదే. ఈజమీ వృద్ధిలోకి తేవాలని తలలో చాలా ఆలోచనలు ఉన్నవి. అందుకనే చాలా డబ్బు కూడా ఖర్చు చేశాను, ఇంకా చేస్తాను. ఇప్పుడే ఆభూమి ఇంకొకరి పరం చేస్తే నేననుకొన్న వన్నీ నెరవేరవు. మొదలు పెట్టినవి పూర్తి కావు. అన్నీ నిష్ఫల మవుతవి.”

తీక్ష్ణబుద్ధి అయిన సీతానాథుని మనస్సు ఈమాటలలో ఒక మాటమీద గట్టిగా నిలిచింది. అందుచేత జమీందారు చెప్పేది పూర్తి కాగానే సీతానాథుడు “ ఆ స్తిలో చాలా వంతు అమ్మాయికి సంక్రమిస్తుందన్నారు. భగవంతుడు మీకింక సంతానము ఇవ్వకపోతే ఆ స్తి యావత్తూ అమ్మా యికీ అల్లుడికీ రావలె గాని చాలాభాగము రావడమేమిటి ?” అని అడిగినాడు.

హరిహరబాబు నవ్వుతూ “ ఒక ఆలోచన ఉన్నది” అన్నాడు.

“ చెప్పడానికి ఏమయినా అభ్యంతర ముందా ?”

“ అభ్యంతర మేమీ లేదు. ఒక కోరిక ఉంది. దేశక్షేమము కోసము ఏదయినా ఉద్యమానికి ఆ స్తిలో కొంత భాగము

ఇత్తామని ఉద్దేశము" అని చిరునవ్వుతో హరిహరబాబు అన్నాడు.

సీతానాథుడు సంభ్రమముతో "చాలా మంచి ఉద్దేశము. మీరు మహాత్ములు. ఎటువంటి ఉద్యమానికి ఇత్తామని నిశ్చయించారు?" అని అడిగినాడు.

"ఇంకా ఏమీ నిశ్చయం చెయ్యలేదు. ఎటువంటి వాటికి మాత్రము ఖర్చు చెయ్యగూడదో నిశ్చయించుకొన్నాను."

సీతానాథుడు కుతూహలముతో "ఎటువంటి వాటికి?" అన్నాడు.

"దేవతా సేవకు కాదు, బ్రాహ్మణ సేవకు కాదు, మఠాలలో మహంతుల సేవకు కాదు. ఇటువంటి పనులకు వేటికీ కాదు."

సీతానాథుడు నవ్వి "ఏమి, దేవతలు ఏమి అపచారము చేశారు? వారివిషయంలో మీకింతవైముఖ్య మెందుకు?" అన్నాడు.

"అపరాధ మేమీ చెయ్యలేదు. ఇంతకాలమూ దేశములో దానధర్మాలన్నీ ఇంచు మించుగా వారికే చెందినవి. వారు నెయ్యి పెరుగులతో బాగా పుష్టి పొందారు. దరిద్రాన్ భర కౌంతేయ, మా ప్రయచ్ఛేశ్వరే ధనమ్ — లోకములో దరిద్రము చాలా ఉన్నది. నాకున్న నాలుగు పైసాలతో

అలోపము కొంత తీరుతామని ఊహ. దీనితో దారిద్ర్యం తొలగి పోతుందని కాదు. మన దేశములో పుత్ర సంతానము లేని ధనికులు చాలామంది ఉన్నారు. వారు దత్తత చేసుకోవడము కన్న దరిద్రులకు సహాయం చేస్తే చాలా మట్టుకు ఉపయోగిస్తుంది. వాళ్ళాపని చెయ్యరు. దత్తపుత్రులను స్వీకరిస్తే వంశము నిలుస్తుంది, పేరు నిలుస్తుంది అని వారి నమ్మకము. పేరు నిలుస్తుందో పాడవుతుందో చెప్పేటందుకేమీ నమ్మకము లేదు. ఆపిల్లలు తాగుబోతులై దుర్మార్గులు కావచ్చు. పరులను చాలా పీడించి బాధలు పెట్టవచ్చు. ఇటువంటి సంగతులు అనేకము వారు భావించనే భావించరు."

"తామిప్పుడు చెప్పినవన్నీ ఔరస పుత్రుల విషయములో కూడా వర్తించవచ్చుగా?"

"అవును. యూరోపులో చాలామంది తత్త్వవేత్తలు తండ్రుల ఆస్తి కొడుకులకు నిరాటంకముగా పోకూడదని ఆందోళన చేస్తున్నారు. కోటీశ్వరుడు కార్నిజీ తన పిల్లలకు ఏదో సామాన్యమైన ఆస్తి యిచ్చి మిగిలిన ధన మంతా లోకోపకారార్థం ఇస్తాడని విన్నాము."

"నిజమే."

"ఆయనకంటె కూడా ఎక్కువ త్యాగము చేసినవాళ్ళు ఇందు కోసమే చేస్తున్నారు. షెల్లీ అనే గొప్పకవి ఇంగ్లాండులో

పుట్టినాడు. ఆయనకూడా ఇలాంటి అభిప్రాయమే ఉండేది. వాళ్ళవాళ్లు ఆయనను ఎందుకో వదలి పెట్టినారు. చాలా దరిద్రావస్థలో అన్నవస్త్రాలు లేక ఆయన చాలా కష్టాలు పడ్డాడు. నీకు సంవత్సరానికి రెండువేల పౌనులు (అంటే ముప్ఫయివేల రూపాయలు) వచ్చే ఆస్తి యిప్పుడిస్తాను. నీకు కలిగే మొదటి కుమారుడికి ఆ స్తి యావత్తూ ఇవ్వవలసి వుంటుంది, అని ఆయన తాత అన్నాడు. షెల్లీ ఏమన్నాడో తెలుసునా? పుట్టబోయేవాణ్ణి నేనెరగను. వాడు ఎటువంటి వాడవుతాడో. చెడ్డ వాడవుతాడేమో వానికి ఆస్తి ఇస్తానని ఏలా చెప్పడం? అని షెల్లీ నిరసనతో తాతగారి ప్రస్తావన తోసివేసినాడు.''

"వట్టి బుద్ధిహీనుడు!'' అని తనలో అనుకొని, పైకి సీతానాధుడు "అవును నిజమే. అది ఉత్తమ ధర్మము. మన దేశము సంగతి చెపుతాను. వంశము నిలుస్తుందని కాని పేరు నిలుస్తుందని కాని లోకులు దత్తత చేసుకుంటారని మీరన్న మాట కేవలము యుక్తముకాదు. అదొక ఉద్దేశమను కోండి: ప్రధాన ఉద్దేశము అది కాదు. కుమారుడు పిండప్రదానము చేస్తాడని ఆశ. పరలోక భయంవల్ల.—అది పోనివ్వండి. సుందరవనములో మీతాలూకు జమీ ఇంకొకరి పరం చెయ్యడం మీ అభిప్రాయం కాదన్న మాట" అన్నాడు.

" కాంతితో ఇలా చెప్పండి. నేనన్నట్టుగా ఆయన జమీలో కలిసేందుకు మంచి తాలూకా ఏది ఇవ్వమంటే అది నవ గోపాలుడికి కట్నం కింద ఇవ్వడానికి సిద్ధముగా ఉన్నాను. ఆయన అభిప్రాయ మేమిటో ఉత్తరం ద్వారా తెలియ పరచ మనండి."

సీతానాథుడు ఈమాటలు కాంతిచంద్రిడికి చెప్పాదా మను కొన్నాడు మొట్టమొదట. ,, అగ్ని శేషమూ శత్రు శేషమూ ఉంచకూడదు. ఇదంతా మాపుచేస్తే మంచిది. ఒకవేళ కాంతిచంద్రిడు ఇష్టపడతాడేమో. మనుష్యబుద్ధి! చెప్పే టందుకు వీలు లేదు" అనుకొని, పైకి " నేను వెళ్ళి కాంతి బాబుతో చెప్పవలసిన అవసరము లేదు. చివరమాట ఆయనే చెప్పారు" అన్నాడు.

,, ఏమని ?"

,, ఇందుకు భిన్నమయితే కుమారుడికి వివాహం చెయ్యడం పడదని."

,, పడదనా ?"

,, ఎంత మాత్రం పడదని."

హరిహరబాబు గంభీరస్వరముతో ,, మంచిది. అయితే ఏమి చెయ్యాలి! నేను ఇంకొకచోట ప్రయత్నము చెయ్యవలసి వస్తుంది" అన్నాడు.

మనస్సులో పొంగిపోతూ ఉన్నప్పటికీ సీతానాధుడు తన భావము పైకి కనబడనియ్యక చాలా విచారము సూచించినాడు.

భోజనానంతరము సీతానాధుడు హరిహరబాబు దగ్గర సెలవు తీసుకొన్నాడు. ఒకవేళ ఆయన అభిప్రాయము మార్చుకొంటాడేమోఅని ఆలోచేశాడు. జాగ్రత్త పడడము మంచిదే కదా.

# ౧౦

ఉదయము. కాంతిచంద్రుడు బైఠక్ ఖానాలో కూర్చు న్నాడు. జయమంగళగారి మ ప్రజలు ఎదురు తిరిగి ఖజానా కట్టివేశారు. దానికి సంబంధించిన కాకితాలు పట్టుకొని నాయబు నిలుచున్నాడు ఇంతలో పోష్టు జవాను వచ్చి కొన్ని ఉత్తరాలిచ్చి వెళ్ళినాడు. కాంతిబాబు నాయబు కేసి చూచి "కచ్చేరీకి వచ్చి చూస్తాను" అన్నాడు. "చిత్తము హుజూర్" అని నాయబు వెళ్ళిపోయినాడు.

కాంతిచంద్రుడు ఉత్తరాలు ఒక్కొక్కటే విప్పి చదివినాడు. చివరకు ఒక పత్త్రము రెండోసారి జాగ్రత్తగా చదివినాడు. అందులో ఇలా ఉన్నది.

శ్రీ శ్రీ దుర్గాసహాయము!

సూర్యపురము

తారీఖు......

ప్రీతి సంభావణ మేతత్.

ఈవేళ మధ్యాహ్నము శ్రీయుత సీతానాధరాయలు ఇక్కడ నుంచి బయలుదేరి వెళ్ళినారు. కట్నము కింద సుందర వనములో మావంతు జమీ యావత్తూ వ్రాసి ఇచ్చినట్ట

యితే మీరు అబ్బాయికి వివాహము చెయ్యడానికి అంగీకరిస్తారనీ, అలా కాకపోతే అంగీకరించరనీ వారు చెప్పినారు. ఈవిషయములో నేను చెప్పవలసిన దంతా సీతానాథరాయజీకి చెప్పినాను. ఈఉత్తరము అందక ముందే మీరు అదంతావిని ఉంటారు. అందులో విశేషాలు సంగ్రహముగా వ్రాస్తున్నాను.

నాకు కుమాళ్ళు లేరనీ ఒక్కతే కుమార్తె అనీ మీకు తెలుసును. పురుష సంతానము కలుగుతుందనే ఆశకూడా లేదు. నాకున్న ఆస్తి చాలావరకు నాతదనంతరము మా అమ్మాయికీ అల్లుడికీ సంక్రమిస్తుంది.

అంతా అనకుండా ఎక్కువ భాగము అనడానికి కారణము ఆస్తిలో కొంత భాగము దేశాభివృద్ధికి పాటుపడే ఉద్యమానికి ఇవ్వవలెనని సంకల్పము. సుందరవనములో భూమి ఇవ్వక పోవడానికి ఇదే కారణము. మీకూ సుందరవనములో చాలా భూమి ఉన్నది. అక్కడక్కడ మంచి భూమి ఉన్నదని మీకు తెలుసును. అడివి కొట్టించి వానయోగ్యము చెయ్యగలిగితే ముందు ముందు చాలా లాభిస్తుంది. ఈఉద్దేశముతో చాలా ధనముకూడా వ్యయము చేశాను, చాలాచోట్ల పని ప్రారంభించాను. ఇప్పుడాభూమి అన్యాక్రాంతము చేస్తే నేను ప్రారంభించిన పని నెరవేరదు. ఇదే ఆటంకము.

ఈసంగతులు విని మీతరఫున సీతానాథరాయలు చివర మాట చెప్పి వెళ్ళినారు. మీతో బాంధవ్యము నాకు చాలా ఇష్టము. ఆ అవకాశము పోయినందుకు చాలా విచారిస్తున్నాను. ఈవిషయములో నేను చెప్పవలసినది కొంచెమున్నది. అందుకే ఈఉత్తరము వ్రాస్తున్నాను. సుందరవనములో భూమి అల్లుడికి అన్ని హక్కులతో వ్రాస్తాను. కాని నేను ఉన్నన్నాళ్ళూ దానికి ట్రస్టీగా ఉంటాను. వచ్చే ఆదాయము దానివృద్ధి కోసమే నాకు తోచినట్లు వినియోగిస్తాను. అజమాయిషీ యావత్తూ నాచేతుల్లో ఉంటుంది. నాతదనంతరము అల్లుడికి అన్ని హక్కులూ సంక్రమిస్తవి. ఇది మీకు సమ్మతమయితే మాఅమ్మాయిని ఇవ్వడానికి సిద్ధముగా ఉన్నాను. బాగా ఆలోచించి చూడండి, ఇందులో మీకేమీ నష్టహేతువు లేదు. నేను సంకల్పించినది నెరవేరితే, దాని ఖరీదు నాలుగు రెట్లు హెచ్చుతుంది. ప్రస్తుతము ఆదాయము మట్టుకు మీకు ముట్టదు. మీకు తెలుసును—ఇప్పుడు ఆట్టే ఆదాయము రాదని.

మీకిది సమ్మతమయితే నాకు జాబు వ్రాయండి.

ఈశ్వరానుగ్రహము వల్ల మాయింట్లో అంతా కుశలము. మీపరివార మంతా కుశల మని తలుస్తాను. ఇతి

భవదీయుడు,

శ్రీహరిహర చట్టోపాధ్యాయుడు,

ఉత్తరము చదివి కాంతిచంద్రుడు, దర్వాన్ అనిపిలిచినాడు. దర్వాంజీ వచ్చి హుజూర్ అని తల వంచుకొని నిలుచున్నాడు.

"రాయజీ సూర్యపురమునుంచి వచ్చారో లేదో చూచిరా" అన్నాడు జమీందారు.

"జోహుకుం హుజూర్" అని దర్వాంజీ వెళ్ళినాడు.

కాంతిచంద్రుడు లేచి గదిలో ఇటూ అటూ తిరుగుతూ ఇలా అనుకొన్నాడు: "ఆ స్త్రీ వెంటనే రావలసిన వాడెవ్వడూ ఏమీ లేదు. అయితే హరిహరుడి పరిష్కృత భార్యకుగాని, పెండ్లి చేసుకొంటే ముందు వచ్చే భార్యకు గాని పురుష సంతానము కలుగుతుందేమో అని సంశయము. సుందర వనములో ఆ స్త్రీమీద వచ్చే ఆదా ఆట్టే లేదు. నేను కూడా అడవి కొట్టించి ప్రదేశము నివాసయోగ్యము చేస్తున్నాను. తాను ప్రారంభించినపని స్వయముగా నెరవేర్చ వలెనని ప్రతివాడికీ ఉంటుంది. మంచిమాటే. హరిహరుడి పని అతనినే పూర్తి చెయ్యనిత్తాము. మనకేమీ శ్రమ ఉండదు. పైగా డబ్బు ఏమీ ఖర్చు కాదు."

ఈసంగతు లన్నీ ఆలోచించిన మీదట కాంతిచంద్రుని ముఖము హర్షోత్ఫుల్ల మయినది.

దర్వాంజీ తిరిగి వచ్చి సూర్యపురమునుంచి రాయజీ ఇంకా రాలేదని విన్నవించినాడు. అంతట కాంతిచంద్రుడు కచ్చేరీ వైపు బయలుదేరినాడు.



అపరాహ్ణవేళ సీతానాథుని మేనా ఊళ్ళో దిగింది. రాయగృహిణి బోయీల చప్పుడు దూరమునుంచే విని వేగిరము జపమాల చేత పుచ్చుకొని వీధిగుమ్మము దగ్గర నిలుచున్నది.

సీతానాథుడు మేనాలో నుంచి దిగి చిరునవ్వుతో తల్లికి నమస్కారము చేసినాడు. ఇతరులకు తెలియకుండా తల్లి కొడుకుతో "పని అయిందా?" అన్నది. "నీ ఆశీర్వచనమువల్ల!" అన్నాడు కొడుకు.

సీతానాథుడు ఇంట్లోకి వెళ్ళినాడు. అందరూ గుమిగూడినారు. అతని ముఖము గాంభీర్యముద్ర వహించింది. అరనిమిషము క్రిందట అతని ముఖాన మందహాసము మెరుపు తీగవలె తళుక్కుమన్నదని యెవరు ఊహించగలరు? రాయగృహిణి కుమారుణ్ణి చూచి "నాయనా, ప్రయాణంలో శ్రమ కలగలేదు గద?" అన్నది.

"అట్టే లేదు."

"అక్కడనుంచి ఎప్పుడు బయలుదేరినావు?"

"నిన్న పదకొండు గంటలకు."

తల్లి ఆశ్చర్యపడి అనుమానముతో "నిన్న పదకొండింటికి బయలు దేరావా? ఇంత ఆలస్య మయిందెందుకు?" అన్నది.

"మొన్న సాయంకాలమే అక్కడికి చేరాను. ఆతర్వాత సంగతులన్నీ మాట్లాడి బయలుదేరాను. ప్రయాణపు బడలికవల్ల ఒంట్లో ఖులాసాగా లేదు. తగినంత విశ్రాంతి లేకపోవడంవల్ల మణిరామపురానికు వచ్చేసరికి ఒంట్లో చాలా భారంగా ఉంది. అందుచేత అక్కడే భోజనం చేసుకొని రాత్రి విశ్రాంతి తీసుకొన్నాను. ఇవాళ్ళ ఇక్కడికి వచ్చాను" అని రాయుడు చెప్పినాడు.

తర్వాత తల్లీ కొడుకులు నెమ్మదిగా చాలా సంగతులు మాట్లాడుకొన్నారు. ఇద్దరి ముఖాలూ ఆనందముతో వికసించినవి.

"నీవు వచ్చావేమో అని కనుక్కోడానికి ఉదయం మనిషిని పంపించాడు కాంతి" అన్నది తల్లి.

సీతానాథుడు నవ్వుతూ "అన్నగారికి అంతా తొందర! కొంచెము సేపట్లో వెళ్ళి ఆశావాయువు కాస్త ఆర్పివస్తాను!" అన్నాడు.

తల్లి ముసిముసి నవ్వు నవ్వింది.

తర్వాత రాయగృహిణి ఇట్లా అందరికీ ప్రసాదము

పెట్టింది. సీతానాథుడి వంతు చాలా హెచ్చు వచ్చింది. ఆయన బాగా భోజనము చేసుకొని తృప్తిగా హుక్కా పీల్చి జమీందారు గారింటికి బయలు దేరినాడు.

కాంతిచంద్రుడు తయఖానాలో కుర్చీని విశ్రాంతిగా హుక్కా పీలుస్తున్నాడు. ఇంతలో సీతానాథుణ్ణి చూచి స్వాగత మన్నాడు; రాయజీ విషణ్ణవదనము చూచి

"ఎప్పుడు వచ్చినా?" రన్నాడు.

"వచ్చి ఒకటి రెండు ఘంటలయింది."

"ఎప్పుడు బయలు దేరారు?"

"నిన్న భోజనము కాగానే బయలు దేరాను."

"ఇంత ఆలస్య మయిందేమి?"

ఆలస్యము కావడానికి కారణములు రాయజీ వివరించి చెప్పినాడు.

"తర్వాత—అక్కడి సంగతు లేమిటి?" అన్నాడు కాంతిబాబు.

సీతానాథుడు తల తిప్పుతూ "ఏమంత బాగా లేదు" అన్నాడు.

"ఎందుచేత? ఏమన్నారు?"

రాయలు ముఖాన తిరస్కారభావము చూపుతూ చెయ్యి తిప్పుతూ "వాళ్ళు చాలా కృపణులు! ఎంతమాత్రమూ

రాజీ కుదరలేదు. సుందరవనములో ఉన్న జమీా వృద్ధి చేస్తాను, అది చేస్తాను, ఇది చేస్తాను. చాలా డబ్బు ఖర్చు పెట్టాను. భూమి యివ్వడానికి వీలులేదు—అన్నాడు. నేను చాలా ప్రయత్నించాను. వృద్ధి చెయ్యడము మంచిదే అన్నాను. మేము మాత్రము వృద్ధి చెయ్యమూ అన్నాను. మేము మాత్రము పాడు చేస్తామా అన్నాను మాకుకూడా వంశపారంపర్యముగా సుందరవనములో జమీా ఉంటున్నది. మీాకు తెలియదా ?—ఈవిధముగా ఎన్ని మంచి మాటలు చెప్పినా లాభము లేకపోయింది. దొంగవాడు ధర్మపన్నాలు వింటాడా ? అని చెప్పినాడు.

కాంతిచంద్రుడు ఉదాసీన భావముతో అవు నన్నాడు.

" ఆయన అంటాడు—ఏదో తాలూకా యిస్తాను, సుందర వనములో జమీా పట్టుకు చెయ్యి జారవిడవను.—నేనన్నాను—మాకు తాలూకా గీలూకా అక్కరలేదు. ఇందుకు భిన్న మయితే వీలు పడదు అని చివరమాట చెప్పి వచ్చాను'' అని రాయజీ అన్నాడు.

కాంతిచంద్రుడు కొంచెము సేపు ఊరుకొని " ఏతాలూకా ఇవ్వదలచు కొన్నాడు " అని ప్రశ్న వేసినాడు.

సీతానాధుడు కొంచెము తటపటాయించినాడు. హరి హరబాబు ఇస్తానన్న తాలూకాలు చాలా మంచివి. అందుచేత రాయజీ చమత్కారముగా " ఏతాలూకా

ఇస్తా నన్నాడో జ్ఞాపకంలేదు. ఏవో పేర్లు చెప్పి, వీటిలో మీకు ఏవి కావలిస్తే అవి యిస్తాననే సరికి మాకేమీ అక్కరలేదు. మాబాబుకు పెళ్ళి కాకపోదు అని వెంటనే అనేశాను" అని చెప్పినాడు.

ఉదయము వచ్చిన వృత్తాంతము కాంతిబాబు జేబులో తట తట లాడింది.

"పెంపుడు చేసుకొనే సూచన యేమైనా కనబడ్డదా?"

"ఆసంగతి బాగానే తెలుసుకొని వచ్చాను. దత్తత చేసుకోడు. నాఆస్తిలో ఏదో కొంత అమ్మాయికీ అల్లుడికీ ఇస్తాను. మిగిలినదంతా సత్కార్యాలకు వినియోగిస్తాను. పిల్లలకు ఆస్తి ఇచ్చి పోవడం చాలా అసహ్యమైనపని, అంటూ ఉపన్యాస మిచ్చాడు. యిరోపాలో కార్నెజీ అనే కవి తన పిల్లల కేమీ ఇవ్వకుండా ఆస్తి అంతా ఖైరాత్ చేశాడట."

"ఏమిటీ గొడవ అంతా?"

"ఓయీా బాబో! నాకదేమీ తెలియు లేదు! అంత యింగ్లీషూ పింగ్లీషూ రాదు. మేము వట్టి నాటు మనుష్యులము. ఆయన వచ్చిదొర! టీ తాగుతాడు. దేవతలు బ్రాహ్మణులు అంటే డోంట్ కేర్ అంటాడు. వాళ్ళతో సంబంధము చేస్తే సుఖ ముండదు" అని సీతానాధుడు జోరుగా వాక్కాకు వీల్చినాడు.

కాంతిచంద్రుడు జేబులోనుంచి ఉత్తరము బయటికి తీసి ఇంకో సారి చదివి రాయజీచేతి కిచ్చినాడు; ఇచ్చి "ఇవాళ ఉదయం వచ్చింది. మీరు అక్కడినుంచి బయలుదేరి వచ్చాక మళ్ళీ ఆలోచించి వ్రాసి ఉంటాడు" అని దీపము హెచ్చించినాడు.

ఉత్తరము చదివే సరికి రాయజీ కాళ్ళూ చేతులూ చల్లబడ్డవి; ముఖము మట్టుకు వికసించింది. చదివి చివరకు "పోనివ్వండి. అక్కడ నేను చెప్పిన మాటలు కేవలము నిష్ఫలము కాలేదన్నమాట. వెంటనే కార్యము సానుకూలమయితే నాకు శ్రమ కూడా చాలా తగ్గేదే. సరే, ఏమి నిశ్చయించారు?" అన్నాడు. కాంతిచంద్రుడు ఈమాటలకు సమాధానము చెప్పక ఇలా అన్నాడు: "ఆస్తిలో చాలా భాగం ఖైరాత్ చేసి ఏదో కాస్త, కూతురికి అల్లుడికీ ఇస్తాడని మీరు చెప్పారే—దానికి సరిగా తల్లకిందుగా ఉన్నది ఉత్తరంలో."

సీతానాథునిముఖము ముహూర్తమాత్రము విపన్నమయినట్టు కనబడి, వెంటనే ఆవైఖరి మరుగు పడ్డది. "అప్పుడవును. చెప్పాను కాదూ ఔషధం పని చేసిందని. అయితే కొంచెం ఆలస్యం మాత్రమయింది. అంత ఉపన్యాస మిచ్చినందుకు వృథా పోలేదు. కార్నేలీ గిర్నేలీవంటి దొరలపాలె మనం చేస్తే సరిపడుతుందా? ఇలాచేస్తేనే మనదేశం పాడం

పోయింది. మనపెద్దలు చిరకాలమునుంచీ ఆచరించినట్లు ఆచరించండి. సత్కార్యాలు చెయ్యడం మంచిదే. కాని పిల్లల కేమీ ఇవ్వకపోవడం మంచిదా ? పదహారు అణాలలో రెండణాలు ధర్మం చెయ్యండి. మిమ్మల్ని లోకులు ధర్మాత్ము లంటారు—అని చెప్పారు. అయితే ఇప్పుడు మీ అభిప్రాయ మేమిటి ?" అని సీతానాథుడు పలికినమీదట కాంతిచంద్రుడు జాబు జేబులో పెట్టుకొని "నా అభిప్రాయం, వివాహము చెయ్యడమే" అన్నాడు.

లోపల చాలా నిరుత్సాహముగా ఉన్నప్పటికీ పైకి ముఖ వికాసము అభినయించడము చాలా కష్టమయిన పని. సీతానాథుడికి కంఠములో శ్లేష్మము పోగయింది. మాటి మాటికీ గొంతు సవరించుకొంటూ "సరే, యింత కష్టపడి నందుకు లాభించింది" అన్నాడు రాయజీ.

"పిల్లను చూచి రాలేదా ?"

"లేదు. అప్పటి ఆయనస్థితి చూస్తే పిల్లను చూడవలసిన అవసరము లేదనిపించింది. వెళ్ళి చూచి రమ్మంటే చూచి వస్తాను."

"మీకు మాటిమాటికి శ్రమ యివ్వను. నేనే వెళ్ళి పిల్లను చూచి వస్తాను."

ఈమాటలకు సీతానాథుడి ముఖము చిన్నబోయింది.

అక్కడి సంగతులు బైట పడతవేమో అని భయపడ్డాడు. కాని చివరకు "మంచిది మంచిది. అలా అయితే చాలా మంచిది. ఒళ్ళు నెప్పులు పెడుతున్నది. కాస్త విశ్రాంతి తీసుకొంటేనే తప్ప బతకడము కష్టం" అంటూ సీతానాధుడు సెలవు తీసుకొన్నాడు.

రాయలు ఇంటికి వెళ్ళి జరిగిన సంగతి యావత్తూ తల్లితో చెప్పినాడు.

ఆరాత్రి అతని తల్లి భోజనము చెయ్యడానికి ఏమాత్రమూ ఇచ్చ కనబరచ లేదు. కోడలు మొదలైనవారు కొంచెము పాలు మాత్రము ఆమెచేత తాగించ గలిగినారు.

# ౧౨

నవగోపాలుడు రమాసుందరితో మాట్లాడిన మూడో నాడు అతని పడవ మహేశ్వరము రేవు చేరింది. అప్పటికింకా రెండు జాములు కాలేదు. గోపాలుడు పడవ దిగి, ఒడ్డున ఒకానొక చెట్టుకింద కంబళి పరుచుకొని కూర్చున్నాడు. లోపలినుంచి రెండు తుపాకులు తెమ్మని పల్లెవాడికి ఆజ్ఞ యిచ్చినాడు. వాడు తెచ్చిన తర్వాత పెట్టెలు తెరిచి బందూకులు పైకి తీసినాడు. అందులో ఒకటి పెద్దది, రెండవది చిన్నది. చిన్న తుపాకీ చేత బట్టుకొని బాగా పరిశీలించి చూచినాడు. పిమ్మట పెద్ద పెట్టెలోనుంచి నంచీ తీసి తుపాకీ సాఫు చేసే సామగ్రి బయట పెట్టినాడు. చిన్న తుపాకీ గొట్టము మీద అక్కడక్కడ తుప్పు పట్టింది. గోపాలుడు జాగ్రత్తగా బాగు చేసినాడు. ఆ బందూకు రమాసుందరి కోసమని వేరే చెప్పవలసిన పనిలేదు. అతను చిన్నతనములో ఉపయోగించిన తుపాకీ అది: చాలా ఆదర పాత్రమైన వస్తువు. పెద్దవాడైన తర్వాత పెద్ద తుపాకీ ఉపయోగించ గలిగినాడు. ఎంతమంది అడిగినా ఆచిన్నతుపాకీ గోపాలు డెవరికీ ఇవ్వలేదు. ఇప్పుడు రమాసుందరి కోసము తేవలె ననే సంకల్పము ఉదయమే కలిగింది. అంతకు

పూర్వమే ఈఊహ పొడమినట్లయితే ఇంటిదగ్గరే బాగు చేయించి తీసుకొని వచ్చేవాడే. నవగోపాలుడి చేతులు మాత్రము తుపాకీ మీద వున్నవి; కళ్ళు ఊరితోవమీదికి ఉరుకుతున్నవి.

మధ్యాహ్నమయింది. అప్పటికీ రమ కనబడలేదు. బాగు చేసిన మీఁదట బందూకు ఝుక్ ఝుక లాడుతున్నది. ఒక్కొక్కమాటు మబ్బు సూర్యుణ్ణి కప్పివేస్తున్నది; అంతలో మళ్ళీఎండ కాస్తున్నది. ఈరెండు రోజుల్లో రమను గురించి గోపాలుడికి చాలా కుతూహలము కలిగింది. ఆమె తండ్రి యవరు, ఏజాతి, ఇంకా పెండ్లి యొందుకు కాలేదు అనే సంగతులు అడిగి తెలుసుకోవలె అనీ, ఎదిగిన పిల్లను వెంటబెట్టుకు వెళ్ళడము ఉచితమా అనీ, అతనికి స్ఫురించింది. ఆమె ముఖాన, కళ్ళల్లో ఒకవిధమైన సందేహరాహిత్యము, నిర్భీతి కనబడ్డవి. అందువల్ల ఆమె వంగదేశీయు కాదను కొన్నాడు. ఈఅద్భుత బాలతో పునస్సమాగమము కోసము అతని మనస్సు మహా ఉత్కంఠతో ఉన్నది. అందు చేతనే వచ్చినాడు. ఇరవై యేండ్ల వయసున పనులు చేసేటప్పుడు ఎవరూ ముందు వెనక లాలోచించరు.

రమ అప్పటికీ రాలేదు. ఊరితోవను వస్తున్నదో రావడము లేదో చూతామని గోపాలుడు ముందుకు వెళ్ళడానికి నిశ్చయించుకొని తుపాకీ అక్కడ పెట్టి లేచి కొంత దూరము

నడిచినాడు. మనుష్యు లెవరూ కనబడలేదు. తోవలో ఒకచోట ఎండు వెదురాకులు రాలి చాపవలె కోమలముగా ఉన్నవి. కొద్దిదూరము వెళ్ళగానే అతనికి వనలక్ష్మి దర్శన మయింది! ఆమెను చూచేటప్పటికి అతని అంతరంగము పులకరించింది.

గోపాలుడు దగ్గిరికి వెళ్ళి "వచ్చావా రమా!" అన్నాడు. రమ ఆమాటలు వినిపించుకోక "తుపాకీ యేది?" అన్నది.
"తుపాకీ నదిఒడ్డున పెట్టి వచ్చాను. ఆలస్యము కావడము చూచి నీవు రావేమో అనుకొన్నాను."

రమ మందహాసము చేసింది.

"వేటకు నిజంగా నావెంట వస్తావా?"

"వస్తాను."

"మీవాళ్ళు ఏమీ అనరా?"

రమ నిశ్చింతతో "ఏమీ అనరు. మాఅత్తతో చెప్పి వచ్చాను. ఆవిడ మంచిది మంచిది మంచిది అన్నది. ఆమెకు ఏమీ వినబడదు" అన్నది.

"మీఇంట్లో ఇంకా ఎవరున్నారు?"

"మాబాబు, చెల్లెలు రాజలక్ష్మి, తర్వాత లక్ష్మి."

"లక్ష్మి యెవరు?"

“లక్ష్మి మా దాది. మా అమ్మ లేదుగా. అందుకని మమ్మలిని పెంచింది.”

“లక్ష్మి నిన్నేమీ అనదూ ?”

రమ నిర్విచారముగా “అనదు. ఎందు కంటుంది ? ఆవిడే నాకు స్వయంగా వేటాడడం నేర్పింది. అలుగులు విడవడము కూడా నేర్పింది” అన్నది.

ఇలా మాటాడుతూ వారిద్దరూ రేవు సమీపించినారు. చెట్టుకింద కంబళీ మీద రమకు రెండు బందూకులు కన బడ్డవి. రెండవ దానికేసి చూస్తూ “మీ కెక్కడిదిది ?” అన్నది రమ.

“నేను చిన్నతనములో వాడింది” అన్నాడు గోపాలుడు.

రమాసుందరి బందూకు చేత్తో పట్టుకొని పరిశీలించి చూచి “దీనితో అన్ని జంతువులనూ కొట్ట వచ్చునా ?” అని అడిగింది.

“చిన్న చిన్న వాటిని కొట్టవచ్చు. పులిని కొట్టడానికి వీలు లేదు. ఇది ఎందుకు తెచ్చానో తెలుసునా రమా ?”

“తెలియదు.”

“నీకోసం తెచ్చాను.”

“నాకోసం తెచ్చారా !” అని రమ బందూకు మళ్ళీ పట్టు కొని ఉత్సాహముతో “నిజంగా నాకోసం తెచ్చారా !” అన్నది.

"నీకోసమే తెచ్చాను" అన్నాడు గోపాలుడు.

బందూకు పట్టుకొని రమ పొందిన ఆనందానికి మేర లేదు.

"అయితే షికారు పోదాము, పదండి" అన్నది.

"నీకోసము ఇంకో వస్తువు కూడా తెచ్చాను."

"ఏమిటి?"

గోపాలుడు రెండు జేబులలోనుంచి రెండు చక్కని పాద రక్షలు తీసి "అడివిలో తిరుగుతాము. నీకాళ్ళలో ముళ్ళు విరుగుతవేమో అని తెచ్చాను. తొడుక్కో" అన్నాడు.

జోడు తొడుక్కొంటూ రమ "ఏమి చక్కని జోడు! బీకనీరునుంచి నాకు తెచ్చే జోడు ఈమోస్తరుది కాదు. దానిమీద జలతారుంటుంది" అన్నది.

"జోడు తొడుక్కొనే అభ్యాసముందా? అయితే ఈవేళ కాలికి ఏమీ తొడుక్కు రాలేదేమీ?"

"ఇప్పుడు తొడుక్కోవడం లేదు."

"ఎందువల్ల?"

"పెద్దదాన్ని అయినానని" అంటూ రమ చాలా తెలిసిన వాళ్ళవలె ముఖము పెట్టింది.

ఇద్దరూ వెళ్ళడానికి సిద్ధమయినారు. రమ తన తుపాకీ తానే పట్టుకొంటా నన్నది.

"వద్దు. నీకు చాలా శ్రమ. నేను తీసుకు వస్తాను. కావలసి
నప్పుడు నీకిస్తా" నన్నాడు గోపాలుడు.
రమ విచారముతో "అయితే నేనేమీ తీసుకురా అక్కర
లేదా?" అన్నది.
"ఇంకా రెండువస్తువు లున్నవి: తోటాల పెట్టె, టిఫిన్
బాక్సు. ఇందులో ఒకటి తీసుకో" అన్నాడు గోపాలుడు.
రమ తోటాలపెట్టె చేతికి తగిలించుకొన్నది. ఈ వేషాలతో
క్రొత్త వేటగాళ్ళు అడివిలో ప్రవేశించారు.

## ౧౩

ఎండ కాస్తున్నది. కాని ఆకులు చిక్కగా ఉండడముచేత చెట్ల సందులలోనుంచి సూర్యరశ్మి కొద్దిగా కిందికి పడుతున్నది. రమా గోపాలులు కిందికి వాలిన కొమ్మలు చేతులతో పైకెత్తుతూ త్రోవచేసుకొంటూ వెళ్ళుతున్నారు. ఇద్దరి కాళ్ళ అడుగునా నలిగిన ఆకులు గలగల లాడుతున్నవి. కొంతదూరము వెళ్ళిన తర్వాత గోపాలుడు « రమా, నీకు భయం వెయ్యడం లేదా ?" అన్నాడు.

ఎర్రటి పెదవులు పొంగగా రమ నిర్లక్ష్యముతో « ఎందు ?» కన్నది.

విని గోపాలుడు మనస్సులో సంతోషించినాడు. ఇటువంటి స్వభావము కల పంగబాలను అతడెన్నడూ చూడలేదు. మరికొంచెము దూరము వెళ్ళిన తర్వాత « రమా, ఏయే జంతువులను వేటాడుదామను కొంటున్నావు ?" అన్నాడు గోపాలుడు.

« దొరికిన జంతువులను.»

« ఎటువంటి జంతువును వేటాడడము నీకిష్టము ?»

« భయంకరమైన జంతువును.»

« ఎటువంటిది ?»

"అడవిపంది, ఎలుగుగొడ్డు, పులి, మొసలి—"
ఈమాటలకు గోపాలుడికి నవ్వు వచ్చింది. బందూకు పట్టుకోలేని పిల్ల క్రూర మృగాలను వేటాడుతుందిట! గోపాలుడు తన చెలికత్తెకు ఉపదేశము చేసే మిషతో "నేను చిన్నతనములో ఏజంతువులను చంపేవాడినో తెలుసునా?" అన్నాడు.

"ఏజంతువులు?"

"కుందేళ్లు కాని అటువంటి చిన్న జంతువులు కాని. నీవెప్పుడూ జంతువును చంపలేదు. ముందు చిన్నవాటిని కొట్టడము నేర్చుకో—క్రమంగా పెద్దవాటిని కొడుదువు గాని. ఈఅడవిలో కుందేళ్ళూ—"
మాట పూర్తికాకమునుపే రమ అడ్డము వచ్చి "నేను కుందేళ్ళను చంపను" అన్నది.
గోపాలుడు ఆశ్చర్యముతో "ఎందుచేత?" అన్నాడు.

"కుందేళ్ళను కొట్టి లాభము లేదు. చాలా అమాయకపు జంతువులు! ఎవరికీ హాని చెయ్యవు, పైగా వాటి శరీరము ఎంత మెత్తన! చెవులు ఎంత చక్కగా అల్లల్లాడతవి! మీరు ఎప్పుడైనా కుందేళ్ళు పెంచారా?"

"లేదు."

"నాకు జోడుకుందేళ్ళు ఉండేవి. మాకక్కయ్య ఇచ్చినాడు. వాటి ఒళ్లు ఎంత తెలుపని! పాల లాగుండేది, మెత్తగా

ఉండేది, కళ్ళు ఎర్రగా ఉండేవి. ఆహారము పెట్టడానికి వెళ్లే సరికి నా కేసి చూస్తూ ఉండేవి.'' అని రమ మౌనము వహించింది.

"వాటికి ఏమాహారము పెట్టేదానవు?" అని నవగోపాలు డడిగినాడు.

"లేత పచ్చిక తెచ్చి వేసేదాన్ని. తోటలోనుంచి తెచ్చేదాన్ని. పొద్దునే లేచి కుందుకు పసుగడ్డి తెచ్చేదాన్ని. మొదట రెండు గుప్పిళ్ళు తెచ్చి రెండింటికి వేసే బాగా తినేవి కావు. మీరెప్పుడైనా కుందేళ్ళు ఆహారము తింటూ ఉండగా చూచారా?"

"ఎప్పుడు కుందేళ్లు తింటూ ఉండగా చూచాను, అడవి కుందేళ్ళు తింటూ ఉండగా చూడలేదు. మేత మేసేటప్పుడు వాటిని కొట్టడానికి వీలవుతుంది. ఆ సమయంలో అవి కాస్త నిలకడగా ఉంటవి. ఇతర సమయాలలో గురిపెట్టడానికి వీలుండదు."

రమాసుందరి నవగోపాలుడి ముఖము కేసి ఏకాగ్రదృష్టితో చూచింది. అందులో తిరస్కారభావ మున్నది. నవగోపాలుడు గ్రహించి తికమకపడి, ఏమి, టన్నాడు.

"ఆహారము తినేటప్పుడు కొడతారా వాటిని మీరు! ఎంత కఠినులు!"

గోపాలుడేమీ మాట్లాడక ఇటువంటి అమాయకురాలిని ఎందుకు వేటకు తీసుకు వచ్చానా అనుకొన్నాడు. అయితే ఆకిశోర హృదయములో ఈకరుణ అతనిని ముగ్ధుణ్ణి చేసింది. ఆడపిల్లలతో అతడు ఎన్నడూ సంభాషించలేదు. ఆడ వాళ్ళలో తల్లి ఒక్కతే అతనితో స్నేహముగా మాట్లాడేది. వేట సంగతి విన్నప్పుడు ప్రీతి చూపేది కాదు. కాబట్టి గోపాలుడు తల్లిదగ్గర వేట ప్రశంస చేసేవాడు కాడు. స్త్రీజాతికి సహజమైన మృదూపదేశము అతని వేట విషయములో ఇదే మొదటిసారి.

అయితే పశువధలో ఈమె ఎక్కువ కోమలహృదయ కాదు. రమ స్వయముగా కుందేళ్ళను పెంచడముచేత వాటిమీద ఆమెకు ప్రేమ అనుకొన్నాడు. అతనికొక సంగతి జ్ఞాపకము వచ్చింది. అతను ఎరిగిన పెద్దమనిషి ఒకాయన మేకలను సంహారము చెయ్యడానికి భూలోకములో అవతరించాడని చెప్పవచ్చు. మేక మాంసములేకుండా ఆయన ఏనాడూ భోజనము చేసేవాడు కాడు. ఒకసారి కలకత్తానుంచి కొంత మంది స్నేహితులు వచ్చారు. పెద్దమేకను కొని తేవడానికి ఆయన మనుష్యులను పంపించినాడు. కర్మవశాత్తు ఆవేళ పెద్ద మేక గాని చిన్నమేక గాని దొరకలేదు. సేవకులు చుట్టుపట్ల గ్రామాలు తిరిగి హతాశులై వచ్చారు. ఆయ నకు పెద్దపెంపుడు మేక ఉన్నది. ఒక పెద్దమనిషి ఆ మేకను

కోయించ మన్నాడు. "వల్లపడదు. నా చేతులతో దీనికి మేతపెట్టాను. కోయించడానికి వీలు లేదు" అన్నాడు యజమాని. కాబట్టి పాలక పాలితులకు స్నేహం మేర్పడుతుంది అనుకొన్నాడు గోపాలుడు. రమకు కూడా ఇటువంటి ప్రేమ ఏర్పడ్డది అని భావించినాడు.

రమ ప్రారంభించిన కథ మధ్యలోనే ఆగిపోయింది. పూర్తిగా వినవలెనని అతనికి ఉత్సాహము కలిగింది. ఇంతలో రమ చీర కొంగు ముళ్ళపొదకు పట్టుకొన్నది. అది జాగ్రత్తగా వదిలిస్తూ గోపాలుడు మళ్ళీ వెనకటి ప్రసంగము ఎత్తి "ఆకుందేళ్ళు ఇంకా ఉన్నవా రమా?" అన్నాడు.

"లేవు. ఒకదాన్ని కుక్క కొట్టేసింది. ఆదుఃఖముతో రెండోది చచ్చిపోయింది" అని రమ విచారముతో అన్నది.

"ఏపాటి యీడువి?"

"ఆటే పెద్దవి కాలేదు. ఒళ్ళు కొంచెము పసుపు తేలింది. కొంత పెద్దవయిన తర్వాత పగటి పూట తోటలో వదిలిపెట్టితే అస్తమానమూ ఆడుతూ తిరిగేవి. సాయంకాలము కాగానే వాటంతట అవే పంజరము దగ్గిరికి వెళ్ళిపొయ్యేవి. నేను వాటితో కబుర్లు చెప్పేదాన్ని. చేత్తో ఒళ్ళు నిమిరేదాన్ని. తలుపు తెరిస్తే పంజరములోకి వెళ్ళిపొయ్యేవి."

ఇంతలో వారున్నచోటికి కొంచెము దూరాన పుట్టలాంటిది కనబడ్డది. అందులో చాలా రంధ్రాలున్నవి.

గోపాలుడు దాన్ని వేలుతో చూపుతూ "అందులో ఏముంటవో తెలుసునా?" అని రమను మెల్లిగా అడిగినాడు. రమ ఆశ్చర్యపడి తెలియ దన్నది.

"నక్క బొర్రెలు, అందులో నక్కలుంటవి" అని గోపాలుడు చెపుతూ ఉండగానే నక్క ఒకటి బయటికి వచ్చింది. వారిని చూడగానే ఒక్కగంతు వేసి అడవిలో అదృశ్యమయింది.

"నక్కను కొడతావా రమూ?"

"ఆ."

సమీపములో పెద్దచెట్టు ఉన్నది. గోపాలుడు రమ చెయ్యి పట్టుకొని చెట్టుచాటుకు తీసుకొని పోయి "ఇక్కడినుంచి గురిపెట్టు. ఇంకో నక్కను రానీ" అన్నాడు. రమ ఆశ్చర్యముతో కళ్ళు తెరచి నెమ్మదిగా ఆ అన్నది.

వాళ్లు అట్టే సేపు కనిపెట్టుకొని ఉండవలసిన అవసరము లేకపోయింది. పెద్ద నక్క ఒకటి రంధ్రములోనుంచి బయటికి వచ్చి నాలుగు దిక్కులూ వాసన చూస్తూ తిరిగింది. తర్వాత కుక్కవలె వెనక కాళ్ళమీద కూర్చుని నాలుకతో రొమ్ము నాకు కోవడము మొదలు పెట్టింది.

తుపాకీ సిద్ధముగా ఉన్నది. గోపాలుడు చిన్నతుపాకీ రమ చేతికిచ్చి నెమ్మదిగా "గురి చూడు. బందూకు గట్టిగా పట్టుకో. నక్క అడ్డంగా కనబడేలాగు చూడు. చెయ్యి వణక నియ్యక గుర్రం లాగు" అని బోధ చేసినాడు.

రమకు అలుగులు విడవడము అభ్యాసమే కనుక గురిపెట్ట గలిగింది. బారుచేసి "సరిగా ఉన్నదా?" అన్నది.

గోపాలుడు ఆమె ముఖము దగ్గరగా ముఖముపెట్టి ఒకకన్ను మూసుకొని చూచి "బాగుంది. పేల్చు. చెయ్యి వణక నియ్యకు" అన్నాడు.

రమ, తుపాకీ పేల్చింది. చెయ్యి వణకిం దన్నాడు గోపాలుడు. పక్షికి దెబ్బ తగల లేదు. అది గంతువేసి అడవిలో దూరింది. గుండు తగిలిన చోట పుట్టమీద మెత్తటి మన్ను పడ్డది. నవగోపాలుడు నవ్వినాడు. రమ కూడా నవ్వి "చాలా గట్టిగా పట్టుకొన్నాను. అయినా చెయ్యివణకింది" అన్నది. గోపాలుడు ఆమె నోదార్చి "మొదటి సారి అలాగే వణుకుతుంది. క్రమేణ తిన్నన అవుతుంది" అన్నాడు.

"ఇక్కడే ఉందాము. ఇంకో పక్షిని రానివ్వండి. అప్పుడు కొడతాను."

"పిచ్చి పిల్లా! తుపాకీ చప్పుడు అయిన తర్వాత ఏజంతువులూ సులువుగా రావు. ఇక్కడుంటే లాభం లేదు. వెళ్లుదాము పద."

నవగోపాలుడు రెండు తుపాకులూ టిఫిన్ బాక్సూ తీసుకొన్నాడు. రమ నిట్టూర్పు విడిచి తోటాల పెట్టె పట్టుకొన్నది. వేటకాండ్లు దట్టమైన అడివిలోకి వెళ్ళినారు.

# ౧౪

వాళ్ళు కొంతదూరము వెళ్ళేసరికి అడవి హంసల కూతలు వినబడ్డవి. దగ్గరలో చెరువున్న దని గోపాలు డూహించినాడు. చప్పుడు వస్తున్న వైపు వారు నడిచినారు. ఇంతలో చెట్ల సందులలో నుంచి చెరువు కనబడ్డది. అక్కడ కొన్ని హంసలు తిరుగుతున్నవి. కొన్ని కొద్దిగా ఎగురుతున్నవి. అవే పెద్దవి కావు. నల్లటివి.

"రమా, తుపాకీ తయారు చేస్తాను" అన్నాడు గోపాలుడు.

"ఈమాటు మీరు కొట్టండి."

"నేనిదివరలో కొన్నింటిని కొట్టాను. ఇప్పుడు నీవు కొట్టు."

"మళ్ళీ నా చెయ్యి వణుకుతుందేమో. పక్షులన్నీ ఎగిరి పోతవి!"

"ఈసారి చెయ్యి వణికినా ఇబ్బందిలేదు. పక్షులు గుంపుగా ఉన్నప్పుడు గురి చూడడం తేలిక. చెయ్యి వణికి నప్పటికీ ఒక దానికి కాకపోతే ఒకదానికైనా గుండు తగులుతుంది. చివరకు ఫలితం ఒకటే."

నక్కను కొట్టడానికి రమ సంకోచించలేదు, కాని హంసలను చంపడానికి ఆమెకు మనస్సు ఒప్పలేదు. అవి యెంత బాగున్నవి! అయినప్పటికీ రమ వాటిని కొట్టననడానికి

మొగమాట పడ్డది. కుందేళ్ళను కొట్టననీ అడివి హంసలను కొట్టననీ మాటిమాటికీ ఏదో అడ్డంకి పెట్టుతూ ఉంటే వేటకు ఎందుకు వచ్చావని గోపాలుడని పోతాడనే భయముతో నూరుమాట చెప్పక రమ మనస్సు గట్టిచేసుకొని అతని చేతులోనుంచి తుపాకీ తీసుకొంటూ "ఇవ్వండి. నేను బారు పడతాను. ఎప్పుడూ మీరే బారుపెట్టి ఇస్తే నేను నేర్చుకొనేదెప్పుడు ?" అన్నది.

రమ బారు పెట్టి "చూడండి. ఈసారి సరిగా ఉన్నదేమో" అన్నది.

గోపాలుడు చూచి "సరిగా ఉన్నది. ఈసారి పేల్చేటప్పుడు చెయ్యి కదిలినా నష్టము లేదు" అన్నాడు.

రమ గుర్రము నొక్కింది. తుపాకీ పేలింది. హంసలు భయముతో కీచు మంటూ ఎగిరిపోయినవి. రెండింటికి దెబ్బ తగిలి నీళ్ళలో పడి టపటపా కొట్టుకొన్నవి.

రమకు వేటతమకము పుట్టింది. అదివరకున్న భూతదయ కాస్తా పోయింది. "చూడండి, రెండు పడ్డవి" అని ఉత్సాహముతో అన్నది.

గోపాలుడు సంతోషించినాడు. రమ తన ఉత్సాహానికి సిగ్గు పడుతూ "అయ్యో, రెండు పిట్టలను చంపి వేశానే!" అన్నది.

“పిట్టలను కొట్టడమే కాదు. చెయ్యి వణకలేదు ఈసారి.”

“చెయ్యి వణికినా నష్టము లేదన్నారు మీరు. అందువల్ల నామనస్సు దానిమీద లేదు. చెయ్యి వణకలేదు. మొదటి సారి అయినా అంతజాగ్రత్తగా ఉండమని చెప్పకపోతే అప్పుడు కూడా చెయ్యి వణికేది కాదు.”

గోపాలుడు రమను అక్కడనే ఉంచి హంసలను తీసుకు రావడానికి వెళ్ళినాడు. అతడు నీళ్ళలోదిగి వాటిని సంచిలో వేసేటప్పటికి అవి సంసార బాధనుంచి విముక్తి పొందినవి. అంతట గోపాలుడు రమదగ్గరకు వచ్చి సంచి ఆమె చేతికిచ్చి “ఇది నీ మొదటి వేటకు ప్రతిఫలము. నీవు మాంసము తింటావా ?” అన్నాడు.

“అభ్యంతర మేమిటి ?”

“హంస ఇష్టమేనా ?”

“ఎప్పుడూ తినలేదు.”

“ఏమి తినే దానివి ?”

“మేకపిల్ల.”

“పిట్ట మాంసము తిన్నావా ?”

రమ కొంచె మాలోచించి “తిన్నాను. కముజు, మొదలైనవి. హంస ఎప్పుడూ తినలేదు,” అన్నది.

“తిని చూడు. చాలా బాగా ఉంటుంది.”

రమ క్షణము ఊరకుని "వీటిని మీరు తీసుకు వెళ్ళండి" అన్నది.

గోపాలు డామె చెయ్యి పట్టుకొని ప్రేమతో "అలా ఎప్పటికీ కాదు. మొదటి సారి నీవు వేటాడినవి నీవే తీసుకు వెళ్ళవలె" అని బోధించినాడు.

"మీకు హంస మాంసము ఇష్టము లేదా?"

"చాలా యిష్టం."

"అయితే మీరు ఇందులో ఒకటైనా తీసుకు వెళ్ళక తప్పదు."

గోపాలుడు ఆమె బలవంతానికి చాలా సంతోషించి "నీహంసలు నేను తినవలెనని కోరిక ఉంటే ఒకపని చెయ్య గూడదా?" అన్నాడు.

"ఏమిటి?"

"ఇవాళ సాయంకాలము మీయింటికి నన్ను భోజనానికి ఎందుకు పిలవగూడదు?"

"మంచిది. సాయంకాలము భోజనానికి రండి."

నవగోపాలుడు ఆమాటలు తమాషాకు అన్నాడు. కాని ఆచిన్నదాని ప్రత్యుత్తరమువల్ల అతనికి వెనకటి సంశయమే కలిగింది. ఆమెను తన వెంట అడవికి షికారు తీసుకు వెళ్ళి నందుకు ఇంట్లో వాళ్ళు రమను కోప్పడరా? తనమూలకముగా ఆపిల్లకు చివాట్లు తగలవా? ఈసంగతి తెలుసు

కొందామనే కుతూహలముతో గోపాలుడు "రమా, ఇంటికి వెళ్ళినాక నా సంగతి యేమని చెప్తావు?" అని ప్రశ్న వేసినాడు.

"మావాళ్ళు మిమ్మల్ని ఎరగరనేనా మీరనుకొంటున్నారు?"

"వారికేమి తెలుసు?"

"నేను చెప్పి వేశాను. మొన్న మీరు నన్ను పడవదగ్గర నుంచి మాయింటికి పంపించిన తర్వాత మీ సంగతి చెప్పాను. మీరిచ్చిన పిట్టలు అందరికీ చూపించాను."

రమాసుందరి తాలూకు మనుష్యులు అడవిలో చాలా రోజులనుంచీ నివాసము చేస్తున్నారు. తమ చుట్టము కాని పడుచువాని వెంట పడుచుపిల్ల ఒంటరిగ ఎక్కడికీ వెళ్ళడము యుక్తము కాదని చెప్పలేదు. ఏమంటే, మహేశపురములో కొత్త పడుచువాళ్లు ఎవరూ లేరు. అంతే కాకుండా ఉన్న బాలికాబాలకులతో రమ యిష్టము వచ్చినట్టు ఆడుకొంటూ ఉండేది. అందుచేత ఆమె కెవరూ ఏమీ చెప్పవలసిన అవసరము లేకపోయింది.

రమను ఇంటిదగ్గర దిగబెట్టి ఆరోజు భోజనానికి రాలేనని ఆమె తండ్రితో మాట్లాడి మరొకనాడు వస్తానని చెప్పడానికి నిశ్చయించుకొన్నాడు గోపాలుడు.

అప్పటికి మూడుజాము లయింది. "ఆకలి వెయ్యడం లేదా

రమా ?" అన్నాడు నవగోపాలుడు.

ఇంకొక పిల్ల అయితే లేదని చెప్పేది. కాని రమ అటువంటి ఉపదేశము ఎరగక పోవడమువల్ల "బాగా ఆకలివేస్తున్నది" అని నిష్కపటముగా చెప్పింది.

"నాకు కూడా ఆకలి వేస్తున్నది. నీటి ఒడ్డున కూచుని ఇద్దరమూ కాస్త ఫలహారము చేతాము రా" అని గోపాలుడన్నాడు.

మెట్లనిగడ్డి ఉన్నచోటికి వెళ్ళి ఇద్దరూ కూచున్నారు. గోపాలుడు టిఫిన్ బాక్సులోనుంచి ఫలహారము తీసినాడు. బుడ్డిలో నీళ్ళున్నవి. రమ బుడ్డి పట్టుకొని "వేడిగా ఉన్నదే" అన్నది.

"ఎండకు వేడెక్కింది. అయితే ఉపాయ ముందిలే."

"ఏమిటో చెప్పండి, చూస్తాను."

"నేను చేసి చూపిస్తాను."

గోపాలుడు సంచిలోనుంచి చిన్న లోహ యంత్రము తీసి చెట్టు నీడను గుంట తవ్వి బుడ్డి మూతివరకూ పాతిపెట్టి తిరిగి వచ్చి "నీళ్లు చల్లబడేలోగా మనము ఫలహారము చేతాము" అని చెప్పినాడు.

ఇద్దరూ ఉపాహారము పుచ్చుకొనే సమయములో గోపాలుడు రమ సంగతులు, ఇంట్లోవాళ్ళ సంగతులూ అడిగి తెలుసుకొన్నాడు. కొంతసేపటికి సీసా తీసుకు రావడానికి

వెళ్ళినాడు. అతను సీసా తప్పుతూ ఉన్నసమయములో రమ "చూడండి, చూడండి" అని కేక వేసింది

గోపాలుడు నాలుగువైపులా చూచినాడు. పెద్ద అడవిపంది కోపముతో వారివైపు పరుగెత్తుకు వస్తున్నది.

వెంటనే గోపాలుడు రమదగ్గరికి వెళ్ళి తుపాకీ తీసుకొని పందిని కాల్చినాడు.

అదృష్టవశాన గుండు పంది కాలికి తగిలింది. అది పెద్ద బొబ్బ పెట్టి కుంటుకుంటూ పారిపోయింది.

తర్వాత ఇద్దరూ కొంతసేపు నవ్వుకొన్నారు.

ఉపాహారము పుచ్చుకొనడము పూర్తి అయింది. రమ సూర్యుడికేసి చూచి "ఇక తిరిగిపోదాము. వెళ్ళకపోతే చాలా ఆలస్య మవుతుంది ఇల్లు చేరేటప్పటికి" అన్నది.

ఇద్దరూ కబుర్లు చెప్పుకొంటూ ఇంటివైపు బయలుదేరినారు. అడివిలో నడవడము అలవాటే కనుక గోపాలుడు మార్గము మరచిపోలేదు. రమ అడివి ప్రదేశాలు చూచి "మీరు మహాభారతము చదువుకున్నారా?" అన్నది.

"చిన్నప్పుడు చదివాను."

"అయితే అన్నికంటె మీకు ఏపర్వము ఎక్కువ యిష్టం?"

"ద్రోణ కర్ణ పర్వాలు."

"నాకేపర్వ లిష్టమో తెలుసునా?"

“ ఏపర్వము ?”

“ వన పర్వము.”

“ నీవు మహాభారతము చదవగలవా ?”

“ చదవలేను. మాయింటిపక్క యదుబాబుగారి యింట్లో రోజూ భారతము చదువుతారు. నేను వినడానికి వెళుతాను. వనవర్వమంటే నాకు చాలా యిష్టం. ఈవనం చూస్తే వన పర్వంలో కథలు చాలా జ్ఞాపకం వస్తున్నవి. భీముడు నీల పద్మం తెచ్చేభాగం బాగుంటుంది.

అతఃవర భీమ, పరాక్రమే భీమ,

చవిలా ఉత్తరపథే,

దుయి భీతే యత, అభయే పర్వత,

నానావర్ణవృక్ష తాతే—

అక్కడినుంచి భీముడు సూటిగా కుబేర పట్నానికి వెళ్ళి యుద్ధంచేసి పద్మం తీసుకు వస్తాడు. మనకు అడవులున్నవి, కొండలు లేవు. కొండ చూడాలని నాకెంతో మనసు. మీరు కొండ చూశారా ?”

“ చూచాను. పశ్చిమాన చాలా పర్వతా లున్నవి. మీనాయనగారు పంజాబులో ఉద్యోగం చేశారంటివి కదా ; పంజాబు వెళ్ళితే నీకు చాలా కొండలు కనబడతవి.”

చెట్లు వలచ బడుతున్నవి. అడివి వెనకబడుతున్నది. దూరాన మహేశపురము కనబడుతున్నది. అప్పటికి వాళ్ళు

వంకరటింకరగా ఉన్న బండితోవను పడ్డారు.

ఆమార్గమువెంట కొంతదూరము వెళ్లేసరికి రమ సంతోషముతో ఉప్పొంగింది, దూరానవస్తున్న మనిషిని గోపాలుడికి చూపి ‹‹ ఎవరో తెలుసునా ?›› అన్నది.

‹‹ ఎవరు ?››

‹‹ మీరు చెప్పలేరా ?››

‹‹ నేను గుర్తు పట్టలేను.››

‹‹ మాబాబు !›› అని రమతండ్రిని పలకరించడానికి ముందుకు పరుగెత్తింది.

# ౧౪

మూడు జాములు కావచ్చింది. గంగాధర పట్నాయక యొక్క పరివారములో అంతా భోజనాలు చేశారు. ముసలమ్మ విశ్రాంతిగా కూర్చుని జపమాల త్రిప్పుతున్నది ఆవిడకు కొంచెము దూరముగా కూర్చుని లక్ష్మి అంగీ కుట్టుతున్నది. ఇంట్లో ఇంకెవ్వరూ లేరు.

లక్ష్మి చేతిలో ఉన్న కుట్టుపని చూచి ముసలమ్మ "కొత్త దింకోటి ఆరంభం చేశావే" అన్నది.

లక్ష్మి ఆమెకేసి చూచి చిరునవ్వు నవ్వింది. అంత దూరాన్నుంచి ఆమె కేమైనా చెప్పినా ఒకటే, చెప్పక పోయినా ఒకటే. లక్ష్మి తన ధోరణిలో పడి కుట్టుపని చేసుకొంటున్నది. ముసలమ్మ మరికొంతసేపు జపమాల త్రిప్పుతూ ఉన్నది. ప్రారంభించిన భాగము పూర్తికాగానే లక్ష్మి యింకో మడత సంతోషముతో విప్పింది. నల్లని శాటిన్ గుడ్డ సూర్య కాంతిలో ధగధగ లాడింది.

అదిచూచి ముసలమ్మ "ఈసారి పెద్దఅంగీ కుట్టుతున్నావే. ఎవరికోసమేం? రాజుకోసమా, రఘుకోసమా?" అన్నది.

ఈప్రశ్నలకు లక్ష్మి ముఖాన నవ్వు కనబడ్డది. కుట్టిన అంగీ పీటమీద పెట్టి ముసలమ్మ దగ్గరకు వెళ్ళి చెవులో నోరు

పెట్టి, చెయ్యి అడ్డము పెట్టి "రమ పెళ్ళికి తయారుచేస్తున్నాను అక్కా" అన్నది.

ఈమాటలు విని ముసలమ్మ ముఖాన చేత్తో మోదుకొని "ఆ నారాయణమూర్తి ఎన్నటికి కన్నెత్తి చూస్తాడో తెలియదు!" అన్నది.

"భయం లేదు అక్కా. రమకు వరుడు తొందరలోనే వస్తాడు. చాలా అందమైనవాడు, డబ్బు ఉన్నవాడు, చదువుకొన్నవాడు, మంచివాడు, వస్తాడు."

ముసలమ్మ నిట్టూర్పు విడిచి "నీనోట ముత్యాలు రాల! అందమైనవాడు, డబ్బు గలవాడు, చదువుకొన్నవాడు అక్కరలేదు తల్లీ. ఏదో మోస్తరు—కుంటి గుడ్డి కాకపోతే చాలు. సంప్రదాయం ఉన్నవాడు దొరికితే బతికిపోతాము: కులము నిలుస్తుంది. నాయనా, మధుసూదనా! నీవు కులము కాపాడకపోతే ఇంకెవరు కాపాడుతారు తండ్రి!" అన్నది.

"మీ దేశపు పద్ధతి అంతా చాలా అసహ్యం. రమకు పద్నాలుగేళ్లు. మీ కులము పోతుంది. రాజస్థానంలో ఇరవై యేళ్ళ పిల్లలకు పెళ్ళిళ్ళు చేస్తారు. కులము పోదు."

లక్ష్మి ఈమాటలనేసరికి వాకిట్లో గొళ్ళెము చప్పుడయింది. ఆమె లేచి దర్వాజావైపు చూచింది. ఆమెలో కలిగినమార్పు కనిపెట్టి ముసలమ్మ కుతూహలముతో అటూ ఇటూ చూచింది.

మళ్ళీ చప్పుడయింది. ఈపాటప్పుడు ఎవరబ్బా వచ్చారు అనుకొంటూ లేచి లక్ష్మి త్వరగా వెళ్ళి తలుపు తీసింది. గదాధరుడు వచ్చినాడు. ఆయన శోణాపురము కచ్చేరీలో ఖజానా ఇవ్వడానికి మూడురోజులకిందట వెళ్ళి నాలుగోనాడు వస్తానని చెప్పినాడు. ఈవేళ వస్తాడని ఎవరూ అనుకోలేదు. గదాధరుడు వస్తూ "ఇంట్లో అంతా తిన్నగా ఉన్నారా?" అని అడిగినాడు.

"ఉన్నారు బాదాబాబూ. మీరెలాగున్నారు?"

"బాగానే ఉన్నాను."

ఇలా అంటూ ఆయన మెల్లిగా వసారాలో అక్కగారి దగ్గరకు వెళ్ళినాడు. తమ్ముడు రావడము చూచి కుసలమ్మ యింట్లోనుంచి బయటికి వచ్చి వసారాలో నిలుచున్నది. నిలుచుని తమ్ముడికేసి అనుమానిస్తూ చూచి "ఎందలాగే వచ్చావు. ఒంట్లో సరిగా ఉందా?" అన్నది.

గదాధరుడు నవ్వుతూ తాను ఖులాసాగా ఉన్నట్టు సంజ్ఞలతో తెలియజేసినాడు.

"భోంచేశావా?"

"లేదు. కాస్త ఫలారంచేసి బయలుదేరినాను."

ఆమె కేమీ వినబడలేదు. తమ్ముడి పెదిమెలు కదలడము మాత్రము కనబడ్డది. లక్ష్మికేసి ప్రశ్నిస్తూ చూచింది.

లక్ష్మి ఆవిడ చెవిదగ్గర నోరుపెట్టి "అన్నం తినలేదుట. ఫలహారం చేసి వచ్చారుట" అని చెప్పింది.

"అయ్యో, ఇంతపొద్దు దాటిపోకా అన్నం తినకుండా ఉంటే నోరెండిపోదూ? నేను వెళ్ళి నాలుగు మెతుకులు ఉడకేసి పెడతాను. పప్పు ఉంది, చేపలపులుసు ఉంది. నాలుగు గింజలు పొయిమీద ఎక్కిస్తాను. ఇంతలో కాళ్ళూ చేతులూ కడుక్కొని కాస్త పక్కేస్తు తొంగుందువుగాని, లక్ష్మీ, వెళ్ళి నీళ్ళు పట్టుకురా. నేను వంటయింట్లోకి వెడుతున్నాను" అంటూ ముసలమ్మ త్వరగాలోపలికి వెళ్ళింది.

"రాజీ, రమా ఎక్కడున్నారు?" అని గదాధరుడు లక్ష్మిని అడిగినాడు.

"ఎక్కడికో ఆడుకోవడానికి వెళ్ళి వుంటారు."

ముసలమ్మ వంటయింట్లోకి వెళ్లి చూచేటప్పటికి పొయిలో నిప్పు ఆరిపోయినట్టుంది. ఆవిడ ఎండుతాటాకు తీసి నిప్పు రాజేసింది. తాటిముట్టలు కొన్ని పొయిలో వేసి హాండీలో నీళ్ళుపోసి పొయిమీద పెట్టింది. తర్వాత షర్బత్తు తయారు చేసి లక్ష్మి చేతికిచ్చి పంపింది.

వంట అయిన తర్వాత గదాధరుడు భోజనానికి కూర్చున్నాడు. లక్ష్మి విసనకర్ర తీసుకొని ఆయన పక్క కూచుని విసురుతున్నది. రోజూ రమ విసిరేది. "రాజీ రమా ఇంకా రాలేదేమి?" అన్నాడాయన.

"వస్తారు."

"వెళ్ళి ఎంతసేపయింది?"

"తెలియదు. అప్పుడింట్లో లేను."

గదాధరుడు నిశ్శబ్దముగా భోజనము చేసినాడు. ఆయన చెయ్యి కడుక్కునే టప్పటికి రాజలక్ష్మి గంతులు వేస్తూ వచ్చింది. పిల్లకు పదేళ్ళు.

"రాజీ, అక్కయ్య రాలేదేం?" అన్నది లక్ష్మి.

"అక్కయ్య నాతో వచ్చిందనుకొన్నావేం?"

"అయితే ఎక్కడుంది?"

"వేటకెళ్ళింది."

గదాధరుడు ఆశ్చర్యముతో ఏమి టన్నాడు.

రాజలక్ష్మి కొంగు వేలికి చుట్టుకొంటూ "అక్కయ్య వేటకు వెళ్ళింది" అన్నది.

"అక్కయ్య వేటకు వెళ్ళిందా! ఏమి వేటకు?"

"పులిని, లేడిని వేటాడడానికి."

గదాధరుడు నవ్వినాడు. తనకూతురు ఏదో కొత్తతమాషా చేస్తున్నదనుకొన్నాడు. విల్లు అమ్ములూ తీసుకొని వెళ్ళిందనుకొన్నాడు.

"పులిని చంపడాని కెక్కడికి వెళ్ళింది? మామిడితోట లోకా?" అన్నాడు.

"మామిడితోటలో కెందుకు ? అడివికి. ఆపిట్టలుపట్టే ఆయన అక్కయ్యను అడివికి తీసుకు వెళ్ళాడు."

ఈమాటలకు గదాధరుడు ఆశ్చర్యపడి "పిట్టలుపట్టే ఆయన యెవ ?" రన్నాడు.

"పిట్టలుపట్టే ఆయన మళ్ళీ వచ్చాడా యేమిటి ?" అన్నది లక్ష్మి.

రాజలక్ష్మి జవాబు చెప్పకముందే గదాధరుడు లక్ష్మితో "పిట్టలుపట్టే వాడెవరు ?" అన్నాడు.

రెండురోజుల కిందట తనకు రమ చెప్పిన సంగతులన్నీ లక్ష్మి ఆయనతో చెప్పింది. రాజలక్ష్మి అందుకొని "అక్కయ్య ఆయన పడవలో ఉన్నపిట్టలు చూడడానికె వెళ్ళింది. అందులో ఎన్నెన్ని రకాలపిట్టలు ! వందో రెండువందలో!" అని చెప్పింది.

విని గదాధరుడు కీడు మూడిందనుకొన్నాడు. దుర్మార్గుడెవడో వచ్చి రమను మోసముచేసి తీసుకు వెళ్ళాడనీ, పిల్ల ఇక దొరకదనీ, పోలీసు రిపోర్టు చెయ్యాలనీ అనుకొన్నాడు. ఆయనకు కోపము వచ్చింది, అసహ్యామూ వేసింది.

"వెళ్ళిందా — ఎవరితో చెప్పి వెళ్ళింది ?" అన్నాడు.

"అత్తయ్యతో చెప్పి వెళ్ళింది" అన్నది రాజలక్ష్మి.

గదాధరుడు అక్కగారి నడిగినాడు. తనకేమీ తెలియదని ఆమె చెప్పింది.

“అత్తయ్యా, పిట్టను పట్టే ఆయన వస్తాడు. నేనాయనతో షికారు వెళ్ళినా అని అక్కయ్య అంటే నీవు మంచిది మంచిది మంచిది అన్నావు” అన్నది రాజలక్ష్మి.

ముసలమ్మ అన్నమాట నిజమే, కాని రమ యాదుపుగో హితుడి యింటికి మహాభారతము వినడానికి వెళ్ళుతూ అడిగిందనుకొన్నది. ఇప్పుడు జరిగిన సంగతి తెలుసుకొని ఆవిడ చాలా ఆందోళన పడ్డది.

మతి పోయినట్టయి గదాధరుడు వెంటనే బయలుదేరినాడు. త్రోవలో ఎరిగినవాళ్ళ నందరినీ రమ కనబడ్డాదా అని అడిగినాడు. అందరూ కనబడలేదన్నారు. చివరకు హరిపదు డనే జాలరివాడు మధ్యాహ్నము నదిలో చేపలు పట్టి తిరిగి వచ్చేటప్పుడు తనకు రమ కనబడ్డదని చెప్పినాడు. తుపాకీ ఉన్న బాబు ఆమెవెంట ఉన్నాడన్నాడు.

ఎవడో పొడుగాటిజుట్టు గడ్డము వాడూ, చిరిగిపోయిన బట్టల వాడూ, స్నానము చెయ్యని అడివి మనిషీ తనకొమార్తెను తీసుకు పోయినాడని గదాధరుడు ఇంతసేపూ అనుకొంటు న్నాడు, ఇప్పుడు బాబు అనేమాటకు ఉలికిపడి “బాబా, ఎటువంటి బాబు ? మనిషి ఎలావుంటా ?” డని అడిగినాడు.

“పెద్దమణిసిలాగే వుండాడు. వేషం గీషం సూస్తే గొప్పోరి అబ్బాయిలా గుండాడు. ఎందుకు చాటు మహాయి, ఏంటి సంగతి ?” అని హరిపదు డన్నాడు.

గదాధరుడు అంతా వివరించి చెప్పినాడు.

"మరేం భయంలేదు దాదాఠాకూర్. ఆయన ఏఁడమీరాం దారుగారి బిడ్డలాగో ఉంటాఁరు. రేవుకు వచ్చి, సరదాపుట్టి అమ్మాయిగార్ని కొంతదూరం తీసుకపోయి వుంటారు. ఈపాటికి తీసుకవచ్చి దిగబెడతారు."

"నీకెలా తెలుసు గొప్పవారి బిడ్డని ?"

"రేవున వారి నావ కట్టేశారు. వొడ్డున సిఫాయీలూ తుపాకులవాళ్ళూ కూకుండారు."

రేవుకువెళ్లి అక్కడి వాళ్ళను అడిగితెలుసు కోవచ్చు అని గదాధరుడు హరిపదణ్ణి వెంటబెట్టుకు వెళ్ళినాడు. పడవబద్దుకు కట్టివేసి ఉన్నది. పడవవాళ్ళు కొంతమంది వంట చేసుకొంటున్నారు. ఒకరిద్దరు చెట్టునీడను పడుకొన్నారు. ఫౌజుదారు సింగు ఊగుతూ తులసీదాసు రామాయణము చదువుతున్నాడు. గదాధరుడు అతని దగ్గిరికి వెళ్లి "ఈపడవ యెక్కడినుంచి వచ్చింది బాబూ ?" అని అడిగినాడు.

సింగు రామాయణము చదవడము ఆపి "విశాలాక్షీ జాన్తేహో ?" అని గంభీరముగా అన్నాడు.

గదాధరుడు హిందీ భాషలో "జాన్తాహై" అన్నాడు.

"విశాలాక్షీనే ఆయా."

"ఐ కిస్కానా హై ?"

## ౧౬

రమ పరుగెత్తుకు పోయి తండ్రిచెయ్యి పట్టుకొని "రెండు అడివిహంసలు కొట్టాను నాన్నా" అన్నది.

తండ్రి కళ్ళెర్రజేసి "ఎక్కడికి వెళ్ళావు?" అని కఠినముగా అడిగినాడు.

"వేటకు వెళ్ళాను"

"ఇంటికి నడు" అని తండ్రి కోపముతో అన్నాడు.

ఆయన ఆకారము చూచి రమ ఆశ్చర్యపడ్డది. ఇదివరకెన్నడూ తండ్రి యిలా ఉండడము చూడలేదు. ఆమె నవకోపాలుడికోసము నిలుచున్నది.

గదాధరుడు బొమలు ముడవేసి "నిలుచున్నావెందుకు? ఇంటికి నడుస్తావా నడవవా?" అని నెమ్మదిగా అన్నాడు.

"ఆవచ్చే బాబుగారివెంట వెళ్ళాను వారిని ఇవాళ భోజనానికి పిలిచాను నాన్నా" అని రమ మృదుస్వరముతో చెప్పింది.

గదాధరుడు విసుగుతో "సరేలే ఇంటికినడు ఇక" అని కోమార్తెను నెట్టినాడు.

"వారిని వెంటబెట్టుకురా నాన్నా" అని రమ బయలు దేరింది. క్షణములో ఆమెను చెట్లుమరుగుచేసినవి.

తనపక్కనుంచి రమ వరుగెత్తిపోయినతర్వాత నవగోపాలుడు హరిపదుని సైగచేసిపిలిచి తుపాకీ మొదలైనవస్తువులు వాడిచేతికిచ్చి "భద్రంగా పట్టుకో" అని ఆజ్ఞాపించినాడు.

రమ బయలుదేరినతర్వాత గోపాలుడు ముందుకువెళ్ళి ఆమె తండ్రికి నమస్కారముచేసినాడు.

గదాధరుడు ప్రతినమస్కారముచేసి కొంచెము బిగ్గరగా "మీరు విశాలాక్షీ జమీందారు కాంతిబాబుగారిపుత్రులా?" అన్నాడు.

గోపాలుడు తల కొద్దిగావంచి అవునన్నట్టు సంజ్ఞచేసినాడు.

"మీతో కొంచెము మాట్లాడవలసిఉన్నది"

"వ్యవహారం బాగాలేదు" అనుకొని గోపాలుడు చిరునవ్వుతో బిగ్గరగా నరేఅని హరిపదుణ్ణి దగ్గిరికి పిలిచి "రేవున మాపడవ కట్టివేసిఉన్నది. ఈవస్తువులు అక్కడికి చేర్చగలవా?" అన్నాడు.

"ఎందుకుచేర్చలేను హుజూర్?"

"జాగ్రత్తగా తీసుకుపో. క్రిందపడవేశేవు?" అంటూ గోపాలుడు జేబులోనుంచి అర్ధరూపాయి తీసి వాడిచేతిలో వేసినాడు.

బహుమానము దొరకగానే హరిపదుడు ఉత్సాహముతో నదివైపు నడిచినాడు.

నవగోపాలుడు శాంతముగా దర్పముగా ఆయనముఖము కేసి చూచినాడు. బాటకు కొంచెముపక్కగా ఇటుకలతో కట్టిన వంతెన ఉన్నది. గదాధరుడు అటు రమ్మని సైగచేసి తాను ముందునడిచినాడు,

గోపాలుడు సేతువు మీదకూర్చున్నాడు. గదాధరుడు అతని ఎదురుగా నిలుచుని "మీరు సద్వంశములో పుట్టినారు, బుద్ధిమంతులు. కాని ఈవేళ మీరుచేసినపని మీకు తగినదేనా?" అని మందలించినాడు.

తానుచేసినది తప్పే అని గోపాలుడు నొచ్చుకొన్నాడు. బుద్ధిపూర్వముగా రమ అతనివెంట వచ్చింది. అయినా ఆమె చిన్నది. చిన్నదానికి అంతవివేచన ఉంటుందా? బాధ్యతయావత్తూ అతనిదే. అయితే చేసినపనికి క్షమాపణవేడడము కాని, సిగ్గుపడడముగాని, పశ్చాత్తాప చెందడముగాని అతని కభ్యాసములేదు. అందువల్లకొంచెము ఊరుకుండి ఔద్ధత్యముతో ఏమి అన్నాడు.

"ఈడువచ్చిన మాపిల్లను మీరు ఈవేళ వెంటబెట్టుకొని అడివిలోకి వేటకు వెళ్లడము ఉచితమేనా?"

"ఏమిటి తప్పు?" అనిగోపాలుడు చిరునవ్వుతో అన్నాడు.

పత్రిక సంపాదకుడైన కాంతిచంద్ర వంద్యోపాధ్యాయుని కుమారునితో తాను మాటాడుతున్నట్టు గదాధరుడు మరిచి పోయినట్టయితే ఈమాటలకు తగిన జవాబు చెప్పేవాడే. కాని గోపాలుడి శాంతమూ దర్పమూ చూచి గదాధరుడు కొంచెము తికమకపడి, మెత్త మెత్తగా అంటేంతామనుకొన్న మాటలన్నీ మరిచిపోయినాడు. అదివరకున్న కంఠస్వరము చాలావరకు తగ్గిపోయింది. అందుచేత గదాధరుడిలా అన్నాడు. "తప్పేమిటో వింటారా? అయితే చెపుతాను. మేముబీద వాళ్ళము ఏవో నాలుగుడబ్బులు సంపాదించుకొని ఎలాగో సంసారము నడుపుకుంటున్నాము. ఈరోజుల్లో బాగాడబ్బు ఉంటేనేకాని ఆడపిల్లలకు పెళ్ళికాదు. అందువల్ల ఇంతవరకూ అమ్మాయికి పెళ్ళిచెయ్యలేకుండా ఉన్నాను. ఇలావంటి స్థితిలో పద్నాలుగేళ్లు వచ్చిన మాపిల్లను జమీందారుగారి అబ్బాయి వేటకు తీసుకువెళ్ళినాడని నలుగురికీ తెలిస్తే నా కొమార్తెకింకా పెళ్లిఅవుతుందా?"

గదాధరుడు తీవ్రముగా మాట్లాడినప్పుడు నవగోపాలుడు కూడా సదర్పముగా ఉన్నాడు. ఇప్పుడు ఆయన దూకుడు తగ్గడముచేతగోపాలుడు ఉద్ధతభావము విడిచి శాంతముతో ఇలాగన్నాడు.

" మీరుపెట్టినచివాట్లు కొంతవరకు న్యాయమే: మీ అమ్మాయి ఈడువచ్చినపిల్ల అనిచెప్పారు. ఆపిల్ల యువతిఅనుకో

లేదు, బాలిక అనుకున్నాను. అది అభిప్రాయభేదము. అది అలాఉంచండి. ఏదో నష్టమువస్తుందని మీరు సూచించారు ఇవాళ మిమ్మలిని కలుసుకోకముందు మీతో ఒకవిషయము ప్రస్తావింతామనుకొన్నాను. కాని ఇవాళనే ఆప్రస్తావన చేస్తాననుకోలేదు. మీరు ఊళ్లో లేరనీ ఒకటి రెండురోజులదాకా రారనీ మీఅమ్మాయి చెప్పింది. నాప్రస్తావన అంగీకరిస్తే, మీరు వస్తుందనుకొన్న నష్టము రాదు."

గదాధరుడు కొంచెమాశ్చర్యపడి «ఏమిటి మీప్రస్తావన?" అన్నాడు.

నవగోపాలుడు వెనకటివలెనే శాంతముగా, సరళముగా «నాప్రస్తావనఏమిటంటే — మీఅమ్మాయిని నాకిచ్చి వివాహము చెయ్యండి" అన్నాడు.

ఈమాటలకు నోట మాటలేక గదాధరుడు నెమ్మదిగా సేతువుమీదికెక్కి గోపాలుడిపక్కన కూర్చుని అతనికేసి తిరిగి "నిజంగానే అంటున్నారా?" అనిఅడిగినాడు.

గోపాలుడు ఆయనకేసి చూడకుండా దూరాన గాలికి కదులుతున్న చెట్లకేసి చూస్తూ "అబద్ధము చెప్పడముఅభ్యాసము లేదు" అనిదృఢముగా అన్నాడు.

గదాధరుడు కొంచెముసేపు నిశ్శబ్దముగా ఉన్నాడు. గోపాలుడుకూడా కొంతసేపు ఊరుకొని తర్వాత ఆయనకేసి శాంతముగాచూస్తూ "నాప్రస్తావనకు ప్రత్యుత్తరము ఇచ్చారుకారు" అన్నాడు.

"మీ ప్రస్తావన నాకు చాలా గౌరవావహము. మీకు అల్లుడు కావడం నావంటివాడికి ఆశాతీతమైన సౌభాగ్యము! మీ ప్రస్తావన శిరసావహించ తగ్గది. అయితే ఒక్క సంగతి. మీనాయనగారు ఇందుకు సమ్మతిస్తారా ?"

"చాలా సందేహము"

"అయితే మరి వివాహం ఎలా అవుతుంది?"

నవగోపాలుడు ఇప్పటికీనవ్వి "వివాహము నేను చేసుకొంటాను. మానాయనగారు చెయ్యడం పడదు" అన్నాడు.

"మీనాయనగారికి ఇష్టంలేకపోతే మీరు పెళ్లాడడానికి సాహసిస్తారా?"

గదాధరుడు సాహససంగతి ఎత్తడము చాలా మేలయింది. గోపాలుడు దర్పముతో "ఏది చూచినా నాకుభయము లేదు. మానాయనగారి కోపానికి కూడా వెరవను" అన్నాడు.

గదాధరుడు కొంతశాంతించి యిలాఅన్నాడు "మీమాటలకు చాలాసంతోషించాను. అయితే ఒక్క సంగతి. మీకు చిన్నతనము. సంసార వ్యవహారాలలో అనుభవము చాలాతక్కువ. మీకు ఎంతకోరిక ఉన్నప్పటికీ మీనాయనగారికి ఇష్టములేకపోతే వివాహము కాకుండా ఆపివేస్తారు."

"ఎలాగ?"

"మిమ్మల్ని కదలకుండాచేసి నన్ను వూళ్లో ఉండనియ్యకుండా వెళ్లగొట్టి"

"మీరు వారి జమీలో నివాసముచెయ్యడము లేదు"

"లేదు కాని మీనాయనగారిచేతిక్రింద ఎంతమంది లాటీ వాళ్లు ఉన్నారో తెలుసునా,,

నవగోపాలుడు నవ్వి తెలుసును "లాటీవాళ్లకు అందుబాటులో లేనిచోటికి మనము వెళ్లవలసిఉంటుంది" అన్నాడు.

"అవును ఇంకొకసంగతి మీరు జాగ్రత్తపడవలె. అంతరాయము లేకుండా వివాహముఅయ్యేవరకూ ఈసంగతి ఎవరితోనూ చెప్పగూడదు. ఇదంతా రహస్యముగా ఉంచుతానని వాగ్దానము చెయ్యగలరా?,,

"చెయ్యలేను. నేను ఇవాళేవెళ్ళి ఈసంగతులు మాఅమ్మగారికి చెప్పుతాను" అని గోపాలుడు దృఢముగాపలికినాడు.

గదాధరుడు నిరాశతో "అయితే అంతా చెడిపోతుంది. మీరు గ్రహించకుండా ఉన్నారు" అన్నాడు.

"మీ కావిషయములో విచారమువద్దు. ఆభారమంతానాది. మానాయనగారి అంగీకారము పొందగలిగితినా చాలాసంతోషము. అందుకోసము తప్పకుండా ప్రయత్నము చేస్తాను. ఒకవేళ కృతకృత్యుణ్ణి కాకపోతినా ఆయన అంగీకారము లేకుండానే వివాహము చేసుకోవలసి వుంటుంది. రహస్యముగా ఉంచడముమాత్రము నావల్లకాదు."

నవగోపాలుడి కంఠస్వరము మనస్సులో ఉన్నపట్టుదలను సూచిస్తున్నది. అతని మనస్సు త్రిప్పడము మనతరము

కాదని గదాధరుడు "మంచిది ఈమాట మరిచిపోకండి. ఈవేళే విశాలాక్షికి వెళుతున్నారా?" అన్నాడు.

"ఇవాళే వెళుతాను."

గదాధరుడు నవ్వి "అయితే మిమ్మల్ని రమ భోజనానికి రమ్మందని విన్నాను. ఇవేళ ఊరికి ఎలా వెళుతారు!" అన్నాడు.

"ఆమెతో చెప్పండి—మరోనాడు వస్తానని," అని గోపాలుడు నమస్కారముచేసి వెళుతూ "మీరు ఇంట్లోనే ఉంటారా?" అన్నాడు.

"తరుచుగా ఇంట్లోనే ఉంటూ ఉంటాను."

"మంచిది. అయితే త్వరలోనే వస్తాను" అని గోపాలుడు సెలవుతీసుకొని వెళ్ళినాడు.

గదాధరుడు నెమ్మదిగా అడుగులు వేసుకొంటూ ఇంటికి వెళ్ళినాడు.

౧౨

తండ్రి కోపపడ్డ తర్వాత రమ సంచి చేతపట్టుకొని విచారముతో నెమ్మదిగా ఇంటికి వెళ్ళింది. దొడ్డివాకిట అంగణములో ప్రవేశించి చూచేసరికి వసారాలో కూర్చొని చెల్లెలు రాజలక్ష్మి పిల్లికోకకు ఎర్రనాడా కట్టడానికి ప్రయత్నము చేస్తున్నది. కాని సుఖము లేని ఆపిల్లి వరసబెట్టి తోక ఆడిస్తూ అలంకారాన్ని పెట్టనివ్వలేదు. రమ చూచి చిరునవ్వునవ్వింది. రాజలక్ష్మి దొడ్డివైపు చూచేసరికి రమ కనబడ్డది. అక్క ముఖాన, వెంట్రుకలమీదా ధూళిపడి వున్నది. బట్ట అక్కడక్కడ చినిగింది. ఆమెచేతులో కొత్త సంచి ఉన్నది. దానిమీద నెత్తురుముక్కలు. రమను చూచి రాజలక్ష్మి "ఎక్కడికి వెళ్లావు అక్కయ్యా, చెప్పవూ, బాబు! వచ్చాను. నిన్ను చీవాట్లు పెడతాను" అన్నది

"ఎక్కడికి వెళ్లానో తెలియదూ?" అని రమ సంచి యెత్తి చూపింది.

రాజలక్ష్మి ఆశ్చర్యముతో ఎగరొప్పుతూ "అమ్మో నాకేమి తెచ్చావు అక్కయ్యా?" అని గబగబా మెట్లు దిగి రమ దగ్గిరికి వెళ్లి నిలుచున్నది. రమ సంచి మూతి

జాగ్రత్తగావిప్పి చెల్లెలిని చూడమన్నది. రాజలక్ష్మి చూచి „ఏమిపక్షు?" లన్నది.

„హంసలు."

„ఎన్ని?"

„రెండు."

ఈమాటలు విని, పోట్లు ఆంబోతు వెంట బడితే పరిగెత్తే విధముగా రాజలక్ష్మి వంటయింట్లోకి పరుగెత్తి ఉత్సాహముతో "అక్కయ్య రెండుహంసలు కొట్టి తెచ్చిందరా!" అని యిల్లంతా ఒక గోలికిక్క తెచ్చింది.

ఇంతలో రమ ముందుకు వచ్చి జామ కొమ్మకు సంచి తగిలిస్తున్నది. కేక విని ముసలమ్మ బయటికి వచ్చింది. ఆవిడకళ్ళు వాచినవి. చెక్కిళ్ళమీద కన్నీటిచారలు పడి ఉన్నవి. ఆవిడ రమకేసి చురచురా చూచి, పళ్ళు పటపటా కొరికి కోపముతో వణికిపోతూ "ఎక్కడికి వెళ్ళావు పాడు ముఖముదానా?" అని తిట్టింది.

రమకు బిగ్గరగా మాట్లాడే ఉద్దేశము అపుడు లేదు. ముసలమ్మ ఇష్టము వచ్చినట్లు తిట్టడము మొదలు పెట్టింది. తల్లిపోయినప్పటినుంచీ రమ చేసిన తప్పులన్నీ ఏకరువుపెట్టి ఎత్తిపొడిచింది. ఇంతలో లక్ష్మి వచ్చింది.

రమ అవస్థచూచి లక్ష్మి విచారపడి, ముసలమ్మ చేతులలో నుంచి తప్పింతామనే ఉద్దేశ్యముతో "అమ్మో, పిల్లఎలా

అయిపోయింది! పళ్ళు తుడుస్తాను రా అమ్మా" అని రమను కోనేటిదగ్గిరికి తీసుకుపోతూ తోవలో "ఎక్కడికి వెళ్లావు ?" అని అడిగింది.

"వేటకు"

"ఎవరివెంట"

"ఆపిట్టలాయనవెంట"

"పిట్టలు పట్టేఆయనవెంట ఒంటరిగా వెళ్ళావా? వాడు అడివిలో గొంతుపిసికి నాలుగు తన్ని నగలు ఎత్తుకుపోతే ఏమి చేసేదానవు?"

"అంత చులకగా లేదు!"

రమ నిర్భయానికి లక్ష్మి మనస్సులో సంతోషించింది.

ఇంతలో రమ మంచిబట్టలు కట్టుకొని వచ్చింది. అప్పటికి తండ్రి ఇంటికి రాలేదు. ముసలమ్మకోపము చాలా తగ్గింది. ఆవిడ జపమాలిక తిప్పుతూ వసారాలో కూర్చుని "రాజీ, మీనాయన ఎక్కడికి వెళ్ళాడో చూడు. అక్కయ్యవచ్చింది. పొద్దుగూకులూ పిచ్చికుక్కలాగ ఊరికే అటూ ఇటూ తిరుగుతున్న దని చెప్పు" అన్నది.

కోపముచేత రమ మాటలాడ లేక పోయింది. అంతకు ముందే తండ్రికి తాను కనబడ్డసంగతి బయటపెట్టలేదు. గదాధరుడు చిన్నకూతురివెంట త్వరలోనే ఇంటికివచ్చినాడు. ముసలమ్మ ఆయనను చూచి "ఇదుగో నాయనా, చక్క

దనాలకూతురు ఇంటికి వచ్చింది!" అని ఇంకా అగ్ని వర్షము కురిపించవలెనని ప్రయత్నము చేస్తూ ఉంటే ఆయన సంజ్ఞచేసి ఆమెను శాంతపరిచినాడు. ఆయన ఇంటికి వచ్చాక రమ మీద జడివాన వడగళ్లూ పడతె వసుకొన్న లక్ష్మి ఆయన ప్రఫుల్లమూర్తి చూచి శాంతి చెంది ఆశ్చర్యపడ్డది.

తండ్రి రమ కేసి వాత్సల్యము తో చూస్తూ "నీవు రెండు హంసలు కొట్టి తెచ్చావు కాదా రమా!" అన్నాడు. అనుకొని ఈ ఆదరము చూచి రమ విచార గహ్వారములో నుంచి ఒక్కసారిగా ఉత్సాహముతో కొండెక్కి,

"అవును బాబా, చూపేదా?" అన్నది.

"ఏవి, చూపించు."

రమ పరుగెత్తుకుపోయి, జామ కొమ్మకు తగిలించిన సంచి తెచ్చింది. చూచి తండ్రి సంతోషించాడు. వేట సంగతి యావత్తూ వర్ణించి చెప్పి "బాబా, మీకు హంస మాంసము ఇష్టమేనా?" అని అడిగింది.

"చాలా యిష్టం."

"వీటి మాంసం చాలా మంచిదని పిట్టల బాబు చెప్పినాడు. ఆయన యెప్పుడు వస్తారు?"

"ఇవాళ వెళ్ళారు. మరోనాడు వస్తామన్నారు."

లక్ష్మి నిలుచుని ఆశ్చర్యముతో ఇదంతా వింటూ "పిట్టలు పట్టేవాడు బాబు ఎలాగు అయినాడు?" అన్నది.

గదాధరుడు రహస్యముగా కన్నుగీటి ఊరుకోమని లక్ష్మికి సైగచేసినాడు. ఏదో రహస్యమున్నదని ఆవిడ గ్రహించింది. ఆవిడ ఆశ్చర్యము చాలా హెచ్చింది. అయితే ఆయన అభిప్రాయము కనిపెట్టి, అందులో ఏమి మర్మమున్నా, నష్టమేమీ లేదని గ్రహించింది.

రాత్రి పదిగంట లయింది. పిల్లలంతా నిద్రపోతున్నారు. పిండి ఆరబోసినట్టు వెన్నెల బాగా కాస్తున్నది. గాలి కొట్టక పోవడముచేత ఉడక పోస్తున్నది. వరాండాలో చిరిచాప వేసుకుని గదాధరుడు హుక్కా పీలుస్తున్నాడు. గూట్లో కిరసనాయిలు దీపము వెలుగుతున్నది. కొంత సేపటి కాయన లక్ష్మి అన్నాడు.

"ఏమి బాబూ?"

"భోజన మయిందా?"

"అయింది. ఎందుకు?"

"ఒక్కసారి ఇలా వస్తావా?"

లక్ష్మి వచ్చింది. "కూర్చునే టందుకు ఏమన్నా తెచ్చుకో. చాలా సంగతులు మాట్లాడాలి" అన్నాడు గదాధరుడు.

సంగతు లేమిటో తెలుసుకోవలెనని కుతూహలముతో కూర్చున్నది లక్ష్మి.

"మనము పిట్టలు పట్టేవాడు అనుకొంటున్నామే, ఆయన అడివిమనిషి కాడు."

"అయితే ఎవరు?"

"కాంతిబాబు కొడుకు."

"విశాలాక్షీ జమీందారు కాంతిబాబు కొడుకేనా?"

హరిపదుడు కనబడ్డది మొదలుకొని, నవగోపాలుడితో మాట్లాడడమూ, అతను పెళ్ళి ప్రస్తావన తేవడమూ మొదలైన వన్నీ చెప్పి, ఏమి చెయ్యమంటావన్నాడు. లక్ష్మి కొంచెము విచారముతో నెమ్మదిగా ,,అదే ఆలోచిస్తున్నాను. పిల్లవాడి తల్లిదండ్రులు ఒప్పుకుంటూ రనేది ఉత్తమాట. అయితే పిల్లవాడు స్వతంత్రించి పెళ్ళి చేసుకుంటే ... వయస్సెంత?" అన్నది.

,,ఇరవై ఇరవైయొకటి ఉంటవి."

,,మైనరు వెళ్ళితే ఫరవా లేదనుకుంటాను."

,,అలాగే అనుకుంటాను. అక్కయ్యను పిలు. ఆవిడ ఏమంటుందో."

లక్ష్మి లేచి ముసలమ్మను పిలుచుకు వచ్చిన తర్వాత గదాధరుడు సంగతి యావత్తూ అక్కగారికి తెలియ జెయ్య మని లక్ష్మితో చెప్పినాడు.

లక్ష్మి చాలాకష్టముమీద ఆవిడకు సంగతులన్నీ బోధ పరిచింది. చెప్పిందే ఎన్నోసార్లు చెప్పవలసి వచ్చింది. ఆవిడ

“ఆలాగా! పెళ్ళి కావలె నంటున్నాడా? మన కంత అదృష్టమా! అంత సుఖము రాసిపెట్టి ఉన్నదా!” అన్నది.

ఏమీ తోచక గదాధరుడు “నీఅభిప్రాయ మేమిటి? కుర్రవాడు తల్లిదండ్రుల యిష్టము లేకుండా పెళ్ళిచేసుకొంటా నంటున్నాడు. పిల్ల నివ్వడము ఉచితమేనా?” అన్నాడు.

ముసలమ్మకు ఏమీ తోచిందికాదు. “కుర్రవాడు చేసుకుంటాను అంటున్నా డనుకో. మనము పిల్లనిస్తే అత్తమామలు పిల్లను ఇంటికి రానిస్తారా? కుర్రవాడికి ఇంకో పెళ్ళి చెయ్యరా?” అన్నది.

గదాధరుడు ఆలోచించి “ఈరోజుల్లో మగవాడు రెండో పెళ్ళి చేసుకోడు. ఇతను తల్లిదండ్రులకు ఒకడే కొడుకు. పెళ్ళి అయిన తర్వాత కోడలిని వెళ్ళగొట్టడానికి వీలా?” అన్నాడు.

ముసలమ్మ చాలా తికమక పడ్డది. చిలుములో నిప్పు ఆరిపోవడము చూచి గదాధరుడు “కొంత పొగాకు వేసి గొట్టము తయారు చెయ్యి” అని లక్ష్మితో చెప్పినాడు.

ముసలమ్మ తనలో “అహా, అంత అదృష్టమా మాకు! రమ అంత పుణ్యం చేసుకొన్నదా!” అనుకొన్నది.

# ౧౮

నవగోపాలుడు పక్షులను తేవడానికి కలకత్తా వెళ్ళినప్పుడు ఇంటిదగ్గర అతని పెళ్ళి సంగతులు నడుస్తున్నవి. పడవ నిండా పిట్టలు వేసుకుని కలకత్తానుంచి అతను తిరిగి వచ్చిన మరునాడే కాంతిచంద్రుడు పిల్లను చూడడానికి సూర్యపురము వెళ్ళినాడు. ఆయన యావత్తూ గూఢముగా ఉంచి వెళ్ళడముచేత గోపాలుడికి తండ్రి ప్రయాణము విషయమై సందేహము కలగలేదు. ఆరోజల్లా గోపాలుడు పిట్టలకు ఇల్లు కట్టుతూ ఉండకపోతే ఇంట్లో జరుగుతున్న గుసగుసలు వినేవాడే.

గదాధరుడితో మాట్లాడిన తర్వాత గోపాలుడు రేవుకు వచ్చి పడవ యెక్కినాడు. సూర్యుడు అస్తమించ బోతున్నాడు. పియాకీ నది జలము సూర్యకాంతిలో మిలమిలలాడుతున్నది. గోపాలుడు గొడుగుకింద పరుపు వేసుకొని రెండువైపుల కిటికీలూ తెరిచినాడు. పడుకొని నీటికేసీ చెట్లకేసీ చూస్తూ ఏమో ఆలోచిస్తున్నాడు. ఒడ్డున ఉన్న చెట్లు సూర్యకాంతి శిరస్సున ధరించి పరుగెత్తుకు పోతున్నవి. ఏవైపు? రమాదేవివైపు!

అతని మనస్సు చాలా చంచలముగా ఉన్నది. నవలలలో వర్ణించే ప్రేమలో మునిగి తేలుతున్నాడేమో. రమాదేవి రూపము మాటిమాటికీ అతని మనస్సులో ప్రతిబింబిస్తున్నది అందుకేమీ సందేహము లేదు. రమాసుందరి నడవడిలో మాధుర్యము, ఆమె నిర్భీతి సారల్యములూ అతని మనస్సును హరిస్తున్నవి. ప్రత్యేక లేంటువంటి, అపరిచితమైనటువంటి, ఆకర్షణ పిన్నవయస్సులో ఉన్న వాళ్ళకు ప్రబలముగా ఉంటుంది. గోపాలుడి మనస్సు ఇప్పుడా ఆకర్షణకు వశమయింది. ప్రేమ విషయమై ప్రథమ దర్శనవాదము నమ్మేవారు ప్రథమదర్శనములో ఉండే ఆకర్షణను ప్రేమ అని పొరపాటు పడుతున్నారు. ఒకరి మనస్సు రెండవవారు గ్రహించిన కొద్దీ ప్రేమకు వికాసము ఉంటుంది.

అతని పడవ గ్రామము సమీపించింది. తుపాకులు మొదలైనవి తీసుకొని ముందు వెళ్ళమని సేవకులతో చెప్పి గోపాలుడు స్నానముచేసినాడు

అతను ఇంటికి వచ్చేసరికి చీకటి పడ్డది. వాకిలిదగ్గర జమాదారు వరుణచౌబే అతనికి సలాంచేసి చిరునవ్వుతో "దాదా బాబూకే షాదీమే హంకో దోషాక్ బక్షీష్ మిలానా చాహియే" అన్నాడు.

గోపాలుడు చిరునవ్వు నవ్వి వెళ్ళినాడు, కాని చాలా ఆశ్చర్యపడ్డాడు. ఇంట్లోవాళ్ళకు రమ సంగతి ఎలా తెలిసింది?

తాను గదాధరుడితో మాట్లాడుతున్నప్పుడు పడవవాళ్ళు గాని సిపాయీలుగాని చాటున ఉండి వినలేదుగద! —

ఎలాగో గోపాలుడు తనగదిలోకి వెళ్ళినాడు. లోపల చీకటిగా ఉన్నది. అవ్వ వచ్చి దీపము వెలిగించి వెళ్ళింది. ఇంతలోకే అతని తల్లి వచ్చింది. ఆమె ముఖాన చిరునవ్వు తాండవమాడుతుంది. "పగలంతా నీవు ఎక్కడున్నావు?" అన్నది.

"వేటకు వెళ్ళానమ్మా."

"పిచ్చిపిల్లవాడా! ఇంత ఆలస్యం ఎందుకు చేశావు? నీకోసం రోజల్లా వెతికాను" అని చిరునవ్వుతో అని, చీరకొంగు ఆడించింది. అతని దృష్టి దానిమీదికి వెళ్ళింది. చీరె చెరుగు చాటున ఏదో ఉన్నది. తల్లి ప్రశ్నను గోపాలుడు "ఎందుకమ్మా?" అన్నాడు.

"నీ కోవస్తువు చూపింతామని."

"ఏమిటది?"

"ఈవాళ వారు సూర్యపురమునుంచి వచ్చారు. ఒకటి చూపించమన్నావా?"

"ఏమిటి, సంగతేమిటి?"

తల్లి ఒకసారి కొడుకు ముఖముకేసి చూచి ఇంకోసారి చీరె చెరుగుకేసి చూచి నెమ్మదిగా ఆవస్తువు బయటికి తీసింది. సన్నటి కాకితములో చుట్టిన చిన్నఫొటో. అది

బయటికి తీసేటప్పటికి కాకితము పెళపెళలాడింది. బొమ్మను దీపము వెలుతురుకు ఎదురుగా పట్టుకొని ఆనందిస్తూ చూడు అన్నది.

గోపాలుడు దగ్గరకు వెళ్ళి బొమ్మ బాగా చూచి తల్లి చేతులోనుంచి తీసుకోబోయి ఎవరి దన్నాడు.

ఆమె బొమ్మ దాచిపెట్టి "ఇవ్వ డివ్వను. పిల్ల ఎలాగున్నదో ముందు చెప్పు" అన్నది.

"ఆ. బాగానే ఉంది. ఎవరు?" అన్నాడు గోపాలుడు.

"ఎవ రైతే నేమి? వెళ్ళి చేసుకొంటావా?" అన్నది తల్లి.

గోపాలుడు ఆశ్చర్యముతో తల్లికేసి చూచినాడు.

ఆవిడ నవ్వుతూ "పెళ్ళాడుతావా? చెప్పుమరి" అన్నది.

"ఇంతదేశం ఉండగా ఎందుకు పెళ్ళాడను?" అన్నాడు కొడుకు.

అప్పుడు తల్లి యావత్తు సంగతులూ వివరించింది.

యజమాని పిల్లను చూచి ఆవేళనే వచ్చినాడట. పిల్ల చాలా చక్కని దట. పేరు సుశీల. చూచేసరికి యజమానికి బాగా నచ్చిందట. పెళ్ళి నిశ్చయము.

ఈమాటలు వినేటప్పటికి నవగోపాలుడు పొంగిపోయి సంతోషము అణుచుకోడానికి వృథాప్రయత్నము చేస్తాడని తల్లి అనుకొన్నది. కాని అతని కళ్ళలో నిరుత్సాహము

కనబడడముచేత తల్లి ఆశ్చర్యపడ్డది. ఆమె ఉత్సాహమూ
చిరునవ్వూ వెంటనే అదృశ్య మయినవి.
"ఎందు కిలా ఉన్నావు?" అన్నది.
"ఈపిల్లను పెళ్లాడ నమ్మా" అన్నాడు కొడుకు.
తల్లి మరింత ఆశ్చర్యపడి "ఏమిరా, ఏమిటి! పిల్ల బాగా
లేదా?" అని అడిగింది.

గోపాలుడు తన సంగతి మొదటినుంచి చివరవరకూ విప్పి
చెప్పినాడు. మొదటి రోజున పిట్ట ఎగిరిపోవడము, వేటకు
వెళ్ళడము, గదాధరుడితో మాట్లాడడము, వివాహ
ప్రస్తావన, ఆపిల్లనే పెళ్ళాడవలెనని ప్రతిజ్ఞ మొదలైనవి
తెలిపినాడు.

తల్లి విని అట్టె ఊరుకొన్నది. గోపాలుడు నిశ్శబ్దముగా
కూర్చున్నాడు. తల్లి కొంతసేపటికి "ఛీ, వద్దు నాయనా.
ఈవెర్రి అంతా విడిచిపెట్టు. నీవు పెద్ద జమీందారు బిడ్డవు.
మామూలు గుమాస్తా కూతురిని పెళ్ళాడుతావా? వింటే
లోకము ఏమంటుంది?" అన్నది.
కుమారు డేమీ మాట్లాడలేదు.
తల్లి ఎన్నివిధాల బోధించినా ఏమీ లాభము లేక
పోయింది. పైగా అతని విచారము హెచ్చింది. ఆమె
జాలిపడి మరునాడు యజమానితో చెప్పి ఏదో తేలుస్తానని
వాగ్దానము చేసింది.

# ౧౯

కమలాదేవికి రమారమి యిరవైయేళ్ళ కుమారుడున్నప్పటికీ ఆమెకు ఎక్కువ వయస్సు లేదు. కాంతిచంద్రునికి ఆమె రెండో సంబంధము భార్య. చిన్నతనములో ఆమె పలకా పుస్తకాలూ పట్టుకొని పాఠశాలకు అందరిలాగా వెళ్ళేది. పెళ్ళి అయిన తర్వాత ఆవిడ పుట్టింటినుంచి భర్తకు రాసిన ఉత్తరాలు ఈకాలపు పద్ధతిని కాకపోయినా ఒకవిధముగా వింతగానే ఉంటవి. శిశుబోధ పుస్తకములో శ్రీమతి మాలతీ మంజరీదేవి ప్రవాసములో ఉన్న తనభర్త శ్రీయుత మధ్యసు భట్టాచార్య మహాశయునికి రాసిన ఉత్తరాలతో ఈమె ఉత్తరాలకు సాదృశ్యము లేదు.

కమలాదేవి హృదయము చాలా కోమలము. ఆమెకు పుత్రవాత్సల్యము చాలా హెచ్చు. ఆనాటి సాయంకాలము నవగోపాలుడి గదిలోనుంచి వచ్చింది మొదలు ఆమె ఈవివాహము సంగతే ఆలోచిస్తున్నది. వాడిపోయిన కొడుకు ముఖము జ్ఞప్తికి వచ్చినప్పుడల్లా ఆమె మనస్సు విచారములో కరిగి పోతున్నది.

నవలలలో నిష్ఫల ప్రేమను గురించిన కథలు ఆమె చాలా చదివింది. అవి జ్ఞప్తికి వచ్చి ఆమె కుమారుడి ముఖము

కోసము వ్యాకుల పడుతున్నది. సూర్యపురము జమీందారు పిల్లను పెండ్లి చేసుకొంటే ఆస్తి హెచ్చుతుందని ఆమెకు తెలుసును. అయితే దైవానుగ్రహమువల్ల గోపాలుడికి సంపదలో ఏమీ లోపము లేదు. స్వయముగా వరించి ఆమెకోసము తను ఇంత పట్టుదలతో ఉన్న పిల్ల లభ్యమై అతను ఎందుకు సుఖపడ కూడదు? ఆమె బీదవాళ్ళ పిల్ల అయినప్పటికీ ఏమినష్టము? ఆమెకు చదువు సంధ్యలు సరిగా లేక పోయినప్పటికీ అతను నేర్పవచ్చు. పుట్టింటిలో ఎక్కువ కాలము ఉండ నియ్య నక్కరలేదు. అన్నీ సరిగా ఏర్పాటు చెయ్యవచ్చు.

అయితే ముఖ్యమైన విచారమేమి టంటే, యజమాని అంగీకారము పొందడము ఎలాగు? భర్త స్వభావము ఆమెకు బాగా తెలుసు. సూర్యపురము జమీందారు ఆస్తి స్వాధీనము చేసుకోడానికి ఆయన ఆదుర్దాతో ఉన్నాడని తెలుసు. ఆస్తిమీద ఆయన కున్న ఆసక్తి విదితమే. అయినప్పటికీ ఆమెకు కొంచెము ఆశ కలిగింది. చెప్పి చూస్తే లాభము లేకపోతుందా? వ్యవహారములో ఎంత గట్టి పట్టువాడయినా ఆయనకు కొడుకు మీద చాలా వాత్సల్యము. అంతే గాక భార్యను లాలించడానికి ఆయన ప్రయత్నిస్తూ ఉంటాడు. అందుచేత ఆమెకు ధైర్యము కలిగింది. ఈపని సఫలము కావలెనంటే చాలా జాగ్రత్తగా

ప్రవర్తించవలె. ఆయన మనస్సు ఆకర్షించి, సమయము కనిపెట్టి నేర్పుతో మాటాడవలె. తొందరకూడదు. సమయము కనిపెట్టడము ముఖ్యము అనుకొన్నది.

ఈవిధముగా ఆలోచించడములో వారము గడిచింది. ఈలోగా కమలాదేవి ఈసంగతి భర్తదగ్గర ప్రస్తావించడానికే అవకాశము కలగలేదు. చివరకు ఏడోనాడు సాయంకాలము అవకాశము దొరికింది.

సూర్యాస్తమానము అయిన కొద్దిసేపటికి కమలాదేవి గదిలో తెరిచిన కిటికీ వద్ద సోఫాలో కూచుని కొత్తమాస పత్రిక చదువుతున్నది. వంగదేశములో అంతఃపుర స్త్రీలు పత్రికలలో కథలు నవలలు మాత్రము చదువుతారు; పత్రికలో కాకితాలు అన్నీ కోయ్యరు. కథలు ఉన్న కాకితాలు తప్ప తక్కినవి చింపరు అనే సంగతి చాలామంది గమనించి ఉంటారు. కమలాదేవి కథ చదువుతూ ఉన్నది. అదృష్టవంతుడైన గ్రంథకర్త ఈమె కుతూహలము ప్రకోపింపజెయ్యగలిగినాడని తెలుస్తున్నది. వెలుతురు తగ్గేసరికి ఆమె లేచి కిటికీదగ్గర నిలుచుని చదువుతున్నది. ఇంతలో పనికత్తె వచ్చి దీపము పెట్టి పోయింది. కమలాదేవి మళ్ళీ సోఫాలో కూర్చుని కథ ముగించి నిట్టూర్పు విడిచి శూన్యదృష్టితో ముందుకు చూచేసరికి కాంతిచంద్రుడు ఆమె ఎదుట నిలుచుని ఉన్నాడు.

భర్త ముఖము వికాసముగా ఉండడము చూచింది. కొన్నాళ్ళనుంచీ తమపొరుగు జమీందారుతో ఒక తాలూకా సరిహద్దు విషయమై హైకోర్టులో దావా జరుగుతూ ఉన్నదని కమలా దేవికి తెలుసును.

"ఏమండీ, ఇవాళ ఇంత ఖులాసాగా ఉన్నారు? ఏమైనా మంచి గబురు విన్నారా యేమి?" అన్నది కమలా దేవి.

"ఇవాళ ఉదయం కలకత్తా నుంచి వకీలు టెలిగ్రాం ఇచ్చారు. ఆ అప్పీలులో మనము గెలిచాము."

గృహిణి విని సంతోషము వెలిబుచ్చింది. కాంతిచంద్రుడు ఆదావాకు సంబంధించిన కొన్ని విషయాలు భార్యకు చెప్పినాడు. అయితే విన్న ఆమె అవన్నీ ఎంతదూరము అనుసరించ గలిగిందో సరిగా తెలియదు.

కమలా దేవి మాసపత్రిక మూసి చేత్తో పట్టుకొన్నది. భర్త అటు చూచి "ఏమిటి చదువు తున్నావు?" అన్నాడు.

"'అతనర మోదిని' అనే కథాభాగము. కథ చాలా చమత్కారంగా ఉంది."

కాంతిచంద్రుడి మనస్సు ఈవేళ విశ్రాంతిగా ఉండడము చేత "ఏమిటి సంగతి?" అన్నాడు.

గృహిణి "చదివి వినిపించనా?" అని ఉత్సాహముతో అన్నది.

కాంతిచంద్రుడి ముఖాన భయలక్షణాలు స్పష్టముగా కనబడ్డవి ఆయన "వద్దు వద్దు ఆగు. జరిగిన కాండ సంక్షేప ముగా నీనోట చెప్పు" అన్నాడు.

ఆవిడ సంక్షేపముగా మొదలు పెట్టింది. రాణా కూతురు చక్కనిది. ఆమెను రాజపుత్రుడొకడు ప్రేమించినాడు.

"అతను తప్పకుండా బీదవాడు కాదూ ?"

"అవును. అతను సిపాయి. బీదవాడేకాని చాలా వీరుడు."

కాంతిచంద్రుడు గూఢముగా మందహాసము చేసినాడు.

గృహిణి మళ్ళా ఇలా చెప్పింది.

"రాజపుత్రుని పేరు దుర్జయసింగు."

"దుర్జనసింగా !"

"కాదు. దుర్జయసింగు. కన్యపేరు కరుణావతి."

"ఆహా" అని కాంతిచంద్రుడు నెమ్మదిగా అన్నాడు.

"ఇద్దరికీ ప్రథమ సందర్శన మయింది."

"దేవాలయంలో నేనా ?"

కమలాదేవి ఆశ్చర్యపడి "అవును. మీకెలా తెలిసింది? చదివారా యేమిటి ?" అన్నది.

ఆయన చిరునవ్వుతో "చదవలేదు. బంకింబాబు దుర్గేశ నందిని రాసినతర్వాత ఎప్పుడూ ఇలాగే జరుగుతున్నవి" అన్నాడు.

"దేవీమందిరములో ప్రథమ సందర్శనం అయింది. మరొక సారి కూడాను. దుర్జయసింగు చాలా బీదవాడని రాణాలో ప్రస్తావించడానికి సాహసించలేదు. బాగా పరాక్రమము చూపించి సైన్యములో పెద్ద ఉద్యోగము వచ్చిన తర్వాత ప్రస్తావన చేతా మనుకొన్నారు. పఠానులు రాజ్యమాక్రమించడానికి వచ్చారని ఇంతలోకే కబురు తెలిసింది."

"చెప్పవూ!"

"పెద్ద యుద్ధమయింది. సేనాపతి చనిపోయినాడు. దుర్జయసింహ పరాక్రమం చూసి అందరూ అతన్ని సేనాపతిగా వెంటనే ఎన్నుకొన్నారు. పఠానులు ఓడి పారిపోయినారు. దుర్జయసింహు సంగతి తెలియలేదు. శత్రువు లతన్ని ఖైదుచేసి నరికివేశారని వదంతి పుట్టింది. అది విని రాజకన్య విషం తాగింది."

"కొంప మునిగింది!"

"అసలు సంగతి ఏమిటంటే, దుర్జయసింగును వాళ్ళు చంపలేదు, శ్మశానము దగ్గర వాళ్ళచేతులలో నుంచి తప్పించుకుని శత్రుసేనాపతి గుర్రంమీద తానెక్కి పారిపోయి వచ్చినాడు యుద్ధములో జయించినందుకు రాణా తనకు బహుమానము ఇవ్వగోరితే కరుణావతిని తన కిచ్చి వివాహము చెయ్యండని వేడుదా మనుకున్నాడు. వచ్చి చూసేసరికి రాజకన్య చితి భగభగా మండుతున్నది."

కాంతిచంద్రుడు నవ్వు ఆపుకొని "చాలా శోచనీయము!" అన్నాడు.

"శోచనీయం కాదా! కరుణావతిని అతను చూడడం పడనే లేదు."

ఇంతలో పరిచారిక వచ్చి భోజనము సిద్ధముగా ఉన్న దని చెప్పింది. కమలాదేవి భర్తతో భోజనశాలలోకి వెళ్ళింది.

ఆయన భోజనము చేస్తూ ఉంటే ఆమె భర్త దగ్గరగా పీట వేసుకొని కూర్చొని కబుర్లు చెప్పుతూ ఆయన మనస్సు రంజింప జేస్తున్న

నవగోపాలుడు ఇంట్లో ఉన్నప్పుడు సాయంకాలము తండ్రితో పంక్తిని భోజనము చేసేవాడు. ఆపూట అతను కనబడక పోవడముచేత "నబూ ఎక్కడ?" అని కాంతిచంద్రు డన్నాడు.

భార్య కొంచెము విచారముతో "ఇవాళ పడవమీద షికారు వెళ్ళారు. ఇంకా రాలేదు" అన్నది.

భోజన మయిన తర్వాత కాంతిచంద్రుడు "నీవు భోజనం చేసిరా. నేను మేడ మీదికి వెళుతున్నాను" అన్నాడు.

"పదండి. నేను తమలపాకులు తెస్తున్నాను. గోపాలం వచ్చిందాకా మీతో మాటాడుతూ ఉంటాను."

ఆసాయంకాలము చాలా ఉక్కపోస్తూ ఉన్నది. కాంతి బాబు ఆజ్ఞానుసారముగా సేవకులు డాబామీద పక్క వేసి నారు. ఆయన హుక్కా పీలుస్తున్నాడు.

ఇంతలో బంగారపు పళ్ళెములో సుగంధ తాంబూలము పెట్టుకొని కమలాదేవి డాబామీదికి వచ్చి భర్త పక్కన కూర్చున్నది.

అప్పుడే చంద్రోదయము అవుతున్నది. కాంతిచంద్రుడి హుక్కా గొట్టము మీది తడి మల్లెపూల దండ డాబా అంతటా పరిమళము వెదజల్లుతున్నది.

"నబూ వచ్చాడా?" అన్నాడు కాంతిచంద్రుడు.

"ఎందుకు? రాలేదు ఇంకా."

"ఎప్పుడు వెళ్ళాడు?"

"పన్నెండు ఒంటిగంటల ప్రాంతాన."

"రోజంతా షికారుచేస్తాడా?"

"కొన్నాళ్ళనుంచీ. కురివాడిమనస్సు బాగాలేదు. అందుకే ఇంట్లో ఉండడం లేదనుకొంటాను. ఇలాకాలం గడుపుతున్నాడు."

"ఏమి, ఏమి జరిగింది?" అని కాంతిచంద్రుడు అనురాగ సూచకముగా అన్నాడు.

గృహిణి యీప్రశ్నకు వెంటనే సమాధానము చెప్పక

"సూర్యపురమువారి సంబంధం నిర్ణయ మయినట్టేనా?" అన్నది.

"అయినట్టే. ఎందుకు?"

"కుర్రివాణ్ణి అడగకుండా నిర్ధారణ చెయ్యవద్దు."

కాంతిచంద్రుడు నవ్వి "కుర్రివాడి కేమి తెలుసు? ఇటువంటి విషయాలలో ఇరవై యేళ్ళ కుర్రవాడి యిష్టానిష్టాలకు ఏమి విలవ ఉంటుంది?" అన్నాడు.

"ఒకవేళ వాడు పెళ్ళి చేసుకోనంటే?"

"చేసుకోనంటే—చేసుకోక తప్పదు. వాడి మంచికోసం మనము బాగా ఆలోచించి ఏది బందోబస్తు చేస్తామో అది ఒప్పుకోక తప్పదు."

"కాని, ఈరోజుల్లో కుర్రివాళ్ళకు వివాహవిషయంలో కొంత స్వతంత్రి అభిప్రాయం ఉంటుందని తెలునునా? ఈరోజుల్లో పిల్లవాళ్ళతో ముందుగా చెప్పడం ఆచార మయింది."

కాంతిచంద్రుడు తిరస్కారసూచకముగా నవ్వి "ఆఆచారం ఉన్నవాళ్ళను అలాగే చెయ్యనీ. మన వంశాను క్రమంగా ఏది వస్తుందో అదే జరుగుతుంది" అన్నాడు.

గృహిణి నిశ్శబ్దముగా ఆలోచిస్తున్నది. యజమాని పైకి చూస్తూ పొగ విడుస్తున్నాడు. తర్వాత కమలాదేవి ఇలా అన్నది: "అలా చెయ్యదలచుకుంటే వంశానుక్రమంగా వచ్చే పద్ధతులే నేర్పి ఉండవలసింది. అందుకు వ్యతిరేకంగా

ఎందుకు చేశారు? ఈకాలపు పిల్లవాళ్లను కలకత్తా పంపి ఇంగ్లీషు మాష్టర్ల అజమాయిషీ కింద ఉంచడమెందుకు? ఏవిధమైన ఏర్పాటు చేస్తే ఆవిధంగా జరగక తప్పదు.”

కాంతిచంద్రుడు హుక్కాగొట్టము కిందికి దింపి, దిండు ఒక పక్కకు నెట్టి, నిటారుగా కూర్చొని “ఇంగ్లీషు చదువుకుంటే అందరూ దొరలయిపోయి దొరసానులను పెళ్ళాడరు. చూసుకో, నవగోపాలుడు ఏమీ అడ్డం చెప్పడు” అన్నాడు.

గృహిణి యింతసేపూ జాగ్రత్తగా సంగర్భము తీసుకువస్తున్నదనీ, లోపల ఆందోళన పడుతున్నదనీ ఆయనకు సందేహము కలగలేదు. నవగోపాలుడి ఉద్దేశము తెలుసుకొనడము మాత్రము ఆమె అభిప్రాయ మనుకొన్నాడు.

ఈసారి అసలు సంగతి యెత్తడానికి అవకాశము కలిగిందనీ, సంగతి యావత్తూ చెప్పడమూ కొంతవరకు చెప్పడమూ అనీ తర్కవితర్కాలు చేస్తున్నది కమలాదేవి. భర్తధోరణి చూస్తే అంతా విప్పి చెప్పడము తెలివైనపని కాదనుకొన్నది. నవగోపాలుడు సూర్యపురమువారి పిల్లను పెళ్ళాడడానికి విముఖుడనే సంగతి బయట పెట్టక తప్పదు.

కాబట్టి ఆమె “మీరానాడు సూర్యపురం వెళ్ళి వచ్చిన తర్వాత పిల్ల ఫోటో వాడికి చూపించాను. సంగతులన్నీ విని, ఇప్పుడు పెళ్ళి చేసుకోనన్నాడు” అని చెప్పింది.

కాంతిచంద్రుడు చాలా ఆశ్చర్యపడి "పెళ్ళి చేసుకో నన్నాడా!" అన్నాడు.

"అనే అన్నాడు."

"ఎందుచేత?"

తల్లికి చాలాచిక్కు వచ్చింది. ఏమి చెప్పవలె? "అంతకంటె చక్కనిపిల్ల కావలె నన్నాడు" అని చెప్పింది.

అంతకంటె చక్కనిపిల్ల యెవరు, ఎక్కడ ఉన్నది అని యజమాని అడిగితే చాలా చిక్కు వస్తుంది. సంగతి యావత్తూ బయట పెట్టవలసి వస్తుంది అని కమలాదేవి భావించింది. కాని కాంతిచంద్రుడికి అటువంటి ఊహ కలగలేదు. పిల్ల నచ్చక పోవడముచేత అతను అలా అన్నాడని తలపోసి కాంతిచంద్రుడు "ఏమి లాభము? పెళ్ళి చేసుకోక తప్పదు" అన్నాడు.

"చూడండి, గోపాలుడికి ఏమీ యిష్టం లేదు. బలవంతాన పెళ్ళి చేస్తే ప్రయోజనం లేదు. శుభకార్యం చేసేటప్పుడు బలవంతం పనికి రాదు. పెళ్లి సంగతి విన్నప్పటి నుంచీ గోపాలుడు ముఖం వేలవేసి తిరుగుతున్నాడు. మీకు తెలియ పరచమని నాతో అన్నాడు. విన్నదగ్గరనుంచీ వాడికి మనశ్శాంతి లేదు. ఇంట్లో ఉండడు. నది మీద తిరుగుతాడు. వాడి ముఖంచూస్తే నాకు గుండె నబుక్కు మంటుంది."

ఆకాశాన చంద్రుడు కొన్నిబారలు ఎక్కుతున్నాడు. వెన్నెల బాగా కాస్తున్నది. వాకిట్లకు కట్టిన పూలదండ కాంతిచంద్రుని అంతరంగములోకి పరిమళము వ్యాపింప చేసి ఆయన మనస్సు కరిగించడానికి ప్రయత్నిస్తున్నది.

" కాదు కాదు. అదేదీకాదు. నీకుకూడా వెర్రి యెత్తిందా యేమి ? నీవు వాడి దగ్గర నోరు విప్పవద్దు. వాడి కుర్రతనానికి అవకాశం ఇచ్చేవు ! భద్రం ! రేపు వాణ్ణి పిలిచి మాటాడుతాను " అన్నాడు కాంతిచంద్రుడు.

భర్త మనస్సు తిప్పుదామనే ఆశ వృథా ఆశఅని గృహిణికి స్పష్ట మయింది.

# ౨౦

రాత్రి పదిగంటలకు నవగోపాలుడు ఇంటికి వచ్చినాడు. తల్లి వెళ్ళి దగ్గరుండి భోజనము చేయించి తన గదిలోకి తీసుకు వెళ్ళింది. రాత్రి చాలా పొద్దు పోయేదాకా నది మీద ఉన్నందుకు వాత్సల్యపూర్వకముగా మందలించి "నేను ఒకమాట చెప్తాను, వినాలి" అన్నది.

తల్లి చెప్పబోయే సంగతి గ్రహించి "ఏమిటమ్మా?" అన్నాడు కొడుకు.

"మహేశపురం పిల్లను పెళ్ళాడుదా మనుకొన్న సంకల్పం విడిచి పెట్టాలి."

"ఎందుచేత? నాన్నగారితో మాట్లాడావా?"

"ఆ. ఈసంగతి ఆయనతో చెప్పలేదు. సూర్యపురంవారి పిల్ల నీకిష్టం లేదన్నాను. ఆయన కెన్నివిధాలనో చెప్పి చూచాను. ఏమీ లాభించలేదు. నీవు చిన్నవాడవు. నీకు బాగా గ్రాహికం రాలేదు. మీనాయనగారు చెప్పినట్టు చెయ్యి. అందువల్ల లాభం. అందరికీ శుభం. నాబంగారు తండ్రివి! మరో మొస్తరు చెయ్యకు!"

తల్లి ఆదుర్దాతో చెప్పిన మాటలువిని గోపాలుడు మనస్సులో చాలా వ్యధపడి కొంచెము సేపు ఊరుకొని "నీవు చెప్పిం

దమ్మా, ఎంతమాత్రమూ సాధ్యంకాదు. నేను చేస్తానని వాగ్దానం చేసినపని ఎలా భంగం చేస్తాను?" అన్నాడు.

"మంచీ బిడ్డా ఆలోచించకుండా ఎందుకు వాగ్దానం చేశావు బాబూ?"

కొడుకేమీ మాట్లాడలేదు. తల్లి యిలా అన్నది: "మీ నాయనగారితో ఇంకా అన్నీ చెప్పలేదు. అన్నీ వింటే కోపం వచ్చి ఆయన యేమి చేస్తారో. నీవాపిల్ల తండ్రికి వాగ్దానం చేశావు. నెరవేర్చక పోయినా లోపం లేకుండా ఉండేలాగు ఏర్పాటు చేస్తాను. వాళ్ళు చాలా బీదవాళ్ళు, పిల్లకు పెళ్ళి కాదని చెప్పావు. నేను వాళ్ళకు ఎంతడబ్బు కావలిస్తే అంత యిస్తాను. ఆడబ్బుపెట్టి వాళ్ళు పిల్లకు పెళ్ళి చేసుకోవచ్చు."

తల్లి కనుకొలుకులలో అశ్రుబిందువులు చూచి గోపాలుడు విచారపడి "సరేఅమ్మా, ఈసంగతి ఆలోచించి చూస్తాను" అని చెప్పినాడు.

విని కమలాదేవి కొంతస్వస్థచిత్తముతో "ఆపిల్ల పేరేమిటి?" అని అడిగింది.

"రమాసుందరి."

"ఎలా ఉంటుంది?"

"చాలా బాగుంటుంది."

"ఏపాటి వయస్సు?"

“ వద్దానులుగు.”

“ పిల్లకు తల్లి లేదన్నావు కాదూ ?”

“ పసితనంలోనే తల్లి పోయింది.”

విని కమలాదేవి మనస్సు కరిగిపోయింది. పాపము తల్లిలేదు! వివాహమయితే తానే తల్లివలె చూడవచ్చు. తల్లిలేని ఆచక్కనిపిల్ల తనకుమారుడి మనస్సు ఆకర్షించిందనీ, తనకు కోడలయితే రొమ్ముకు హత్తుకొందుననీ కమలాదేవి అనుకొన్నది.

ఆమె ఈమాటలు పైకి అనక పోయినా ముఖవైఖరిని బట్టి గోపాలుడు తల్లి భావాలు గ్రహించినాడు. కమలాదేవి భోజనానికి కూర్చున్నది. గోపాలుడు తన గదిలోకి వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు మంచముమీద పడుకోలేదు.

గోపాలుడి బోటు మహేశపురము రేవుకు మూడుసార్లు వెళ్లి వచ్చింది. రెండుసార్లు అతను రమను వెంటబెట్టుకొని షికారు వెళ్ళినాడు. అతను పిట్టలు పట్టేవాడు కాడనీ, సంపన్న గృహస్థు కుమారుడనీ రమకు ఇప్పటికి తెలిసింది. అంతకంటె ఎక్కువ తెలియదు.

ఆమె కిశోర హృదయము గ్రహించినకొద్దీ గోపాలుడు ముగ్ధుడయినాడు. రమాసుందరిని ఇచ్చి వివాహము చెయ్యమని అతను గదాధరుణ్ణి ప్రార్థించి పడవ దగ్గిరికితిరిగి వచ్చినాడు. అతని హృదయములో ఆకర్షణ ఉన్నది, కాని ప్రేమలేదు.

నేను ఆమాట అనడానికి వీలులేదు. వారము రోజులయ్యే టప్పటికి ఆ ప్రేమ గభీరమయి పోయింది.

రాత్రి పన్నెండు గంటలకు గోపాలుడు పడుకొన్నాడు. చాలా సేపటిదాకా అతనికి నిద్రపట్టలేదు. అటూ ఇటూ దొర్లుతున్నాడు. అతని మనసులో ఉన్న ఆశ లేశదయినప్పటికీ దాని ప్రభావము హెచ్చుగా ఉన్నది. తాను ఆలోచించి చూస్తానని తల్లితో అన్నాడు, అయితే మనఃపూర్వకముగా అన్నాడా? తాత్కాలికముగా తల్లికి ఉత్సాహము పురికొల్పడానికి అన్నాడా? తాను రమను విడిచిపెట్టగలడా?

మరునాటి ఉదయము లేచి గోపాలుడు మంచిబట్టలు కట్టుకునేసరికి సేవకులు వచ్చి యజమాని రమ్మంటున్నారని విన్నవించారు. త్వరలో గోపాలుడు తండ్రిదగ్గిరికి వెళ్లినాడు. కాంతిచంద్రుడు బైఠక్ ఖానాలో కూర్చుని ఏవో కాకితాలు చూచుకొంటున్నాడు. అక్కడ మరెవరూ లేరు. కొడుకును చూచి తండ్రి దగ్గిరికి వచ్చి కూర్చోమని సంజ్ఞ చేసినాడు. కుమారుడు కూర్చున్న తర్వాత కాంతిబాబు అతని ముఖము కేసి చూచినాడు. గోపాలుడి ముఖము చింతాక్రాంత మయింది; కళ్ళలో కాంతిలేదు.

"రాత్రి ఎన్నింటికి వచ్చావు?"

"పదింటికి."

"అంతపొద్దు పోయేదాకా నదిమీద ఉన్నావెందుకు? ఏదైనా అపాయంవస్తే?"

గోపాలుడు మాటాడలేదు. అది పీఠిక అనీ, అసలు సంగతి ఇక ప్రారంభిస్తాడనీ గ్రహించి ఆదుర్దాతో ఎదురు చూస్తున్నాడు.

కొంచెము సేపు ఆగి కాంతిబాబు "నబూ, నీతో ఒకటి చెప్పవలె. అందుకే నిన్ను పిలిపించాను. నేను సూర్యపురం వెళ్ళి వచ్చాను—నీవివాహం కోసం. పిల్లను చూడడానికి. జమీందారు హరిహరబాబుకు చక్కని కూతురున్నది. నాకళ్ళకు చాలాబాగాఉంది. ఈఆషాఢమాసంలో వివాహం చేతామని అభిలాష" అన్నాడు.

మొదట గోపాలుడు ఏమీ మాటాడలేదు. తన మౌనము అంగీకారముగా తండ్రి ఎంచుకొంటాడేమో అని "క్షమించండి. సూర్యపురంవారి పిల్ల నాకక్కరలేదు" అన్నాడు.

ఈప్రత్యుత్తరము వస్తుందని సిద్ధముగానే ఉన్నతండ్రి గాంభీర్యము వహించి "ఏమి, సూర్యపురంవారి పిల్ల సొగసుగా లేదా? అమ్మ నీకు ఆపిల్లఫోటో చూపించిందని విన్నాను. బొమ్మకంటె పిల్ల ఇంకా అందంగా ఉంటుంది. స్వయంగా నీవుచూచివచ్చి వివాహం చేసుకొందా మనుకుంటే మంచిదే. వెళ్ళి చూచి రావచ్చు" అన్నాడు.

గోపాలుడు శాంతముగా "ఆపిల్ల వద్దనడానికి వేరేకారణ ముంది" అన్నాడు.

"ఏమిటా కారణం?"

"నేను మరోపిల్లను పెళ్ళాడుదామను కొంటున్నాను."

కాంతిచంద్రుడు ఈమాటలకు ఆశ్చర్యపడ్డాడు. ఆయన దీనికి సంసిద్ధముగా ఉండకపోవడముచేత "ఎవరిపిల్ల? ఎక్కడిపిల్ల?" అన్నాడు.

గోపాలుడు నిర్భయముగా "మహేశ్వపురములో గదాధర చాటర్జీగారి కూతురు" అని చెప్పినాడు.

"ఎవరాయన?"

"శోణాపురం జమీందారుగారి ఉద్యోగములో ఉన్నారు"

"నీకు మతిపోయిందా! ఎవరో చప్పనౌకరు కూతురుని నీవు పెళ్ళాడడానికి నేను అనుమతి ఇవ్వాలా?"

గోపాలుడు ఊరుకున్నాడు. కాంతిచంద్రుడు "ఆవెర్రి యూవత్తూ పిడిచిపెట్టు! ధనము, అభిమానము, గుణము — వీటిలో నీకు సమానులయినవారి యింటి పిల్లనే పెళ్ళాడు" అన్నాడు.

అప్పటికీ గోపాలుడు మౌనముగానే ఉన్నాడు. సుశీలను గోపాలుడు ఒక్కసారి చూచివస్తే వివాహానికి తప్పకుండా ఆతురపడతాడని భావించి కాంతిబాబు "నీవు చిన్నవాడివి. మంచిచెడ్డ లాలోచించే శక్తి నీకింకా కలగలేదు. నీకోసం

నేను చేసే యేర్పాటు నీవు అంగీకరించక తప్పదు. నాఅభిప్రాయానికి విరుద్ధమైనపని తలపెట్టకు" అని కంఠస్వరము తగ్గించి "ఈలోగా ఒకనాడు వెళ్లి పిల్లను చూచిరా నీకెప్పుడు వీలవుతుందో చెపితే తగిన యేర్పాటు చేస్తాను" అన్నాడు.

"ఏర్పాటు అనవసరం. ఆపిల్లను పెళ్లి చేసుకోను" అని గోపాలుడు ధైర్యముగా అన్నాడు.

ఈసాగరుబోతు జవాబు వినేసరికి కాంతిచంద్రుడికి ఒళ్లు భగ్గు మన్నది. కాని కోపము అణుచుకొని ఆయన గదాధర చాటర్జీకి ఏమి పని?" అన్నాడు.

"గుమాస్తా."

కాంతిబాబు కనుబొమ్మలు ముడివేసి నిర్లక్ష్యభావముతో "గుమాస్తా కూతురుని వంట చేయడానికి ఈయింట్లోకి అతికష్టము మీద రానిస్తాను. కోడలుగా రానిస్తానని ఆశ పెట్టుకొన్నావా?" అన్నాడు.

"పెట్టుకోలేదు."

"అయితే నాఅనుమతి లేకుండానే వివాహం చేసుకోడానికి సిద్ధపడ్డావా?"

"మీరు సరిగానే ఊహించారు" అని గోపాలుడు సగర్వముగా అన్నాడు.

కాంతిచంద్రుడు సహించలేక ఇటూ అటూ పచారు మొదలు పెట్టినాడు. ఒకసారి హఠాత్తుగా గోపాలుడికేసి తిరిగి, నిప్పులు కురిపిస్తూ కర్కశ స్వరముతో "ఆషాఢ పంచమినాడు ముహూర్తం పెట్టాము. నీమంచి కోరుకొంటివా ఈలోగా సిద్ధపడు. ఇక నీవు వెళ్ళవద్దు!" అన్నాడు.

గోపాలుడు ఏమో చెప్పబోతూ ఉంటే కాంతిచంద్రుడు కళ్ళు ఎర్రజేసి "వద్దు ఒక్కమాటకూడా వినను. ఇకనడు" అన్నాడు.

వెంటనే గోపాలుడు ఆగది విడిచి వెళ్లినాడు.

# ౨౧

మరునాడు మధ్యాహ్నము గోపాలుడి పడవ మహేశ పురము రేవుకు మళ్ళీ వెళ్ళింది. గడిచిన రెండు రోజుల్లో అతని మీాదిగా వెళ్ళిపోయిన తుపాను గుర్తులు అతని శుష్కముఖాన, కాంతిహీనమైన కళ్ళలోనూ స్పష్టముగా కనబడుతున్నవి.

పడవ రేవున ఆగగానే అతను ఒడ్డుకు దూకి, ఆటే ఆల స్యము చేయనని, సిద్ధముగా ఉండవలసిందనీ కళాసులతో చెప్పి గదాధరుడి యింటివైపు బయలు దేరినాడు. ఎక్కువ సేపు నడవకముందే ఆయన యిల్లు కనబడ్డది. తోటలో ఎవరో మనుష్యమూర్తిని చూచి గదాధరుడే అనుకొన్నాడు అతని ఊహ నిజమే అయింది. కొంచెము ముందుకు వెళ్ళే సరికి కొత్తగా నాటిన పూలమొక్కకు తోపాదము చేస్తున్నాడాయన. గోపాలుణ్ణి చూచి సాదరముగా పిలిచి ఇంట్లోకి తీసుకు వెళ్ళినాడు. గదిలో తఖ్తాబల్లమీాద ఇద్దరూ కూర్చున్నారు. దానిమీాద పాత తివాసీ పరిచి ఉన్నది. ఇస్త్రీ చేసిన బొమ్మ చీటీగుడ్డ దానిమీాద వేసినారు. కన బడుతున్న తివాసీ భాగము మనుష్యుని నగ్న మనస్సువలె ఉన్నది. చూడడానికి అది కూడా యోగ్యముగా లేదు.

గోపాలుడు రావడము చూచి గదాధరుడి పక్షమువారు అతన్ని మర్యాద చేశారు.

కూర్చుని గోపాలుడు "నా ఉత్తరం అందిందా?" అన్నాడు.

"అందింది. ఇవాళే ఉదయమే."

"ఏమి నిర్ధారణ చేశారు?"

బదులు పలకకముందు గదాధరుడు కొన్ని క్షణాలు ఆలోచించి "మీనాయనగారు అంగీకరించనందుకు చాలా విచారముగా ఉన్నది. అంగీకరిస్తారని ఆశకూడా పెట్టుకోలేదు. మీరు మా అమ్మాయిని వివాహమాడడానికి స్వయముగా సిద్ధపడ్డప్పుడు నేనేమీ అడ్డము చెప్పను. ఇది మాకు సౌభాగ్యకరమైన విషయమే. మీరు చెప్పిందే సరి. ఇబ్బంది కలగకుండా ఇక్కడ వివాహం జరగదు. మరొకచోటికి వెళ్ళడం అవసరము" అని నెమ్మదిగా అన్నాడు.

"ఎక్కడికి వెళ్ళాలో ఏమైనా ఆలోచించారా?"

"ఆ" అని గదాధరుడు ఆలోచనలో పడ్డాడు.

"కలకత్తాకా?"

"కాదు" గదాధరుడి కనుబొమ్మలు ముడి విడలేదు.

"అయితే?" అని గోపాలుడు ఆయనవైపు ఆదుర్దాతో చూస్తున్నాడు. అతని కంఠస్వరము స్వాధీనములో లేదు.

"మా అబ్బాయి కృష్ణధనుడు పంజాబులో ఉద్యోగము చేస్తున్నాడని మీతో చెప్పాననుకుంటాను. రావల్పిండీలో కమిసేరియటులో గుమాస్తా. మనమంతా అక్కడికే వెళ్ళి అక్కడే శుభముహూర్తం జరిపించవలెనని నా కోరిక. కలకత్తాకంటె కూడా అది మంచి చోటు: కలకత్తాలో మీ నాయనగారి మిత్రులు చాలామంది ఉంటారు. ఆయన కలుసుకుంటే విఘ్నము చేస్తారు. మీరేమంటారు?"

"నాకు రెండూ ఒకటే. పంజాబులో వసతిగా ఉంటుందంటే అక్కడే కానివ్వండి."

ఆ మాటలు విని ప్రఫుల్లముఖముతో గదాధరుడు "మంచిది. ముహూర్తం సిద్ధపరచవలెగదా. ఎన్నాళ్ళలో మీరు సిద్ధం కాగలరు?" అని అడిగినాడు.

"ఒక్కసారి కలకత్తా వెళ్ళవలె. అక్కడ వారంరోజులుండవలసినపని ఉంది. తర్వాత పంజాబు బయలుదేరుతాను."

"అయితే ఇవాళ మొదలుకొని పక్షంతరవాత ముహూర్తం నిర్ణయిస్తే మీకు ఇబ్బంది ఉండదుగదా?"

"ఉండదు."

"మంచిది. అయితే పంచాంగం చూస్తాను. మీరు కాస్త కూర్చోండి. ఇప్పుడే వస్తాను" అని ఆయన మరో గదిలోనికి వెళ్ళినాడు.

ఇంతలో గోపాలుడా గది నాలుగుపక్కలా పరికించి చూచినాడు. గదాధరుడు తిరిగి వచ్చినాడు. డబ్బుపుచ్చుకో

కుండా ఇచ్చినటువంటీ, స్వర్ణసిందూర మహామృత రసాయనాది ఔషధముల ప్రకటనలతో కిటకిట లాడుతున్నటువంటీ వైద్య పంచాంగము ఒకచేతిలోను, కళ్ళజోడు మరొక చేతులోనూ ఉన్నవి.

కూర్చుని జోడు గుడ్డతో తుడిచి కళ్ళకు సులోచనాలు తగిలించుకొని పంచాంగములో ముహూర్తాల పుట తిప్పి ఆయన ఇలా నెమ్మది నెమ్మదిగా అన్నాడు:

"వివాహం వివాహం...ఆషాఢంలో...చాలారోజులు కనబడుతున్నవి...నాలుగు, అయిదు, పదకొండు, పధ్నాలుగు. పదకొండు, పన్నెండు, పదహేను...ఇవాళ శేష బహుళ చతుర్థి...ఇంకా పన్నెండు రోజులున్నవి...ఆషాఢములో నాలుగు...వెరసి పదహారు...సరిపోయింది." అని ఆయన పంచాంగములో వెతకడము మొదలు పెట్టినాడు. సరి అయినచోటికివచ్చి మళ్ళీ యిలా అన్నాడు. "ఆషాఢ షష్ఠి. జూన్ ౧౮ అవుతుంది. బుధవారం త్రయోదశి విశాఖా నక్షత్రం సరి. కాలవకరణం, సిద్ధియోగం. ఇకపోతే, నక్షత్రామృతయోగం. జన్మతులారాశి. సరే. ౧౦ గం. ౨౩ ని. ౯ సె. ధనుర్మకరలగ్నంలో సుశుభాంబుక యోగంలో వివాహం. దక్షిణే యోగినీ. వంకాయ నిషిద్ధం. సరి. చతుర్థి బాగా కనబడుతున్నది. చతుర్థి స్థిరం. మీరేమంటారు?"

"సరే. నాకేమీ అభ్యంతరం లేదు. నేను వేళకు సరిగా అక్కడికి వస్తాను. నాకు చిరునామా చెప్పండి."

అప్పుడు గదాధరుడు కాకితము ముక్కమీద కృష్ణధనుని చిరునామా వ్రాసియిచ్చి "మీరు కలకత్తా ఎప్పుడు వెళ్ళుతారు ?" అన్నాడు.

"రెండు మూడు రోజుల్లో."

"మీ కలకత్తా చిరునామా ఇవ్వండి. ఏమైనా సమాచారం తెలియ పరచవలసి వస్తుందేమో."

గోపాలుడు కలకత్తాలో తన అడ్రసు వ్రాసియిచ్చి సెలవు తీసుకొంటూ వున్నాడు. "వెళ్ళడానికి ఎంతమాత్రమూ వీలు లేదు సాయంకాలము ఇక్కడ భోజనం చెయ్యక తప్పదు" అన్నాడు గదాధరుడు.

"భోజనానికి ఉండడం చాలా సంతోషం. కాని పొద్దు కూకకముందే ఒకపనిమీద ఇంటికి పోవలసి ఉన్నది" అని కాస్తఫలాహారము చేయడానికి గోపాలుడు అంగీకరించినాడు. ఇంతవరకూ అతనికి రమాసుందరి కనబడలేదు. ఆమె సంగతి అడగడానికి సిగ్గుపడ్డాడు. అతను బయలుదేరేసరికి గంతులు వేస్తూ రాజలక్ష్మి కనబడ్డది. ఆపిల్లతో గోపాలుడికి ఈమధ్య స్నేహము ఎక్కువయింది. రాజలక్ష్మి అతనని వేళాకోళము చేస్తూ రాజామహాశయా అని పిలవడము మొదలు పెట్టింది. అలా అనడము పిల్లకు చాలా ఆనందము. రాజామహాశయా

అని ప్రశ్న అడిగినా, ముద్దు నవ్వు వచ్చేది. ప్రత్యుత్తరము రావడానికి ఆలస్య మయ్యేది. గోపాలుడి పేరు మార్పిడి కోమళ్ళ చేశామని రాజలక్ష్మి చాలా సంతోషించింది. కాని అవతలి అంగీకారము రాకపో యేసరికి మంత్రి మహాశయా అని పేరుపెట్టి మనస్సులో క్షోభ తగ్గించుకొన్నది.

"ఏమి మంత్రి మహాశయా, తుపాకి తెచ్చారా?" అన్నది రాజలక్ష్మి.

"తెచ్చాను. పడవలో ఉన్నది. చూస్తావా?"

"నన్ను తీసుకు వెళ్ళండి. చూస్తాను."

రాజలక్ష్మి గంతులు వేస్తూ అతని వెంట వెళ్ళి "ఏమండోయి, మేము ఎక్కడికి వెళ్ళుతున్నామో తెలుసునా?" అన్నది.

"తెలియదు. ఎక్కడికి వెళ్ళుతున్నారో చెప్పు."

పిల్ల గంభీరముగా "పంజాబు" అన్నది.

గోపాలుడు ఆశ్చర్యము నటిస్తూ "అలాగా! చెప్పవూ!" అన్నాడు.

రాజలక్ష్మి గాంభీర్యముతో తల తిప్పింది.

"ఎవరు వెళుతారు పంజాబు?"

"బాబు వెళ్ళుతారు, అక్కయ్య వెళ్ళుతుంది."

"మీ అక్కయ్య ఇవాళ కనబడలేదే. ఎక్కడికి వెళ్ళింది?"

"అక్కయ్య ఎక్కడికి వెళ్ళిందో తెలుసునా ?"

"తెలియదు."

"యదుబాబుగారింటికి జడ వేయించుకోవడానికి. అక్కయ్య వెళ్ళేదిగాదు. అత్తయ్య పట్టుపట్టి పంపించింది."

తాను వచ్చేసంగతి ముందుగా తెలియడము ఎంత మాత్రమూ బాగున్నది కాదనుకొన్నాడు గోపాలుడు.

సాయంకాలము గాఢమగు దీర్ఘాలోచన చేసి పెద్ద ఉత్తరము వ్రాసినాడు. మరునాడు ఉదయము లేచి కోనాపురము వెళ్ళి స్వయముగా ఉత్తరము రెజిష్టరు చేసి, జమీందారు దగ్గర సెలవు పుచ్చుకొన్నాడు.

అయిదోనాడు పోస్టాఫీసుకు వెళ్ళి ఆయన ఉత్తరాలకోసము ఎదురుచూస్తున్నాడు. టపాలో ఆయన పేర కొడుకుదగ్గర నుంచి రిజష్టరు ఉత్తరము వచ్చింది.

ఇంటికి వచ్చి సాయంకాలము ఈ ఉత్తరమూ ఇంట్లో ఉన్న పాత ఉత్తరాలూ తగలబెట్టినాడు.

మరునాడాయన సకుటుంబముగా పంజాబు బయలుదేరినాడు. రైలెక్కే వూరిలో ఉత్తరము రెజిష్టరు చేసి, గోపాలునికి పేర కలకత్తా పంపినాడు.

బండిలో ఎక్కిన తర్వాత ఉత్సాహముతో రమాదేవి లక్ష్మితో మాట్లాడుతున్నది. పంజాబు తోవలో పెద్ద కొండలు, అడవులు, నదులు ఉన్నవనీ అవన్నీ బండిలో

నుంచి చూస్తే కనబడతవనీ గోపాలుడు చెప్పినాడట. అవన్నీ చూచి మళ్ళీ యింటికి వచ్చిన తర్వాత అతనితో ఏమేమి తాను చెప్పదలచుకొన్నదో లక్ష్మికి చూచాయగా తెలియ పరిచింది. తామంతా పంజాబు ఎందుకు వెళ్ళుతున్నారో రమకు తెలియదు. నలుగురికీ తెలిసిపోతుందేమో అన్న భయాన గదాధరుడు జాగ్రత్త పడ్డాడు. అక్కగారికీ లక్ష్మికీ భద్రయని చెప్పినాడు.

రమ మాటిమాటికీ గోపాలుడి సంగతి ఎత్తుతుంటే లక్ష్మి దాచిపెట్టలేక సంగతి అంతా చెప్పింది.

రమ ఆశ్చర్యముతో కళ్ళు పెద్దవిచేసి దాదికేసి చూస్తూ "నిజమేనా ?" అన్నది.

లక్ష్మి కొంచెము పరిహాసము చేతామనుకొంచి "నిజమైతే నీకు సంతోషమేనా ?" అన్నది.

వివాహప్రసంగము వచ్చినప్పుడు సిగ్గుపడవలెనని రమకు ఎవరూ చెప్పలేదు. వారముల్రోజులకింకవట ఆమెకు పదిహేనో యేడువచ్చింది. ఎవ్వరూ నేర్పకపోయినప్పటికీ రమ చెక్కిళ్లు సిగ్గుచేత ఎర్రబడ్డవి. అయినప్పటికీ సరళభావముతో ఆమె సంతోషమే అని సంజ్ఞ చేసింది.

౨౨

గోపాలుడు కలకత్తా వెళ్ళి అక్కడనుంచి పంజాబు వెళ్ళడానికి సిద్ధపడుచున్నా డని తల్లి సంతోషించింది. ఈప్రయాణమువల్ల అతని శరీరమూ మనస్సూ బాగుపడతవనుకొన్నది. కొన్నాళ్ళనుంచి అతని శుష్కముఖము చూచునప్పుడల్లా తల్లిమనస్సు చివుక్కుమంటున్నది. రెండు గడియలు సేపు కూర్చుని అతనితో సంభాషించి మనస్సుకు వినోదము కలిగించడానికి ఆగ్రామములో ఈడుజోడువాళ్ళు ఎవరూ లేరు. కలకత్తాలో అతనికి చాలామంది స్నేహితులున్నారు. వాళ్ళతో కలిసిఉంటే అతని విచారము తొలగిపోతుంది. కుమారుని సంగతివిని కాంతిచంద్రుడు లోలోపల సంతోషించినాడు. 'అశుభస్య కాలహరణమ్' అనుకొన్నాడు. కాలక్రమేణ గుమాస్తాకూతురిని పెండ్లిచేసుకొందామనే పట్టు విడిచిపెట్టుతాడనుకొన్నాడు.

మహేశపురమునుంచి వచ్చినరెండురోజులకు గోపాలుడు రైలులో కలకత్తా వెళ్ళినాడు.

తర్వాత వారంరోజులకు సూర్యాస్తమానానికి కొంచెము ముందుగా సీతానాధరాయలు ఇంట్లోకూర్చుని హుక్కా

తాగుతూ స్త్రీలతో మాట్లాడుతున్నాడు. హరిహర బాబు కు మాత్రమూ ఏవో పాలుడికి వివాహము అయ్యే సంకల్పము దూరమయిపోయింది. స్త్రీకొడుకుల ముఖాలు కొంచెము వికసించినవి. దీనికి ఎవరు అడ్డుపడగలరు? భావికాలములో ఏమున్నదో ఎవరికి తెలుసును? ఈక్షణముగా స్త్రీకొడుకులు మాట్లాడుకొంటున్నారు. ఇంతలో జమీందారుగారి దర్వాంజీ వచ్చి రాయజీని యజమాని పిలుస్తున్నారని విన్నవించినాడు. జమీందారు వేళాపాళా లేకుండా రాయజీని రమ్మనడము మామూలు, కాబట్టి ఇందులో ఏమీవింత లేదు. సీతానాథుడు మంచిబట్టలు కట్టుకొని చేతికర్ర తిప్పుకొంటూ తాంబూలము నములుకొంటూ కచ్చేరీగదిలోకి వెళ్ళినాడు.

అప్పుడే అస్తమానము అవుతూ అవుతూ ఉన్నది. రాయజీ లోపలికి వెళ్ళిచూచినాడు. కాంతిచంద్రుడు వృద్ధవ్యాఘ్రముపలె ఇటూ అటూ తిరుగుతున్నాడు. రాయజీ చూచి వ్యాకులపడి ఏదో విశేషము జరిగిందనుకొని "ఏమి భాయజీ, ఏమిటిసంగతి?" అన్నాడు.

కాంతిచంద్రుడు ఏమీ మాట్లాడక సీతానాథుని చేతులో ఉత్తరముంచినాడు. చూడడానికి రాయజీ కిటికీదగ్గరికి వెళ్ళినాడు.

కలకత్తా,

శ్రీచరణేషు

జ్యే. బ. ౧౩.

నేను ఈవేళ పశ్చిమమునకు వెళ్ళుతున్నాను. ఆషాఢ శుద్ధ చతుర్థి నాడు శ్రీయుత గదాధర చట్టోపాధ్యాయులవారి కుమార్తె శ్రీమతి రమాసుందరీదేవిని పాణిగ్రహణము చేసుకొంటాను.

ఇట్లు విన్నవించు విధేయుడు

శ్రీనవగోపాల బెనర్జి

ఉత్తరము చదివి రాయ్‌జీ కాంతిచంద్రుడి కేసి చూచి "ఏమిటి ఉపాయం?" అన్నాడు.

"ఉపాయం ఆలోచించటానికే మిమ్మల్ని రమ్మన్నాను. ఈ పెళ్ళి ఏదో విధంగానైనా ఆపాలనే."

"అవునవును. పశ్చిమమునకు వెళ్ళుతున్నానన్నాడు. ఎక్కడికో ఏమైనా ఊహించారా?"

"అంతా బయటికి తెలియ్యవని మనం అడ్డుపడతామనే పశ్చిమం వెళ్ళాడు. ఈవేళ చతుర్థి ఇంకా ఆరురోజులుంది ముహూర్తం. బహుశా గదాధరుడు పిల్లను తీసుకొని ఇంతవరకూ బయలుదేరకపోవచ్చు. మీరు ఇవాళే మహేశపురం వెళ్ళాలి పిల్ల అక్కడే ఉంటే పట్టితెచ్చుకురండి. వెళ్ళిపోయి ఉంటే అక్కడి వాళ్ళను అడిగి అన్ని విశేషాలూ కనుక్కొండి, రేపు మనం పశ్చిమం బయలుదేరాలి"

రాయ్‌జీ ఒక క్షణం ఆలోచించి "వాళ్ళు ఆచోకీ తేలికగా తెలియనిస్తారా?" అన్నాడు.

కాంతిచంద్రుడు కోపముతో "ఏమయినాసరే. వాళ్ళమీద పెళ్ళిపడండి. ప్రాణాలు తీస్తామని భయపెట్టితే వాళ్ళు చెప్పి వేస్తారు" అన్నాడు.

కాంతిచంద్రుని కోపమూ ఉద్రేకమూ సీతానాథునికి కూడా చురుకుపుట్టించినవి. "మంచిది. లాఠీవాలాలను ఇవ్వండి. దివిటీలు ఇప్పించండి. ఏనుగులివ్వండి. నేను పని నెరవేర్చుకు రాకపోతే—రాకపోతే—"

తనవిషయములో ఎంతఅవమానము స్వీకరించడానికి సిద్ధపడవలెనో సీతానాథుడికి బోధపడలేదు.

"అన్నీయిస్తాను. ఈపని మీరు సానుకూలంచేసుకు వస్తే మీవంటిస్నేహితుడు నాకింకెవరూ ఉండరనుకోండి"

కాంతి చంద్రుడు మహాఉద్రేకముతో ఉన్నాడు. లేకపోతే ఇంతభావము కనబరిచేవాడు కాడు.

జమీందారుగారి ఆజ్ఞచొప్పున సేవకులు మెరుపుతీగెలవలె ఊళ్ళోకి పరుగెత్తినారు. త్వరలో ఇరవైమంది యమకింకరులవంటి గొల్లలు, లాఠీవాళ్లు, ఇద్దరు ఈటెలవాళ్లూ వచ్చి హాజరయినారు. దివిటీలవాళ్ళను తీసుకు రావడానికి కొందరు వెళ్ళారు. రెండేనుగులు తయారై వచ్చినవి. పెద్దశరీరాలవి. ముందు నడుస్తున్నా ఏనుగుమీద దీపము పెట్టి నిశ్శబ్దముగా బరిణముతో ఆయుధాలతో సీతానాథును బయలుదేరినాడు. అప్పటికి రాత్రి జాము పొద్దుపోయింది. విశాలాక్షికి మహా

శపురము నాలుగోవన ఆరుకోసులు. రమారమి రెండుజాము లవేళ సిబ్బంది కూడవస్తూ మహేశపురము చేరింది.

పరివారములో ఇద్దరు ముగ్గురికి గదాధరుడి ఇల్లు తెలుసు. ఇంటి దగ్గరకు వెళ్ళగానే రాయజీ హుకుంప్రకారము అన్ని కాగడాలూ వెలిగించారు.

సింహద్వారము ఎదటికి వెళ్ళి చూస్తే తాళముపేసి ఉన్నది. పిట్ట ఎగిరిపోయిందనుకొన్నాడు రాయజీ. ఇంట్లోవాళ్ళను బెదరించి తీకానా తెలుసుకొందామంటే ఆమార్గముకూడా పోయింది. కొంచెము యోచించి "తాళం పగుల గొట్టండి" అన్నాడు.

తాళము పగల గొట్టడానికి నిమిషము పట్టింది. పదిమంది సేవకులను వెంటబెట్టుకొని పనుకు మీాసించి దిగి రాయజీ ఆవరణలో ప్రవేశించినాడు. ఆయింటి పిల్లి దొడ్లో పొయ్యిలో పడుకొని ఉన్నది. ఆవెలుతురూ జనసమ్మర్దమూ చూచి మ్యావు అంటూ పారిపోయింది. కాగడాల వెలుతురులో ప్రతిగది వెలుపలా పరీక్షించి ప్రధానమైన గదితాళము పగల గొట్టమన్నాడు. గదిలో ప్రవేశించి పాతకాకితాలు మొదలయిన వాటికోసము అన్నివైపులా వెతికినాడు పెట్టె వగైరా అన్నీ పగలగొట్టి వస్తువులన్నీ తికమకగా పోశాడు. ఎక్కడా కాకితపుముక్క కూడా కనబడలేదు.

ఒకగదిలోనుంచి ఇంకోగదిలోకి, చివరకు వంటయింట్లోకి

వెళ్ళినారు. ఎక్కడా సవడి లేదు. ఇంటికప్పులో, అటకమీదా వెతకమన్నాడు రాయజీ. కాగడాలు పట్టి వెతికినా ఏమీ కనబడలేదు. ఇంతలో హఠాత్తుగా ఒక పాక నిప్పు అంటుకొన్నది. సేవకులు ఆర్పబోతూ ఉంటే భగ్నమనోరథుడయిన రాయజీ కోపోద్రిక్తుడై "ఆర్పవద్దు, ఆర్పవద్దు. మండనివ్వండి" అని అరిచినాడు. వెంటనే అందరూ ఆవరణ దాటి బయటికి వెళ్ళారు. రాయజీ మావటివాళ్ళను చూచి "ఏనుగలు గోడలు పడదోయ్యగలవా ! మట్టిగోడలు, ఇటుకవి కావు" అన్నాడు.

మావటివాళ్ళు ఆశ్చర్యపడుతూ ఏకగ్రీవముగా "ఎందుకు పడదోయ్యలేవు హుజూర్? హుకుం ఇస్తే పడదోస్తవి" అన్నారు

వాళ్ళు వెంటనే హుకుం నెరవేర్చబోయినారు. నిప్పంటుకొన్న గది ముందరి భాగమే తగలబడుతున్నది వెనుకవైపు ఇంకా మంట అందుకోలేదు. ఏనుగులు రెండూ ఇషారా ప్రకారము గోడకు శరీరము మోపి నిలుచున్నవి. రెండవ సారి ఇషారా చేసేసరికి పెద్దపెట్టున ఘీంకారము చేసి ఒక్కసారిగా గోడను నెట్టివేసినవి. పెద్దచప్పుడుతో గోడ లోపలికి కూలింది. వెనుకవైపు కప్పుకూడా కూలి యావత్తు జ్వాలామయ మయిపోయింది.

ఈవిధముగా ఒక్కొక్కగదే కూలిపోయింది. సీతానాథుడు కాగడా తీసుకొని స్వయముగా ముట్టించినాడు. చీకటి తో

లగిపోయి దశదిశలా పగటి కాంతి వంటి వెలుతురు వ్యాపించింది

ఎదట మంటలు చూచి రాయజీ సంతోషంతో పళ్ళు ఇకిలించినాడు. ఆ పెద్ద వెలుగులో సమీపాన యమపురోహితుని యిల్లు కనబడ్డది. సీతానాధరాములు సిబ్బందితో అక్కడికి వెళ్ళినాడు.

వీధి వాకిలి లోపలగడియ వేసి ఉన్నది. ఒకడు గోడ దూకి లోపలి గడియ తీసినాడు. అంతా లోపల ప్రవేశించారు. అన్నిగదుల తలుపులూ తెరచి ఉన్నవి. లోపల ఎవరూ లేరు.

ఎవరైనా కనపడతారేమో అనే ఆశతో సేవకులు నాలుగువైపులా వెతికినారు. చివరకు గోశాల దగ్గర తవుడు పోసే పెద్ద బానలో ముసలమ్మ కనపడ్డది.

బలవంతాన ముసలమ్మను బైటికి లాగారు. ఆవిడ ఏడుస్తూ మొత్తుకొంటూ "అయ్యో! దొంగబాబుల్లారా, ఇంట్లో ఉన్నదంతా తీసుకు వెళ్ళండి, ప్రాణాలు మట్టుకు తియ్యకండి" అని నేలమీద పడి సమీపములో ఉన్న కాగడావాడి కాళ్ళదగ్గిర దొర్లింది.

"నోరు ముయ్యి, ముసిలిముండా! చెప్పిందివిను" అన్నాడు రాయజీ.

కాని, ముసలమ్మ మునపటివలె రాగాలుపెడుతూ "అయ్యో!

మీరంతా రంయిమని ఆయింటిమీద వచ్చిపడ్డప్పుడు ఈ యింట్లో వాళ్ళంతా దొడ్డిదారిని పారిపోయారు. నేను ముసలిదాన్ని, నాకేమీ కనబడదు. ఈ బానలో పడిపోయాను" అని చెప్పింది.

"నోరు ముయ్యి అంటుంటే!" అని రాయజీ అనేసరికి ముసలమ్మ పెడబొబ్బలు పెట్టుతూ "అయ్యో! రక్షించండి బాబూ! నాకేమీ తెలియదు బాబూ!" అని యేడ్చింది.

రాయజీ బల్లెము తీసుకొని కొన ముసలిదాన్ని శరీరానికి ఆనించి "మరొకమాట అన్నావా, ఈ పోటు తగులుతుంది" అన్నాడు.

దీనికి ఫలితముగా మంత్రము వేసినట్టు ఆమె కిక్కురు మనకుండా ఊరుకొన్నది.

రాయజీ ఈమె అవతలికి పట్టి "ఆయింటి గదాధర బాబు ఎక్కడికి వెళ్ళాడు?" అన్నాడు.

"గదాధర బాబు సకుటుంబంగా రెండురోజులకిందట పశ్చిమం వెళ్లాడు."

"ఏవూరుకు?"

"రావల్పిండో గీవల్పిండో- ఆయన కొడుకు ఉద్యోగంలో ఉన్నాడు. అక్కడికి వెళ్ళాడు బాబూ. రక్షించండి బాబూ! నాకేమీ తెలియదు బాబూ. గుమాస్తా చాలాడబ్బు కూడ పెట్టాడు. ఎక్కడ దాచాడో నాకు తెలియదు బాబూ!"

"నోరు ముయ్యి ముసలీ! పిల్లవాని పేరేమిటి?"

"పిల్లవాడి పేరా? కిష్టధన్. రక్షించండి బాబూ! బీదదాన్ని బాబూ!"

ఈ మాటలు విన్నతర్వాత సీతానాథరాయలు సిబ్బందితో బయలు దేరినాడు. ఏను గెక్కి రెండు గంటలలోగా విశాలాక్షికి తిరిగి వచ్చి, వెంటనే కాంతి చంద్రుణ్ణి కలుసుకొన్నాడు.

పడుకొని ఉన్న కాంతి చంద్రుడు లేచి సీతానాథుడు చెప్పిన సంగతులు విని, తెల్లవారగానే పంజాబు బయలుదేరవలెననుకొన్నాడు

## ౨౩

"పిల్లా, పిల్లా."

జవాబు రాలేదు. శ్యామచంద్రుడు చీపురుకట్టపుచ్చుకొని బల్లలు, కుర్చీలు, బొమ్మలు, గదిలో ఉన్న వస్తువులుమీది దుమ్ము దులిపినాడు. అతను ఈయింట్లో ఖాన్‌సామా సేవకుల మీద అతని ఆధిపత్యానికి అంతులేదు. పిల్ల రాలేదని కొంచెము బిగ్గరగా "ఏం పిల్లా" అని శ్యామచంద్రుడు కేకవేసినాడు.

ఈసారి పిల్లవచ్చి "ఎందుకు, అంతఅరుస్తావు? ఏమిటిజరిగింది?" అన్నది.

పిల్లకు ఆటేవయస్సు లేదు. శరీరచ్ఛాయకూడా బాగా ఉంటుంది. శ్యామచంద్రుడు మందహాసము చేస్తూ "ఇటు రా — మాతుగానివి" అన్నాడు.

పనికత్తె దగ్గిరికి వచ్చి "ఏమిటి సంగతి?" అన్నది.

మేజామీది ఒక భాగము చూపి "ఇక్కడ కాగితపుముక్క వరికోసం ఉంచావు?" అన్నాడు చంద్రుడు.

పనికత్తె అరనాలిక వేసి "అయ్యబాబు! కాగితంముక్కపడ్డదని యింతగందరగోళమా!" అన్నది.

అతను స్వరము తగ్గించి "ఇలా కాగితం ఎవరు చించివేశారనకొన్నావు?" అన్నాడు.

"తెలియదు."

"నేనే చించివేశాను — నిన్ను చివాట్లు పెట్టడానికి."

పిల్ల అతనిమీద కటాక్షవీక్షణము పడవేసి,

"ఖబర్దార్! నాతో తమాషాలూ గిమాషాలూ పనికిరావు!" అని గబగబా వెళ్ళిపోతూఉంటే శ్యామచంద్రుడు "విను, విను పిల్లా" అన్నాడు.

పనికత్తె దర్వాజాదగ్గర నిలుచుని విరక్తి నటిస్తూ "మళ్ళీ ఏ వచ్చింది?" అన్నది.

"వామనరావుగారితో లంచీ చెయ్యమని చెప్పు. టీ సామానులు తీసుకురా."

పనికత్తె వెళ్ళినతర్వాత గుర్రమునకు నాడాలు వేసిన మోటు జోడు చప్పుడు వినపడ్డది. వెంటనే పోష్టుబంట్రోతు ఆవిర్భవించినాడు. అతను సంచిలోనుంచి రిజిష్టరుఉత్తరము తీసి "బాబు నవగోపాల బానర్జీ గారు ఎక్కడున్నారు?" అని అడిగినాడు.

"గోసల్‌ఖానాలో ఉన్నారు" అని శ్యామచంద్రుడు జవాను చేతులోనుంచి ఉత్తరము తీసుకోడానికి చెయ్యి సాపినాడు.

"రిజిష్టరుకవరు. బాబుగారిసంతకం కావాలి,

"నేను సంతకం చేయించి తీసుకువస్తాను."

"అయ్యో బాబు! రిజిష్టరుఉత్తరం ఖామందుకుతప్ప ఇతరులచేతులో పెట్టడానికి హుకుం లేదు."

శ్యామచంద్రుడు చేత్తో ద్వారముకేసి చూపుతూ "అయితే మాట్లాడకుండా అక్కడకూచో. బాబుగారు రావడానికి ఇంకా ఆలస్యముంది" అని చెప్పినాడు.

"చాలా ఆలస్యమా?"

"కాలేదు ఆలస్యం."

"అయితే చెప్పిన సంతకం చేసివెయ్యి. గడబిడ కాకుండా చూడు"

చూపించినచోటు శ్యామచంద్రుడు దస్కతు చేసి శ్రీనవగోపాలబానర్జీగారి తరఫున అని వ్రాసినాడు.

పోస్టుజవాను వెళ్ళినతర్వాత శ్యామచంద్రుడు ఉత్తరము అటూ ఇటూ బాగా తిప్పి చూచినాడు ఇంతలో పనికత్తె టీ సామగ్రులు తీసుకువచ్చింది ఉత్తరము రెండు చేతులలో తిప్పుతూ పిల్లకేసి చూచి "బాగా రక్క వేసియున్నది నోట్లు" అన్నాడు.

"ఏమాత్రం?"

ఉత్తరము చేతులో తూస్తూ "రెండు వందలు" అన్నాడు శ్యామచంద్రుడు. అసామాన్యమైన అతని తెలివికి పనికత్తె ఆశ్చర్యపడ్డది.

గడియారము తొమ్మిది కొట్టింది. ఈసుందరిను భవానీపుర ములోడ. దగ్గరలో రసారోడ్డునుంచి ట్రాముబండీచప్పుడు విన బడుతున్నది. ఇంటి యజమాని నవగోపాలుని స్నేహితుడు. గోపాలుడు కొద్దిరోజులనుంచి ఇక్కడఉంటున్నాడు. వచ్చిన ప్పటినుంచీ చాలా ఆందోళనపడుతున్నాడు. కంపెనీబొండు కాగితాలు కొన్ని అమ్మినాడు భవిష్యత్తును గురించి చాలా కల్పనలు చేస్తున్నాడు వివాహ మయినతర్వాత పశ్చిమాన ఇల్లు తీసుకొని ఉండవలెననుకొన్నాడు. చేతులో ఉన్న పైక ముతో రెండేళ్ళు గడుస్తుంది. ఈలోగా ఏదయినఉద్యోగ ముకోసము ప్రయత్నించవలె. ఉపాధ్యాయ పదవికాని మరేదైనా కాని.

గోపాలుడు త్వరలోనే వచ్చినాడు శ్యామచంద్రుడు కిటికీ దగ్గర టీ పాయిమీద తేసిరు, పళ్ళెములో కొన్ని లుడ్లు ఉంచినాడు. ఉత్తరముకూడా అక్కడే పెట్టినాడు గోపాలుడు వచ్చి కుర్చీలో కూర్చుని ఉత్తరము పైభాగము పరీక్షించినాడు. అడ్రెసు వంగభాషలో వ్రాసిఉన్నది. దస్తూరీ కొత్తది. పోస్టుముద్రి చూచినాడు. ఊరిపేరు తెలిసినా అక్కడ పరిచితు లెవరూ ఉన్నట్లు తోచలేదు కొంచెము ఆశ్చర్యముతో కవరువిప్పి చదివినాడు. అందులో ఇలా ఉన్నది:—

ఓం ప్రజాపతయే నమః పరమకల్యాణీయ శ్రీనవగోపాల బాబాజీవనునకు పత్రికాముఖమున అనేకాశీర్వచనములు.

ఇటీవలలో అనుకొన్నట్టుగా నేను ఈవేళ పంజాబు బయలుదేరినాను. రావల్పిండీలో శుభకార్యము జరుగునని ఇదివరలో చెప్పియుంటిని. కాని కారణాంతరములచేత ఆయేర్పాటు మానవలసివచ్చినది. రావల్పిండికంటె ఈవలనున్న అమృతసరము నిర్ధారణచేసితిని. శుభకార్యమక్కడ నిర్వర్తింపవలెనని యభిలాషము. కావున మీరు రావల్పిండికి చనక అమృతసరమున కరుగుఁడు. మేము కూడ అచ్చటికే చనుచున్నాము పూర్వోక్త నగరమున నబుజీఖాన్ అను పేటలో మత్పుత్రుని మిత్రము ఒకరుకలరు. శ్రీమాన్ భూపేంద్రనాథ రాయ చౌధురి నగరములో విఖ్యాతపురు

షులలో నౌకరు. అచ్చటికి పోష్టుమాష్టరు. మీరు అమృతసరమున కరుగు దేరగానే ప్రప్రథమమున ఆయన నన్వేషింపుడు అన్నన్ని వానస్థానము మీకు విశదము కాగలదు. మీరు సత్వరముగా బయలు దేరవలయును విలంబము వలదు. ముహూర్తవాసర మాసన్నమయియున్నది మిక్కిలి జాగరూకతతో రాదగును గమ్యస్థాన మెవరికిని దెలియరాదు. ఇందులకు ప్రత్యేక కారణముకలదు. సమయమున సమస్తము విశదము చేయుదును. భగవత్కటాక్షమువలన ఇచ్చట కుశలము. మీ కుశలమును నిరంతరము కోరుటకన్న అధికముగా వ్రాయునది లేదు.

ఆశీర్వాదకుడు

శ్రీగదాధర దేవశర్మ.

పునశ్చ: ఉత్తరము రిజిష్టరు చేసి పంపుచున్నాను.

ఉత్తరము చదివి గోపాలుడు టీ పుచ్చుకొన్నాడు. ఇంకో సారి ఉత్తరము చదివినాడు. హఠాత్తుగా ఎందుకీమార్పు చెయ్యవలసి వచ్చిందో ఏదో రహస్య మున్నట్టు తోస్తున్నది. ఏమైనా కానీ, అమృతసర మయినా, రావల్పిండీ అయినా ఒకటే.

ఆ రోజల్లా వస్తువులు కొనడములోనూ ఏర్పాటులు చేసుకోవడములోనూ గడచిపోయింది. రాత్రి పదిగంటలకు మెయిలెక్కి నవగోపాలుడు అమృతసరము బయలుదేరినాడు.

## ౨౪

రెండురోజులు నిరంతర ప్రయాణము చేసి గోపాలుడు అమృతసరము చేరినాడు. అప్పటికి రమారమి ఎనిమిదిగంటలవుతుంది. అతను బండిలోనుంచి ప్లాటుఫారము మీదికి దిగీ దిగకముందే కొంతమంది పండాలు అతని చుట్టూ మూగి, పేరు, నివాసము, వెళ్ళవలసిన చోటు మొదలయిన విషయాలనుగురించి ప్రశ్నలవర్షము కురిపించారు. గోపాలుడు ఎవరి మాటా వినిపించుకోక సామానులు కూలీలకిచ్చి బయటికి వెళ్ళినాడు. వెలుపల చాలా ఎక్కాబండ్లు నిలిచి ఉన్నవి. నివాసము దొరుకుతుందేమో అని గోపాలుడు ఎవరినైనా అడుగుదామనుకొన్నాడు. ఇంతలో అద్భుతవేషధారి ఒకడు ప్రత్యక్షమయినాడు. వేషాన్నిబట్టి అతను హిందుస్తానీ అయినదీ బెంగాలీ అయినదీ తెలియడము లేదు. అతను 'మిరజాయి' తొడుక్కొన్నాడు, మాసిపోయిన ముఖమల్ టోపీ నెత్తిన పెట్టుకొన్నాడు.

కాళ్ళకు నాగరాజోడు ఉన్నది. ధోవతీ మాత్రము బెంగా

లీల ప్రకృతిని కుచ్చెళ్ళుపోసి కట్టినాడు. ఏమైనా కానీ, గోపా లుడు ఆలోచించవలసిన అవసరము లేకపోయింది ఆమనిషి వచ్చి "బాబూ, నేను బెంగాలీని" అన్నాడు.
అతన్ని చూచేసరికి కొంచెము నవ్వువచ్చి గోపాలుడు "మీా పేరేమిటి" అన్నాడు.
"ముకుందలాల్ విశ్వాసు మానాయనగారు బంగాళాదేశ మునుంచి వచ్చి యిక్కడుండి చనిపోయినారు. నగను నట్రా ఏమీా ఇవ్వలేదు చాలా చిక్కుల్లో పడ్డాను. బెంగాలీ యాత్రి కు లెవరైనా వస్తే వారికి నివాసము చూపిస్తాను ఊరు చూపిస్తాను. ఈవిధంగా నాకు భుక్తి గడుస్తున్నది. తమరు ఎక్కడికి వెళ్ళాలి బాబూ?"
తనదేశపు పెద్దమనిషి దైవప్రాతికూల్యమువల్ల చిక్కులలో పడ్డాడని విని గోపాలుడు అతన్ని స్వీకరించి "ఎక్కడికి వెళు తానో ఇంకా నిశ్చయించలేను నాకు మంచియిల్లు ఏదయి నా కుదర్చగలరా?" అన్నాడు.
ముకుందలాల్ ఉత్సాహముతో "మంచిది బాబూ నా వెంట రండి. బండి పిలవనా?" అన్నాడు.
గోపాలుడు సరే అన్నాడు. వెంటనే ముకుందలాల్ బండి కుదిర్చి కూలివాడిచేత సామానులు ఎక్కించి, బండివాడికి ఒకచోటు చెప్పి, గోపాలునిపక్క తాను కూర్చున్నాడు.

బండి నడుస్తుంటే గోపాలుడు ,,ఎటువంటి యింటికి తీసుకు వెళ్లుతున్నారు ? సత్రానికి కాదుగద ? యాత్రికు లుండే యిల్లు వద్దు. చిన్నయిల్లు ప్రత్యేకంగా కావాలి'' అని చెప్పినాడు.

,,మంచిది బాబూ, మీకు ఎలాటిది కావలిస్తే అలాటిది దొరుకుతుంది." అని ముకుందలాల్ కిటికీలోనుంచి బండి వాడికి ఇంకో నోటు చెప్పినాడు.

స్టేషనుకు ఊరు అరమైలు. బండి వేగముగా వెళ్ళుతున్నది.

"బాబూ, మీ పేరేమిటి?" అన్నాడు ముకుందలాల్.

గోపాలుడు తనపేరు చెప్పినాడు.

"మీ నివాసస్థానం?"

గోపాలుడు అదికూడా చెప్పినాడు.

"ఎన్నాళ్ళుంటారు?''

"మహా అయితే వారం''.

"ఓ చాలా అవకాశం ఉంది. అమృతసరంలో చూడవలసిన వన్నీ చూపిస్తాను. అమృతసరం చాలా ప్రసిద్ధమైన పట్నం. చరిత్ర మీకు తెలుసునా?''

తెలియదని గోపాలుడు తలతిప్పినాడు. ఇంతలో బండి పట్నము చేరింది. జన సమ్మర్దము హెచ్చింది.

,,అయితే చరిత్ర చెపుతాను వినండి". అని ముకుందలాల్

బడిపిల్లవాడు పాఠము అప్పగించినట్టు ఇలా చెప్పినాడు. „ఈపట్నం కట్టకముందు దీనిమధ్యభాగంలో పాతకోనేరు ఉండేది అమృతసరస్సని. అక్బరుషా ౧౫౭౭ సంవత్సరములో గురురామదాసజీకి ఈకోనేరు నాలుగువైపుల భూమి దానం చేసినాడు. గురుజీ కోనేటిమధ్యమందిరం కట్టించి అందులో (గ్రంథసాహేబ్) పవిత్రగ్రంథాన్ని పూజించేవాడు. అనేకమంది సాధువులు, మహాత్ములు చూడడానికి వచ్చి అక్కడే నివాసం చేసేవాళ్ళు. ఈవిధంగా కోనేటిచుట్టూ పట్నం పెరిగింది. ౧౭౬౧ సంవత్సరములో అహ్మదుషా దురానీ వచ్చి సిక్కులను కొట్టి, ఫిరంగులతో మందిరంగోడలు పగలగొట్టి పూజాస్థానంలో గోవులను కోశాడు”. ముకుందలాల్ నాంరాం అని కిటికీలోనుంచి బయటికి ఉమ్మివేశాడు. „సిక్కులు మళ్ళీ మందిరం కట్టి పట్నం వృద్ధిచేశారు. ౧౮౦౨ సంవత్సరంలో రంజిత్‌సింగు మహారాజు మందిరానికి బంగారపుపూత పూయించి, పట్నానికి ఉత్తరదిక్కున గోవిందగఢఖిల్లా కట్టించి, నాలుగువైపులా గోడకట్టించాడు. ఇంగ్లీషువాళ్ళు గోడబద్దలు కొట్టించారు.”

ఈచరిత్ర ముకుందలాల్ చెప్పేపద్ధతికి నవ్వువచ్చి గోపాలుడు „ఎక్కడ నేర్చుకున్నారు ఈకథ?” అన్నాడు.

„పండాలదగ్గర విన్నది విన్నట్టుగా చెప్పాను. యాత్రికులు వస్తే పండాలంతా ఇలాగే చెప్తారు.” పండాలు

కథ ఇలా చెప్పడమే కాక గోవధసంగతి వచ్చినప్పుడు రామనామము ఉచ్చరించి ఉమ్మివేస్తారని కూడా గోపాలుడు తెలుసుకొన్నాడు. బండీ జనసమ్మర్ధము తక్కువగా ఉన్న చోటికి చేరుతున్నది. ఎండ హెచ్చి రాజమార్గముమీదనూ ఇండ్లమీదనూ ప్రతిఫలించి కళ్ళు మిరుమిట్లు గొలుపుతున్నది.

బండి ఆగింది. రెండంతస్తుల ఇటికమేడ కనబడ్డది. దాని వెలపల చెక్కనున్నము అక్కడక్కడ రాలిపోయి నల్లగా ఉన్నది. ముకుందలాల్ దిగి వాకిలిగుమ్మము కొట్టి పండాజీ, పండాజీ అని కేకవేసినాడు. మహాకాయుడైన బ్రాహ్మడు వచ్చి తలుపు తీసినాడు. ముకుందలాల్ అతనితో కొంచెము మాట్లాడి గోపాలుని దగ్గిరికి వచ్చి "బాబూ, ఇల్లు ఖాళీగా ఉంది. వచ్చి చూడండి" అన్నాడు.

గోపాలుడు లోపలికి వెళ్ళి చూచినాడు. మంచిదొడ్డి మధ్యన బొడ్డుకట్టిన భావి. కిందివైపున మూడుగదులు, వంటయిలు. వంటచెరుకు పెట్టేగది పైన రెండుపడకగదులు. పంఖా ఉన్నది. పైఖల్‌ఖానా ఉన్నది, ఒకమేజా, కొన్నికుర్చీలు చూచి గోపాలుడు సమ్మతించి "అద్దెయెంత?" అనఅడిగినాడు.

ముకుందలాల్ ముఖము చిట్లించి "చాలా అద్దె తీసుకుంటారు. కలకత్తానుంచి ఉమ్రరాములు వస్తే ఇక్కడే దిగుతారు. రోజుకు రూపాయిన్నర" అన్నాడు.

గోపాలుడు పరేనని తనసామానులు బండిలోనుంచి దింపించాడు. అవన్నీ వచ్చాక వంటమనిషిని, నౌకరును తీసుకు రమ్మన్నాడు.

"ఎందుకుతీసుకురాను బాబూ? అన్నీ చక్కగా నప్పయి చేస్తాను. మంచివంటమనిషి మిఠాయీలు కూడా చేస్తాడు— మనచేతులో ఉన్నాడు. కాని, మీరు బంగాళాదేశమునుంచి వచ్చారు. మీతో ఒకసంగతి చెప్పుతాను. ఇక్కడి వంటవాళ్ళు చేపలు వండలేరు. అన్నిరకాల కూరలూ వండుతారు. పిట్టలు వండమంటే వండుతారు. ఏదివండమంటే అది వండుతారు. చేపలు మట్టుకు వండలేరు. మీకు ఏదితినాలని కోరికఉంటే అది చేయిస్తాను."

"మరి నౌకరో?"

"నౌకరును కూడా తీసుకువస్తాను." ముకుందలాల్ గో[illegible]నకటి దగ్గర రూపాయలు తీసుకొని బజారులో వస్తువులు కొ[illegible]దుకు ? కీ, నౌకరును తీసుకొన రావడానికీ వెళ్ళినాడు. గోపాల సామానులు చక్కగా ఉంచవలసినచోట్ల ఉంచినాడు.

మహాకాయుడైన సేవకుడువచ్చి ముకుందలాల్ తనను [illegible] నాడని చెప్పినాడు. గోపాలుడు నూతిదగ్గర కూర్చుని [illegible]రు నీళ్లుపోస్తుంటే స్నానముచేసినాడు

క్రమముగా సామగ్రిలు, వంటమనిషిని తీసుకువచ్చినాడు ముకుందలాల్. త్వరలోనే వంట ప్రారంభమయినది.

...కూడా ఇక్కడే వంటచెయ్యమని చెప్పండి బాబూ ... అన్నాడు గోపాలుడు.

"బాబూ, నేను స్నానంచెయ్యాలి. పూజచేసుకోవాలి. చాలా అవశిష్టాలున్నవి. వాటికంఅయితే ఇంటిదగ్గర భోంచేస్తాను."

"మీయిల్లు ఇక్కడికి ఎంతదూరము?"

"దర్బారు సాహేబ్ దగ్గర."

"మంచిది. సాయంత్రం రండి."

"మంచిది బాబు. సాయంత్రం వచ్చి మీకు పట్నం చూపించి వెళ్ళుతాను."

"సాయంత్రం పట్నం చూడడానికి తీరికలేదు. సబుజీబాగు ...రిగిన మనిషి ఉన్నారు. అక్కడికి పోవలి."

...లాల్ తలఆడిస్తూ "చిత్తం బాబూ. మీరు భోజ..., కాస్త నిద్రపొండి. నౌకరువచ్చి పంఖాలాగుతా... నేను వచ్చి సాయంకాలము మిమ్మలిని సబుజీబాగుకు ...తాను" అనిచెప్పి సెలవుతీసుకొన్నాడు.

...ప్రయాణపు బడలిక తీర్చుకోడానికి గోపాలుడు ...నానంతరము మంచము మీద వెన్ను వాల్చినాడు. ...రోజులనుంచీ జరుగుతున్నవిశేషాలన్నీ అతనికి జ్ఞప్తికి వచ్చినవి.

తండ్రితో ఎడబాటు, తల్లిదగ్గర సెలవు, వంగ..ఱు విడి చప్పున పంజాబుకు ప్రయాణము, ఏకోరికతో విరోనము అనేకము త్యజించినాడో ఆమె లభిస్తే లోపము తీరుంద

## ౨౭

గోపాలుడికి మెళుకువ వచ్చేసరికి అస్తమానముయింది. సూర్యకాంతి ధూసరవర్ణము ధరించింది. రెండురోజుల ప్రయాణపు బడలికచేతనూ, నిద్రాహారాలు సరిగా లేకపోవడము చేతనూ గోపాలుడు గాఢనిద్ర పోయినాడు. అతనికి చప్ప మెళుకువ వచ్చినప్పుడు ఒకటి రెండు నిమిషాలదాకా ... సంగతులు ఏవీజ్ఞాపకము రాలేదు. అందాకా ... సాయంసంధ్యను ఉషస్సు అనుకొన్నాడు.

ఇంతలో కిటికీగుండా పెద్దనవ్వు, గంజాయిఘాటు గదిలో ప్రవేశించినవి. వెంటనే అతనికి అంతా తెలిసింది. ... ధ్వని ముకుందలాలుది. అతను కింద పండాతో కబు తున్నాడు.

గోపాలుడు బయలుదేరడానికి సిద్ధమయి ముకుందలాలు పిలిపించినాడు. స్టేషనులో అతను కనపడ్డప్పటి మలినవేష

తే.   స్తా బయినాడు. నెత్తిమీద పాతటోపీకి కుసుంబా వన్నె పాగడీ; ఒంటిమీద పంజాబీ అంగీ; ధోవతికి పెద్దకుచ్చెళ్లు. ముకుందలాల్ వచ్చి రొప్పుతూ గంజాయి కంపు కొట్టుకొంటూ "బాబుజీ! బయలు దేరుతారా?" అన్నాడు.

గోపాలుడు అతన్ని ఎగాదిగ చూచి "అవును. ఒకసారి సబుజీ బాగ్ వెళ్ళవలె. ఎంతదూరం ఇక్కడికి?" అన్నాడు.

"సబుజీ బాగు పెద్దపేట భూపేంద్రబాబుగారిల్లు ఇక్కడికి రెండు మైళ్ళుంటుంది."

భూపేంద్రుడిపేరు విని గోపాలుడు ఆశ్చర్యపడ్డాడు. "మీకు ఎవరు చెప్పారు నేను భూపేంద్రబాబుగారింటికి వెళుతానని?"

ముకుందలాల్ చిరునవ్వునవ్వి „బాబుగారికి అక్కడ వివాహమవుతుందని తెలిసింది. పెళ్ళింటికి వెళుతున్నానని కాస్త మంచిబట్టలు కట్టుకు వచ్చాను." అని సిగ్గుతో వినయపూర్వకముగా తన పగిడీ కేసి వేలితో చూపినాడు.

గోపాలుడు అతని వైఖరి చూచి నవ్వి „మీకు పెళ్ళిపిలుపు వచ్చిందా!" అన్నాడు.

„ఇంతవరకూ పిలుపు రానిమాట వాస్తవమే. కాని భూపేంద్రబాబుగారింట్లో చీమ చిటుకు మన్నా నాకు పిలుపు వస్తుంది."

„అయితే ఈసారికూడా వస్తుందనుకొంటాను. మంచిది. ఈ

సారి వచ్చితీరాలి. బండీ పిలుచుకు రాగలరా!

ముకుందలాల్ వెళ్ళినాడు. ఈనగరము బెంగాలీ నగరు హిందూస్తానీని చూస్తే గోపాలుడికి చాలా వింతగా ఉన్నది. బండిలో కూర్చున్న తర్వాత గోపాలుడు అతని కష్టసుఖాలన్నీ చెప్ప మన్నాడు. ముకుందలాల్ పండాలు మంచివాళ్లు కారని చెప్పాడు. చాలా సంవత్సరాలనుంచీ తాను ఈ మోస్తరుగా కాలము గడుపుతున్నా నన్నాడు. బెంగాలీలు వస్తే తననే పిలుస్తారని పండాలకు కన్నెర్ర అన్నాడు. అందుకనే వాళ్లు సంవత్సరానికి పదకొండురూపాయలు లైసెన్సు కట్టించారట. పూర్వము పైసా కూడా లైసెన్సు ఉండేదికాదట. పండాలు తనను చాలా వేధిస్తారు అని చెప్పినాడు.

చూస్తూఉండగానే బండీ గమ్యస్థానము చేరింది. మరునాడు ఉదయము ఇంటికి వస్తానని గోపాలుడు ముకుందలాలును పంపివేసినాడు. అప్పటికింకా భూపేంద్రుడు కచ్చేరీనుంచి యింటికి రాలేదు. వసారాలో కూర్చుని గదాధరుడు "గుడుగుడు" పీల్చుస్తున్నాడు. రాజలక్ష్మి అక్క పిల్లలతో ఆడుకొంటున్నది. గోపాణ్ణి చూచి "ఓహో, మంత్రిమహాశయులు వచ్చారే!" అంటూ లోపలికిపరుగెత్తింది.

గదాధరుడు గోపాలుని సాదరముగా కూర్చోబెట్టి, అతను ఎప్పుడు వచ్చిందీ, ఎక్కడదిగిందీ అడిగినాడు. ఆ క్షేమము కలగ లేదుగద? అబ్బా, చాలాదూరప్రయాణము! ఆహారా

దులు సరిగా లేకుండా రెండురోజులు జైలులో ఉండవలెనే. గదాధరుడికి నల్లమందు అభ్యాసమున్నది. కాసిని పాలు తాగితేగాని ప్రాణాలునిలవవు. బండీలో ఏమైనా కాసిని మంచిపాలు దొరికినవా? ఇలాటి ప్రశ్నలన్నీ అడిగినాను. రావల్‌పిండి వెళ్ళకుండా అమృతసరములో దిగడానికి కారణమేమిటని గోపాలుడడిగినాడు.

"కాంతి బాబుగారికి ఈసంగతి తెలిస్తే రావల్‌పిండికి వచ్చి విఘ్నం చేస్తారని ఈయేర్పాటు చేశాను. జాగ్రత్తవల్ల నష్టంలేదుగదా?" అన్నాడు గదాధరుడు.

తర్వాత అమృతసరము మాటవచ్చింది. తనకాపట్నము చాలా బాగున్నదన్నాడు గదాధరుడు.

ఆ రెండురోజుల్లో తాను చాలావిషయాలు చూచాడట. ఆ ఉదయమే 'గురు దర్బారు' చూచాడట. కోనేటిమధ్య దర్బారు మందిరము. నీటిమీద కట్టిన చలవరాతివంతెన మీదుగా మందిరములోకి వెళ్ళవలెనట. బంగారవుపూత పూసిన శిఖరము ఉన్నదట. లోపల ఉచ్చైస్స్వరముతో 'పవిత్రగ్రంథము' గురువులు చదువుతారట. అమృతసరము నుంచి వెళ్ళేలోగా గోపాలుడు మందిరము తప్పకుండా చూడవలసిందట.

కొంతసేపటికి భూపేంద్రుడు ఇంటికి వచ్చినాడు. అతను పొట్టివాడు. ఆటే వయస్సులేదు. శరీరము కొంచెముస్థూల

ము. గోపాలుణ్ణి చూచి అతను స్వాగతమని "కొంచెం శ్రమించండి. ఇంట్లోకి వెళ్ళి చొక్కాలు తీసివేసివస్తాను" అని వెళ్ళినాడు.

త్వరలోనే ఉద్యోగివేషము తీసివేసి భూపేంద్రుడు చిలుములో నిప్పులు వేసి ఊదుతూవచ్చి గదాధరుడితో "మహాశయా, ఒకదమ్ము పీలుస్తారా?" అన్నాడు.

ఆయన ధూమపానము చేస్తుంటే భూపేంద్రుడు గోపాలుడితో "నవగోపాలబాబూ, ఇల్లు ఏలాకనుక్కున్నారో చెప్పండి" అన్నాడు.

గోపాలుడు మార్గదర్శి వృత్తాంతము యావత్తూ చెప్పినాడు. "ముకుందుడు మిమ్మలిని సరిగా కనిపెట్టాడన్నమాట. నేను చెప్పాను కాదూ చాటుర్జీమహాశయా? వీరన్నారు—మీరు ఎప్పుడు వచ్చేదీ తెలియదు, ఏబండికి వచ్చేది తెలియదు; వస్తే ఎక్కడ దిగుతారో, మన యిల్లు ఎలా కనుక్కుంటారో అని" నేనన్నాను—విచారము వద్దు మహాశయా. స్టేషనులో ముకుందలాల్ ఉంటాడు. తిన్నగా తీసుకువస్తాడు. బెంగాలీలు ఎవరు దిగినా పట్టి తీసుకువస్తాడు. మిమ్మలిని చూచి మొదట ఏమన్నాడు? బాబూ, నేను బెంగాలీని అనలేదూ?"

గోపాలుడు నవ్వి "ఇలాగే" అన్నాడు." ఈమాటలతనికి

రోకంటి పాట అనుకొంటాను. వెర్రివాడు! కాయస్థుణ్ణి అన్నాడు” అని చెప్పినాడు.

“అతని తండ్రిమాత్రం కాయస్థుడే. తల్లి ఇక్కడి గొల్ల మనిషి.”

“ఆలాగా, అయితే అతనికి నావివాహంసంగతి ఎలా తెలిసింది?”

“అతనికి అన్నిసంగతులూ తెలుస్తవి. మనిషి గెజెట్ మోస్తరు”

“అతన్ని వివాహానికి పిలుస్తారా?” “పిలవకపోతే బతికే వీలుందా? చాలా అభిమానపు మనిషి. నేను బెంగాలీని. బీదవాణ్ణి అని నాజాతిసహోదరులు దగ్గిరికి రానియ్యరు అంటాడు. అతన్ని తప్పకుండా పిలవాలి.”

గదాధరుడు చిలుము భూపేంద్రుడికిచ్చినాడు. భూపేంద్రుడు తనమిత్రుడి తండ్రిమీది గౌరవముచేత దూరముగా వరాండాలో నిలుచుని పొగపీల్చినాడు.

# ౧౬

"భూపేన్ దాదా, నానమ్మ నిన్ను పిలుస్తున్నది." బయటి నుంచి రాజలక్ష్మి చెప్పింది.

"రాజూ, లోపలికి రావూ? ఎవరో వచ్చారు చూడు."

వెంటనే రాజలక్ష్మి చాలా సిగ్గుపడుతూ వచ్చింది. గోపాలుడు చప్పుడు కాకుండా వెళ్ళి తటాలున పట్టుకొని పిల్లను లోపలికి తీసుకు వచ్చినాడు.

భూపేంద్రుడు లోపలికి వెళ్ళి వచ్చి "నవగోపాలబాబూ, మా నానమ్మ మిమ్మల్ని చూడాలను కొంటున్నది. ఒక్కసారి ఇంట్లోకి రావాలి" అన్నాడు.

గోపాలుడు లేచి భూపేంద్రుడి వెంట బయలుదేరినాడు. నడుస్తూ భూపేంద్రుడు గోపాలుడి చెవిలో "ఆమెకు ప్రణామం చెయ్యడం మరిచి పోయేవు! ఆవిడకు కోపం వస్తుంది" అన్నాడు. వరాండా మెట్లు ఎక్కి గోపాలుడు ఒకగదులోకి వెళ్ళినాడు. అక్కడ సువర్ణ ఛాయ కల వృద్ధాంగన నిలుచుని చిరునవ్వుతో "ఓహో, మంచివాడే అందమైన వాడే. పచ్చటివాడే" అన్నది.

గోపాలు డామెకు ప్రణామము చేసినాడు. ఆవిడ "ఏ మని ఆశీర్వచనము చెయ్యను నాయనా! రాజరాజేశ్వరుడవు కమ్మని దీవించనా? అదికాదు. అంతకంటె మంచిదీవన ఉంది. ఆ దీవన ఇస్తాను" అన్నది.

"మంచిది ఉండగా తక్కువది యెందుకు గోపాలబాబుకు? మంచిదే ఇయ్యి" అన్నాడు భూపేంద్రుడు.

"మంచిది. అయితే తమకు మగడవు కా!" భూపేంద్రుడు పెద్దపెట్టున నవ్వి "అందరూ ఇదేవిధంగా వరదానం చేస్తే ఈకలికాలంలో కూడా మగవాళ్ళ కెవ్వరికీ నష్ట ముండదు" అన్నాడు.

ఆవిడ లేని కోపము తెచ్చుకొని భూపేంద్రుడి చెవిమెలివేస్తూ "నాకు కోపం తెప్పించావంటే నీభార్యకు కొత్తవరదానం చేస్తాను" అన్నది.

భూపేంద్రుడు నవ్వుతూ "మీరు కూచోండి గోపాలబాబూ, మిమ్మలిని ఈవిడ అమలులో ఉంచి వెళ్ళుతాను. బయట గదాధరబాబుతో ఫలహారం సంగతి చెప్పివస్తాను" అని అక్కడినుంచి వెళ్ళినాడు.

గోపాలుడు బలవంతాన ఫలాహారానికి కూర్చున్నాడు. ఆ విడ అతని దగ్గరగా కూర్చుని "మంచిది. ఇద్దరమూ ఒంటిరిగా ఉండగా మనసులో మాటచెపుతాను. ఇదివరలో పెళ్ళి చేసుకున్నావా? ఇదే మొదలా?" అని అడిగింది.

"ఇదే మొదలు"

"ఆనంగతి నీముఖం చూస్తేనే తెలుస్తున్నది. పెళ్ళి చేసు కుంటే ఏమేమి కావలెనో తెలుసునా?"

గోపాలుడు జిలేబి తింటూ "తెలియదు. మీరు చెప్పండి" అన్నాడు.

"మంచిది. మొదట ఒకపాగా కావాలి. నెత్తిమీద పెట్టుకు రావాలి. జలతారు జోడు కాలికి తొడుక్కోవలి. కలకత్తా నుంచి వచ్చావని విన్నాను. ఇవన్నీ తెచ్చావా?"

"తేలేదు."

ఆవిడ చాలా కోపము తెచ్చుకొని "మంచివాడవు! అయితే నీకు పెళ్ళికాదు. దమకు ఇంకో వరుణ్ణిచూస్తాం" అన్నది.

"అదేమి, పడవ గంగమధ్యకు తెచ్చి ముంచకండి. మిమ్మ లిని శరణు చొచ్చాను. రక్షించండి!"

"నీకు భక్తి ఉంటే రక్షించగలము."

"చాలాభక్తి! ఏమి ప్రమాణం చూపెట్టమంటారు? "

"అయితే ఇవేవీ పారవెయ్యకుండా తిను. బంగారుకొండ లాగా!"

గోపాలుడు తనభక్తికి నిదర్శనము చూపించినాడు.

ఆమె సంతోషించి "జల్తారు జోడు ఇక్కడే దొరుకుతుంది. పాగాకూడా దొరుకుతుందిలే. సిరస్తాదారుగారి అబ్బాయి

పెళ్ళి అయింది. ఇక్కడే పాగా తయారు చేయించారని విన్నాము. కనుక్కొని కబురు తెప్పిస్తాను." అన్నది.

"ఇంకా ఏమేమి కావాలి?"

"పసుపు, చీరెలు వగైరా తెచ్చావా?"

"తేలేదు. ఇక్కడ దొరుకుతవా?"

"దొరుకుతవి. మంచి పట్టుచీరె లున్నవి. పసందుచేసి తెస్తే."

"కానేటప్పుడు మీసహాయం కావాలి. చీరెలు తెచ్చి చూపిస్తాను. మీరు పసందు చేతురుగాని."

ఆవిడ సమ్మతించి "మరొక మాట. నే నంతా విన్నాను. వివాహ మైనతర్వాత ఎక్కడుంటారు?" అన్నది.

"ఇంకా నిర్ధారణ చెయ్యలేదు. ప్రస్తుతం పంజాబులోనే ఎక్కడో ఉంటాను."

"నామాట వింటావా?"

"ఏమిటో చెప్పండి."

"ప్రస్తుతం అమృతసరంలోనే ఉండు. మంచిపట్నం. పన్నెండేళ్ళనుంచీ ఉంటున్నాను. నాకు తెలుసు."

గోపాలుడు కొంచె మాలోచించి "సరే. ప్రస్తుతం ఇక్కడే ఉంటా" నన్నాడు.

"నీ వున్న ఇల్లు ఎలాంటిది?"

"ఒకమోస్తరు. ఫర్వాలేదు."

"సామానులు వస్తా రా ఉన్నాయా?"

"కొంతవరకు."

"అయితే అదే మంచిది. రమ పారాణికాళ్ళతో యాత్రికు లు దిగే ఖాళీయింటి గడప తొక్కదు. ఇల్లు కొంచెం శృంగారించాలి."

గోపాలుడు ఆమె కలుపుగోలు తనానికీ అమాయికత్వానికీ ఆశ్చర్యపడి కొంచెము సాహసించి "మీరు ఈరెండు రోజు లూ మాయింటికి వచ్చి అన్నీ చూడండి. ఏది చెయ్యా లంటే అది చేస్తాను. మీఆజ్ఞ అయితే రేపుదయం బండిలో మిమ్మల్ని తీసుకువెళ్తాను. సాయంత్రం మళ్ళీ దిగబెట్టుతాను. ఎల్లుండి కూడా అలాగే చేస్తాను" అని ప్రస్తావించినాడు.

ఆమె ఆలోచించి కొంచెము గాంభీర్యముతో "నాకు ప్రాణ భయ మేమీ ఉండ దను కొంటున్నావా?" అన్నది.

"ఏమి?"

"నన్ను తీసుకు వెళ్ళుతావు. నీభార్య నన్ను పూర్తిగా విడిచి పెట్టుతుందా? నా భర్తను రోజల్లా బేదఖలుగా అట్టే పెట్టావని జగడం చేసి నన్ను కొడితే!"

"దఖల్ కాకముందే బేదఖల్ ఎలా అవుతుంది? ఈరెండు రోజులూ నన్ను నిశ్చింతగా దఖల్ చేసుకోండి."

ఈవిధముగా చమత్కార సంభాషణ అయిన తర్వాత, గోపాలుడు మరునా డుదయము ఆమెను తీసుకొని వెళ్ళేలాగ నిర్ధారణ అయింది.

# ౧౭

రమా గోపాలుల వివాహము జరిగింది. రమ తండ్రి మొదలైనవారు స్వదేశము వెళ్ళారు. గోపాలుని బలవంతము మీద లక్ష్మిని రమ ఉపచారముకోసము ఉంచివెళ్ళినారు. అమృతసరము అతనికి చాలా బాగున్నది. గోపాలుడు కొంతకాలము అక్కడనే ఉండామనుకొని ఇల్లు నెలఅద్దె చొప్పున తీసుకొన్నాడు.

వివాహము తరువాత వారమురోజులు కొత్త దంపతులు పట్నము చూడడముతో సరిపోయింది. ఉదయమే స్నానముచేసి, ఫలాహారము ముగించుకొని, బండి యెక్కి ఇద్దరూ పట్నము చూడబోయేవారు. ముకుందలాల్ కోచిబాక్సు మీద కూర్చునే వాడు. దర్బారుమందిరము, రకరకాల మఠాలు, శాలువల కార్ఖానా, నర్కారుతోట, గోవింద గురు ఖిల్లాభాగములు, ఇవన్నీ ఒక్కొక్కటే చూచారు. గోపాలుడు ఇదివరలో పశ్చిమదేశము వచ్చినాడు. రమాసుందరి బంగాళాదేశము విడిచి రావడానికి ఇదే మొదలు. రకరకాల దృశ్యాలు చూచి రమ ఉప్పొంగి పొయ్యేది. ఈరోజుల్లో ఆమె సాహచర్యమువల్ల, ఆమె తరుణహృదయ

మాధుర్యమువల్ల, గోపాలుడు తన బంధువియోగ విచారము ఇంచుమించుగా మరిచిపోయినాడు.

వివాహమయిన వారము రోజులకు ఒకనాడు సాయంత్రము రమా గోపాలులు పడకగది పక్కన చల్లని వసారాలో కూర్చుని కబుర్లు చెప్పుకొంటూ ఉన్నారు. గదాధరుడు స్వగ్రామము చేరినట్లు ఆ ఉదయమే ఉత్తరము వచ్చింది. ఇల్లు కాలిపోయిన సంగతి వివరముగా వ్రాసి రమకు చెప్ప వద్దన్నాడు. తెలిస్తే దూరదేశానఉన్న పిల్ల వృథాగా బాధ పడుతుంది అన్నాడు. ఈ ఒక్క సంగతీ మినహాయించి ఉత్తరములో తక్కిన సంగతులన్నీ గోపాలుడు రమకు వినిపించినాడు.

రమ తండ్రి ఉత్తరము మాటిమాటికీ చేతితో పట్టుకొంటూ “నాకు చదవడం చేతనయితే ఎంత బాగుండేది!” అన్నది.

“రమా, రాయడమూ చదవడమూ నేర్చుకుంటావా?” అన్నాడు గోపాలుడు.

రమ చాలా ఉత్సాహముతో అంగీకారము తెలిపింది. గోపాలుడు “అయితే ఈవేళే మొదలు పెట్టుదాము” అన్నాడు. శిశుబోధ పుస్తకము ఎక్కడ దొరుకుతుంది? వంగదేశములో చిన్నపిల్లల్లో కూడా ప్రతిరోజూ దొరికే పుస్తకము పంజాబులో ఎంతప్రయత్నించినా దొరకలేదు. అయితే నూతనోత్సాహము విఘ్నాన్ని లెక్కచెయ్యలేదు. గోపాలు

డు పెట్టిలో నుంచి కాలి జోడుకు చుట్టిన బెంగాలీవార్తా పత్రిక ముక్కలు వెతికి తెచ్చి, అందులో ఒక్కొక్క అక్షరమే రమకు చూపించినాడు. ఆసాయంత్రము రమకు కవర్గ చవర్గలలో అక్షరా లన్నీ కత్తిరించి తయారు చేసినాడు.

మర్నాడు ప్రథమపాఠ పుస్తకము కోసము గోపాలుడు భూపేంద్రుడి దగ్గరికి వెళ్ళినాడు. "ఇక్కడ బంగాళా ప్రథమ పుస్తకం దొరకదు. కలకత్తానుంచి తెప్పించడం తప్ప వేరే ఉపాయం లేదు" అని భూపేంద్రుడు చెప్పినాడు. అందుమీద నానమ్మ "నీభార్య కఖలు నేర్చుకుంటుందా? నేను దానికి ఉపాయం చెపుతాను. నాదగ్గర శిశుబోధ పుస్తకం ఉన్నది. అందులో కఖలు అన్నీ విడివిడిగా ఉన్నవి. ప్రస్తుతం అది తీసుకు వెళ్ళి కలకత్తా నుంచి పుస్తకం తెప్పించు. నీపుస్తకం వచ్చాక శిశుబోధ నాకు ఇవ్వాలి సుమా. అందులో ఉన్న గంగాస్తవం మరెక్కడా దొరకదు" అని చెప్పింది.

పుస్తకము తీసుకొని గోపాలుడు చాలా సంతోషించాడు. ఆపుస్తకము చూచేసరికి అతనికి తల్లి సంగతి జ్ఞాపకము వచ్చింది. ఆమె పూజామందిరములో చౌకీమీద నిత్యకర్మ పుస్తకాలతోపాటు శిశుబోధ పుస్తకము ఒకటి భద్రముగా పెట్టి ఉండేది. అది ఈగంగాస్తోత్రము కోసమే.

ఇంటికి వెళ్ళి ఆసాయంత్రమే గోపాలుడు తల్లికి ఉత్తరము

వ్రాసినాడు. అతను వ్రాస్తూఉంటే రమ పక్కన నిలుచున్న
ది. ఆమెకు వచ్చిన అక్షరాలు అందులో గుర్తు పట్టడానికి
శ్రద్ధతో చూస్తున్నది.
గోపాలుడు ఉత్తరము పూర్తిచేసినాడు.
"ఎవరికి ఉత్తరం?" అన్నది రమ. గోపాలుడు పరధ్యాన
ములో "మాఅమ్మకు" అన్నాడు.
రమ కొంచెము విచార సూచికముగా "మీఅమ్మకా?"
అన్నది. మీ అనే అక్షరము నొక్కిపలికింది.
గోపాలుడు వెంటనే భార్యముఖముకేసి చూచి, విశాల
నేత్రాలలో ఆమె భావము గ్రహించి "మన అమ్మకు"
అని సాదరముగా చెప్పినాడు.

౨౫

రమాదేవి విద్యాభ్యాసము వేగముగా జరుగుతున్నది. కల
కత్తానుంచి ఆమెకోసము చిన్నవి, పెద్దవి, సచిత్రము, పద్య
ము, గద్యము; ఎరుపు, నలుపు మొదలైన సిరాలతో అచ్చు
వేసిన పుస్తకాలు అనేకము వచ్చినవి. అందులో అందముగా
బైండుచేసిన రెండు నోటుబుక్కులు కూడా ఉన్నవి.

గోపాలుడు ప్రతిరోజూ తల్లిఉత్తరముకోసము ఎదురుచూస్తూ ఉండేవాడు. పదిహేను రోజులకు ప్రత్యుత్తరము వచ్చింది. ఆమె కోడలిని ఆశీర్వదించింది. యజమానికి చాలా కోపము వచ్చిందట. ఆయనయెదుట గోపాలుడిపేరు ఎవరూ ఎత్తడానికికూడా వీలులేదు. కుమారుడికి ఉత్తరముకూడా వ్రాయవద్దని ఆయన భార్యను మందలించాడట అయితే తల్లి చాటుగా స్కూలుపండితుడు హరారాధన చక్రవర్తిగారి ద్వారా ఉత్తరము పంపించింది. అందులో నూరురూపాయల నోటుకూడా పెట్టింది.

తల్లిఉత్తరము చదివి గోపాలుడు చాలా సంతోషించినాడు. ఆమెకు మళ్ళీ ఉత్తరము వ్రాసి హరారాధన చక్రవర్తిగారి పేర పంపినాడు. చిన్నకవరులో తల్లికి జాబుపెట్టి ఆకవరు పెద్దకవరులో ఉంచినాడు. ఆఉత్తరము స్వయముగా తన తల్లికి ఇవ్వవలసిన దని పండిత మహాశయుణ్ణి ప్రార్థిస్తూ వ్రాసినాడు.

రమ రెండవపాఠపుస్తకము చదువుతూ ఉన్నది. అచ్చు పుస్తకములో చాలా మాటలు ఆమె చదువుతుంది. రమ ఒకనాడు ఇంగ్లీషు పుస్తకము చూచి ఆశ్చర్యపడి అక్షరాల కేసి చూచింది. “ఇంగ్లీషు నేర్చుకుంటావా రమా ?” అన్నాడు భర్త.

"నేర్చుకుంటాను."

ఎవరినైనా ఉపాధ్యాయురాలిని ఏర్పాటు చేస్తే రమకు ఇంగ్లీషుతో పాటు కుట్టుపనికూడా నేర్పుతుంది, ఎంతో బాగుంటుంది అనుకొని గోపాలుడు భూపేంద్రునితో ఈసంగతి ప్రస్తావించినాడు. అక్కడి జనానామిషనులో ప్రయత్నిస్తే ఎవరైనా ఉపాధ్యాయిని దొరుకుతుంది అని తెలిసింది. మరునాడు గోపాలుడు జనానా మిషనుకు వెళ్లి ఒకరిని ఏర్పాటు చేసి వచ్చినాడు. ఆమె ప్రతిరోజూ సాయంకాలము ఒకగంట ఇంగ్లీషు, ఒకగంట కుట్టుపని నేర్పి వెళ్ళుతూ ఉండేది.

ఈవిధముగా అమృతసరములో రెండునెలలు గడిచినవి. గోపాలుడు ఉద్యోగము కోసము ప్రయత్నము చేస్తూ ఉన్నాడు. కలకత్తాలో పూర్వము తన కుపాధ్యాయులుగా ఉన్నవారికి ఉత్తరాలు వ్రాసినాడు. అందులో ఒకరు ఆశ కలిగించాడు. అయినా ఇంతవరకూ ఏమీ తేలలేదు.

రమ మిస్సెమ్మదగ్గర కుట్టుపని నేర్చుకొన్నా నేర్చుకోకపోయినా లక్ష్మివల్ల చాలా సంగతులు నేర్చుకొన్నది. చదువులో కూడా బాగానే పైకి వస్తున్నది. బంగాళీలో ఉత్తరము వస్తే చదివేశక్తి వచ్చింది. ఒకనాడు కమలాదేవిదగ్గరనుంచి ఉత్తరము వస్తే రమ దాన్ని చదివింది.

"నాయనా నవగోపాలా! నీజాబు చదివి చాలా సంతోషిం చాను. నీవూ కోడలూ సుఖంగా ఉన్నందుకు చాలా ఆనందము! మీనాయనగారికి ఇంకా కోపము తగ్గలేదు. వారి యెదుట నీపేరెత్తితే మండి పడుతున్నారు. ఇంకా కొన్నాళ్ళకుగాని శాంతించేలాగు కనబడదు. సందర్భం కనిపెట్టి మాట్లాడుతాను. కోడలు ఎలా ఉన్నదీ, చదువు దస్తూరీ ఏమాత్రముగా ఉన్నదీ తెలియ పరుచు. క్రైస్తవస్త్రీని చదువు చెప్పడానికి ఏర్పాటు చేసినందుకు చాలా నిరుత్సాహంగా ఉన్నది. వాళ్ళు మన దేవతలను నిందించి మనవాళ్ళను తమ మతంలో కలుపుకుంటారు. పోయినసోమవారం బారిసాల్ నుంచి దొడ్డమ్మ వచ్చింది. వాళ్ళ ఊళ్ళో కిరస్తానీ స్త్రీలవల్ల చాలా అనర్థకాలు వస్తున్నవట. మొన్న మహార్నవమిలో ఒక పెద్దమనిషి పదేళ్ళపిల్లను తీసుకుని దేవాలయానికి వెళ్ళాడట. ఆపిల్ల కిరస్తానీ బళ్ళో చదివిందట. ఆయన విగ్రహానికి నమస్కారం చేసి, పిల్లనుకూడా నమస్కారం చెయ్యమన్నాడట. ఆపిల్ల నమస్కారం చెయ్యను, మట్టిబొమ్మలకు చెయ్యను అన్నాదట. తండ్రి మొదట బుజ్జగించి తర్వాత మళ్ళీ చెప్పి చూచాడట. పిల్ల ఎంతమాత్రమూ వినలేదట. నన్ను నరికి పారేసినా సరే, బొమ్మకు దణ్ణం పెట్టనే పెట్టను అన్నదట. వెయ్యిమంది అక్కడ చూస్తూ నిర్వాక్కులు అయిపోయినారట. ఈసంగతి వార్తా పత్రికలో కూడా ఎక్కిందట.

కాబట్టి కోడలి చదువు తల్లకిందులు చదువుకాకుండా చూడు. ఒకవేళ మిస్సెమ్మ కోడలికి ఏసుక్రీస్తు మీద కీర్తనలు చెప్పితే, క్రీస్తు అనేమాటకు బదులుగా కృష్ణశబ్దం పెట్టించి పాడించు. ఏమీ తప్పులేదు. బారిసాలులో ఆడపిల్లలు ఇలాగే చేస్తారుట.

"కోడలి తలకట్టు పెద్దదా? జడ వేసుకోడం చేతవునా? ఫోటో తీయించి పంపించు. ఉభయులకూ ఆశీర్వచనాలు. భద్రంగా ఉండండి

శుభాభిలాషిణి

తల్లి."

ఈ ఉత్తరానికి చాలా ఆనందించి గోపాలుడు వెంటనే రమ ఫోటో తీయించి, పంపినాడు.

కొద్ది రోజులలో కలకత్తానుంచి మంచి కబురు వచ్చింది. గోపాలుడి పూర్వ గురువులలో ఒకరు వ్రాసారు. కాశ్మీర మహారాజుగారి పరివారములో ఒకకుర్రవాడికి మంచి ఉపాధ్యాయుడు కావలెనట. నెలకు రెండువందల రూపాయలిస్తారు. ఇష్టమైతే గోపాలుడు ఈపని అంగీకరించవచ్చు అని ఉత్తరము వచ్చింది.

గోపాలుడు వెంటనే అంగీకరించినాడు. త్వరలోనే నానమ్మ మొదలైన వారిదగ్గర సెలవు తీసుకొని, సకుటుంబముగా కాశ్మీరము బయలుదేరినాడు.

## ౨౯

కాశ్మీరము వెళ్ళడానికి చాలామార్గా లున్నవి. అందులో మరీకార్టు రోడ్డు అన్నింటికంటె చాలా బాగా ఉంటుంది. త్వరగా కూడా వెళ్ళవచ్చు ఈరోడ్డు రావల్‌పిండిలో ప్రారంభ మవుతుంది. అక్కడనుంచి టాంగాబండీ చేసుకొని శ్రీనగరము వెళ్ళవచ్చు. తొందర లేనివాళ్ళు బిరాముగా వరకూ టాంగాలో వెళ్ళి, అక్కడనుంచి ఝిలం నదిమీదుగా శ్రీనగరము చేరుతారు. ప్రయాణములో ఈభాగము మనోహరముగా ఉంటుంది. ప్రకృతిశోభ చాలా దర్శనీయము.

రావల్‌పిండిలో రెండురోజులు విశ్రాంతి తీసుకొని గోపాలుడు తెల్లవారు ఝామున భార్యతో, లక్ష్మితో బండి యెక్కినాడు. బండి కదిలింది. రమాసుందరి విచారగ్రస్తముగా ఉన్నది. అన్నగారిదగ్గర సెలవు తీసుకొన్నపుడు కన్నీరు కార్చింది. రెండుమూడు మైళ్ళు వెళ్ళినతర్వాత రెండుపక్కలా ఉన్న క్రొత్తక్రొత్త దృశ్యాలు మళ్ళీ ఆమెకు మనోవికాసము కలిగించినవి. ఇప్పుడు సస్యక్షేత్రాలు రెండువైపులా, పర్వత పంక్తులు దూరముగా ఎదటనూ కనబడుతున్నవి. "ఈకన

బడే కొండదగ్గిరికి వెళ్ళాక బండి కొండమీదికి ఎలా ఎక్కు తుంది?" అన్నది రమ.

"కొండమీదిగా రోడ్డున్నది. రస్తా సూటిగా కొండమీదికే వెళ్ళకుండా మెలికలు తిరుగుతూ వెళ్ళుతుంది" అన్నాడు గోపాలుడు.

రమకు తెలిసింది కాదు. గోపాలుడు జేబులో నుంచి 'గైడు' తీసి "శైలగ్రామం నుంచి మనం కొండ యెక్కడం మొదలు పెట్టుతాము — పదికోసులయిన తర్వాత. అప్పుడు చూస్తే తెలుస్తుంది" అన్నాడు.

బరాక్ వరకూ రోడ్డుమీద చెట్లనీడ దట్టముగా ఉన్నది. తర్వాత రోడ్డుపక్కల చెట్లు చాలా తక్కువ. ఎండ హెచ్చు తున్నది. రమాసుందరి ఉల్లాసము కొంచెము కొంచెముగా తగ్గడము ప్రారంభించింది.

చూస్తూ ఉండగానే శైలగ్రామము డాక్ బంగాళా దాటి పోయింది. అక్కడినుంచే చిన్నచిన్న గుట్టలు మొదలు. టాంగా వేగము తగ్గింది.

కొండ ఎక్కడము ప్రారంభించారు. మార్గానికి ఒక పక్క ఎత్తయిన కొండ, రెండవ పక్క ఇనపకటకటాలు. ఆతర్వాత లోవ కిందికి దిగుతుంది. రెండుపక్కలా చాలా పచ్చని చెట్లు. పదిగంట లయ్యేటప్పటికి టాంగా చత్వర మనే ప్రదేశము

చేరింది. అక్కడ గుర్రము మార్చారు. బండివాడు వేలుతో సమీపప్రదేశము చూపుతూ హిందీలో "బాబూ, ఇక్కడ అందమైన తోట ఉన్నది. మీరు విశ్రాంతి తీసుకో దలుచుకుంటే లోపలికి వెళ్ళవచ్చు" అని చెప్పినాడు.

ఆతోట చూడవలెనని రమ కుతూహలము కనబరిచింది. "అయితే పద. తోట చూతువుగాని. ఇక్కడ కొంచెం భోజనాలు చేసి బయలుదేరుదాము" అన్నాడు భర్త. రోజంతకూ సరిపోయే తినుబండారాలున్నవి వారి దగ్గర. అవి తీసుకొని ముగ్గురూ తోటకు బయలు దేరారు.

వాళ్ళకు చాలా ఆకలి వేసింది. మంచిచోటు చూచి ముగ్గురూ కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు చేశారు. గోపాలుడు సిగరెట్టు ముట్టించడానికి నిప్పుపెట్టికోసము జేబులో చెయ్యిపెట్టినాడు; దొరకలేదు నిప్పుపెట్టె. అంతట బండి దగ్గరకు వెళ్ళినాడు.

కంటికి కనపడుతున్నంతసేపు రమ అతనికేసి చూస్తూ ఉన్నది. కొంతసేపు విశ్రాంతి తీసుకొన్న తర్వాత వారంతా బండి యెక్కారు. అరగంటలో శైలగ్రామము వంతెన దాటి పోయింది. తరువాత కొండెక్కడము ఆరంభించారు. ఇంతవరకూ చిన్నచిన్న చెట్లు; ఇక్కడినుంచి పెద్దపెద్ద చెట్లగుంపులు మొదలు. మందవాయువు వీస్తున్నది.

దేవదారు వృక్షాలు కదులుతూ బాటసారులకు నమస్కారము చేస్తున్నట్లున్నవి. వాటికింద ఎండుటాకులు రాలినవి. టాంగా చప్పుడు విని ఒకటి రెండు జంతువులు ఎక్కడనుంచో కూస్తూ కొంచెము ముందుకు వచ్చి పరిమాణము లేని దూరాన నిలుచుని పరుగెత్తుతున్న బండి కేసి వింతగా చూచేవి. రెండు ఝాము లయింది. ఎండ చురుకులేక పోగా తగ్గిపోతున్నది. ఇంతలో బంగాళా కనపడ్డది. అక్కడ బండి అయిదు నిమిషా లాపి, గుర్రము మార్చారు. కిందుగా సమభూమి చాలా దూరము కనిపిస్తున్నది. గోపాలుడు నన్ను చూచి "మనం ఇప్పుడు నాలుగువేల అడుగు లెక్కాము" అన్నాడు.

టాంగా పైకి వెళ్ళినకొద్దీ చలి వేస్తున్నది. అంచె గుర్రము మార్చేచోట దిగి గోపాలుడు బండి వెనక కట్టిన పెట్టె తెరిచి కట్టు బట్టలు బయటికి తీశాడు.

కొంతసేపటికి వారిమార్గము రెండు చీలిక లయినది. బండి వాడు అక్కడి బంగాళా ఒకటి చూపి "ఇది సానివంక డాక్ బంగాళా. దక్షిణంగా ఈత్రోవ మరీత్ వెళ్ళుతుంది" అన్నాడు. టాంగా సమీపానికి రాగానే బట్లరు బంగాళా వసారాలోకి వచ్చి డ్రైవరు కేసి చూచి టీ తాగుతున్నట్లు అభినయించి

నాడు. బండివాడు "హుజూర్, చా కావలెనా?" అన్నాడు. "మూడు గిన్నెలు" అన్నాడు గోపాలుడు.

బండివాడు మూడు వేళ్ళు చూపేసరికి ఖాన్ సామా లోపలికి వెళ్ళినాడు.

త్వరలోనే వాడు పళ్ళెముతో బండిదగ్గిరికి వచ్చి నిలుచున్నాడు. అందులో మూడుగిన్నెలు వేడి తేనీరు, రొట్టెముక్కలు, వెన్న, చుట్టలూ ఉన్నవి. గోపాలుడు లెక్క పొరపాటు పడ్డాడు. లక్ష్మి తేనీరు తీసుకోలేదు.

తర్వాత బండి బయలు దేరింది. దక్షిణముగా మరీ పల్లమున్నది. దేవదారు చెట్లమధ్యనుంచి మరీ కంటోన్ మెంటు, పోస్టాఫీసు మొదలైనవి కనబడుతున్నవి.

ఆతర్వాత మామూలు ప్రకారకు అయిదుమైళ్లు కాగానే అంచెగుర్రాన్ని మారుస్తున్నారు. కోహాలా చేరేవరకూ డాక్ బంగాళాలు లేవన్నాడు బండివాడు. కోహాలాలో రాత్రి గడపడానికి గోపాలుడు అదివరకే యేర్పాటుచేసాడు.

మరీ దాటిన తర్వాత కొన్నిమైళ్ళవరకూ ప్రకృతి సౌందర్యము కనబడుతున్నది. అంతకంతకు పర్వతము మిత్రభావము వహించింది. రమ కునికిపాట్లు పడి లక్ష్మిసందిట తల ఆనించి నిద్ర పోయింది. వాళ్లు కోహాలా చేరేటప్పటికి

సూర్యాస్తమయ మయింది. పంజాబుకు కాశ్మీరానికి సరిహద్దులో ఉన్నది కోపతలా. అది చిన్నగ్రామ మయినా, అంగళ్ళు, పోస్టు టెలిగ్రాఫ్ ఆఫీసు ఉన్నవి. గోపాలుడు రాత్రి అక్కడ ఉండడానికి చిన్నయిల్లు అద్దెకు ఏర్పాటయింది. అక్కడ దిగి, వంట లయిన తర్వాత వారు భోజనాలు చేశారు. ఆ రాత్రి వారికి పట్టిన నిద్ర స్వర్గా యానము చెందిన అదృష్టవంతు లయిన బాటసారులకే లభిస్తుంది.

# 30

మరునా డుదయము లేచి, ఆరోజుకు కావలసిన లుచీ, మిష్టాన్నము ముఖ్యమైన వస్తువులు తయారు చేసింది లక్ష్మి. భోజనా లయినాక, పదిగంటలవేళ టాంగా బయలుదేరింది.

కోహలానుంచి బరాములా నూరుమైళ్లుంటుంది. వెనకటి రోజు బడలిక ఇంకా పూర్తిగా పోలేదు. అందుచేత ఆరోజు మార్గమధ్యములో ఛాగోతీడాన్ బంగాళాలో విశ్రాంతికి ఏర్పాటు చెయ్యదలుచుకొన్నాడు గోపాలుడు.

రెండు జాములు కాకముందే దులాయిలో చిన్న బంగాళా సమీపించారు. లేడీ రిపన్ దీనికి "హనీమూన్ కాటేజీ" అని పేరు పెట్టింది.

మధ్యమధ్య ఝీలంనది ఎడమవైపుగా కనబడుతూ వచ్చింది. టాంగా సొరంగము గుండా పోతూఉండేది. వెలుతురు తగ్గేది, మళ్ళీ ఒకటిరెండు నిమిషాలలో బండి బయటికి వచ్చేది.

క్రమముగా డోమల్ దాటిపోయింది. అక్కడ కృష్ణగంగ ఝీలములో కలుస్తుంది. కొంతసేపటికి దూరాన ముజఫరాబాద్ మేడల కొనలు చెట్లసందులలోనుంచి కనపడ్డవి.

దొమల్ తర్వాత పొట్టిగా గుబురుగా ఉన్న ఒకరకము చెట్లు కనపడినవి, అవి చినార్ వృక్షాలని బండివాడు చెప్పినాడు. కొండపల్లెలదగ్గరగా ఝీలంనదిమీద తాళ్ళవంతెనలపైగా మనుష్యులు నది దాటి పోతున్నారు. నదివెడల్పు తక్కువ, ప్రవాహవేగము ఎక్కువ. ఏటికి రెండుపక్కలా రెండు స్తంభాలు పాతి, వాటికి తాళ్లుకట్టి ఉంటవి. ఉట్టివంటిదాని లో మనిషి కూర్చున్నాడు. ఆఉట్టి పైన తాళ్ళకు వేలాడ దీసి ఉన్నది. దాన్ని విడిచి పెట్టితే కొంతదూరము పోయిం ది. అవతలపక్కమనిషి తాడు లాగితే ఉట్టి అవతలి ఒడ్డుకు పోయింది బాటసారి దాటవేసినవారికి ఏదో కాస్త డబ్బు ఇచ్చి పోయినాడు.

అపరాహ్ణవేళ టాంగా ఛాగోతీ చేరింది. అక్కడ బంగళా లో భోజనాలు చేసి రాత్రి విశ్రమించారు. సమీపములో ఝీలంనదిమీద తాళ్ళవంతెన ఉన్నది. రమ చాలాసేపు కుతూహలముతో మనుష్యులు దాటిమీదుగా వెళ్ళడము చూచింది. వంతెన చాలాయెత్తు. ఏటివేగముజాస్తి. పొర పాటున తాడు తెగిందా మనిషి వెంటనే పరలోకప్రాప్తి.

మర్నాడు టాంగా బరాములా చేరేసరికి రెండుగంట లయింది. అక్కడినుంచి ఝీలంనది బాగుంటుంది. గమనము కూడా శాంతము. పడవలు సులభముగా వెళ్ళవచ్చు.

బండి వెనక్కి పంపి గోపాలుడు పడవ అద్దెకు తీసుకోడానికి నదీతీరానికి వెళ్లాడు. అక్కడ చిన్నవి, పెద్దవి, ఒకమోస్తరువి, పడవలు చాలా ఉన్నవి. కొన్ని పడవలవలె, కొన్ని యిళ్ళవలెనూ ఉన్నవి. కాశ్మీరములో సంచారము చేసే వారు సంవత్సరములో కొన్ని నెలల పాటు గృహనావలు అద్దెకు పుచ్చుకుంటారు. నీటిమీద కాశ్మీరములో చాలా చోట్లకు వెళ్ళవచ్చు. రాజధాని అయిన శ్రీనగరానికి నీరే రాజమార్గము. శ్రీనగరవాసులు అనేకులు జలగాములు.

పడవ పెద్దదిగా ఉన్నది. దానిమీద రెల్లుగడ్డికప్పిన చిన్న యిల్లు. కొన్నిపడవలమీద వెదురుతో గోడలు కట్టుతారు. ముందుభాగము ప్రయాణీకులకు, వెనకభాగము కళాసులు ఉండడానికి. ఆడవాళ్ళు పిల్లలుకూడా తెడ్డువెయ్యడము నేర్చుకొంటారు లోతులేనిచోట గడవేస్తారు. అప్పుడప్పుడు ఒడ్డుకు దిగి, తాడు లాగుతారు.

నవగోపాలుడు అద్దెకు తీసుకొన్నపడవ అంత పెద్దదికాదు. ఆరాత్రి వారంతా పడవలోనే పడుకొన్నారు. మర్నాడుదయము గృహనావ శ్రీనగరము బయలుదేరింది.

# ౩౧

రెండుపక్కలా అడవి. పడవ శ్రీనగరాభిముఖముగా బయలుదేరింది. అవి వర్షాకాలపు చివరరోజులు. నది నిండుగా ఉన్నది. పడవ బాగా వెళ్ళుతున్నది.

పడవ వెనకభాగములో యజమాని అసానుల్లా కుటీరము. అతనికుటుంబమంతా అక్కడే ఉన్నది. అతనికి ఒక సోదరుడు, ఇద్దరు తమ్ముడికొడుకులు. అందరికీ పడవ నడపడము తెలుసు. అతని పదకొండేళ్ళకూతురు భోరా పడవ నడపడము చూచి రమ ఆశ్చర్యపడి తానుకూడా గడ వెయ్యడానికి ఉత్సాహము కనబరిచింది. లక్ష్మి సమ్మతించలేదు.

"లక్ష్మి, భోరా చేతులోనుంచి గడ తీసుకొని నేను నడపనా?"

"నీకేమి చేతవుతుంది? గప్పున నీళ్ళలో పడిపోతావు!"

"పడను లక్ష్మీ, పడను. ఇంతపిల్ల నీళ్లలో పడనప్పుడు నేను పడతానా?"

"పుట్టింది మొదలు ఆపిల్ల కిదేపని."

"అయితేయేమి, నేను కాస్త నడిపిస్తా."

"వద్దు. జాగ్రత్త. దాదాబాబు కోప్పడతాడు."

రమాసుందరి గోపాలుడికేసి చూచి "ఏమండీ, కోప్పడతారా?" అన్నది.

గోపాలుడు నవ్వుతూ "అవును. ఇటు రా. నీ కోవస్తువు చూపిస్తాను" అన్నాడు.

రమ నిట్టూర్పు విడిచి భర్తతో పడవపైకి వెళ్ళింది. భోరా గడవేస్తూ ఈసంగతి చూస్తున్నది. ఆపిల్లకు బెంగాలీభాష తెలియకపోయినప్పటికీ విషయ మేమిటో ఊహించింది. రమకోరిక యోగ్యము కాదని యజమాని అన్నట్లు గ్రహించి భోరాకు అభిమానము హెచ్చింది. వంగి ఆపిల్ల చురుకుగా గడవెయ్యడము మొదలుపెట్టింది.

ధూళితోను కంకరతోను నిండిన రోడ్డుమీద ఎముకలు విరిగేలాగ వెళ్ళినబండి నడకకూ, ఇప్పటికి పడవనడకకూ ఎంతభేద మబ్బా! పడవయెదటవైపు రమాగోపాలులు కూర్చుని ప్రకృతిశోభను చూచి ఆనందిస్తున్నారు. లోపల లక్ష్మి పొయ్యి రాజేసి టీ పెట్టుతున్నది. అంతకంతకు ఎండ హెచ్చుతున్నది.

వరాములా గ్రామములో చివరకుటీరము దాటి చాలాసే పయింది. నది ఒడ్డు కిందికి ఉన్నవి. నీటిసమీపములో ఒక మార్గమున్నది. పడవవాళ్ళు తాడు లాగుతూ దానివెంట

పోతారు. కొన్నిచోట్ల తీరము ఎత్తు, కొన్నిచోట్ల పల్లము. కొంతదూరము పిచ్చిచెట్లు, కొంతదూరము పంటభూములు. వరిచేలు, గోధుమపొలాలు పచ్చగా చాలాదూరము కన బడుతున్నవి. గోధుమ పొలాలలో మధ్యమధ్య గసగసాల పూలు కనపడుతున్నవి. ఒడ్డున కొంతదూరము మన్ను, కొంతదూరము రాళ్లు. అక్కడక్కడ ఒకటి అర చిన్నగుట్ట లుకూడా ఉన్నవి. వాటి సందులలో అడివిరోజా మొక్కలు మొలిచినవి. పూలుకూడా కనబడుతున్నవి. వాడిపోయిన పూలరేకులు చాలావరకు రాలిపోయినవి. గాలికి ఒకటి అర కొట్టుకు వచ్చి, పడవదగ్గర పడుతున్నవి.

వాళ్ళు టీ తాగిన తర్వాత పడవ జేలమ్‌జి గ్రామము చేరింది. అక్కడ ఏటినీరు నిర్మలముగా ఉన్నది. ఒడ్డున గుట్ట ఉన్నది. నీళ్ళలో చిలపరాళ్లు మెరుస్తున్నవి. అలల తాకిడివల్ల రాళ్ళు ఒడ్డుకు కొట్టుకు వచ్చి మళ్ళీ వెనక్కు పోతున్నవి. నిర్మలమైన నీటిలో చేపలు ఈదుతున్నవి. సమీపములో బండమీద వాలిన లకుముకిపిట్ట అమాంతము నీటిమీదికి దూకి చేపను ఎత్తుకు పోయింది. నీటిమీద నల్లని పిట్టలనేకము తిరుగుతున్నవి అవి తిలపక్షు లనీ, తుపాకి దెబ్బ కందవనీ పడవవాళ్లు అన్నారు.

రెండు జాములకు పడవ ఊలర్ సరస్సులోకి వెళ్ళింది. ఝీలంనది కొండమీదినుంచి దిగి తూర్పుగా ఈసరస్సులో పడి దక్షిణముగా బయటికి ప్రవహిస్తుంది. సరస్సులో అక్కడక్కడ మంచి తోటలు కనపడుతున్నవి. ఒకొక్కటి చిన్నచిన్న దీవివలె ఉన్నది. అవి నిలకడగా ఉండక నీటిమీద తేలుతూ పోతుంటవి. వాటిలో కరబూజా, నాటు సీమ వంగలు ఇతరకూరలూ కాస్తవి. ఇటువంటి పెద్దతోటకు దోనెలలో వెళ్ళి కూరలు తెస్తారు. రమాసుందరి వాళ్ళదగ్గర కూరలు కొన్నది. లక్ష్మి మధ్యాహ్న భోజనానికి ఏర్పాట్లు చేస్తున్నది. రమ వంకాయలు తరిగి యిచ్చింది. లక్ష్మి భాజీ చేసింది.

అపరాహ్న వేళ పడవ సరస్సులోనుంచి ఝీలంనదిలో ప్రవేశించింది. ఊలరు సరస్సులో ప్రవేశించకముందు నీరు నల్లగాఉన్నది. ఇప్పుడు నీరు కాఫీరంగుగా కనబడుతున్నది.

కాశ్మీరదేశములో పర్వతసమీపభూమి చాలా అందముగా ఉంటుంది. దూరాన మంచుకప్పిన పర్వతపంక్తులు, సమీపములో సస్యక్షేత్రాలు. అదంతా మెగుడుదిగుడు నేల. ఒక్కొక్కచోట నదికి సమీపముగా చేనారుచెట్లు అనేకమున్నవి. వాటిసందులలోనుంచి ఒకసారి దేవాలయ శిఖరాలు, ఒకసారి మసీదు మినార్లు కనబడుతున్నవి. కొండ గులాబీ మొక్కలు చాలా దట్టముగా ఉన్నవి. బుల్‌బుల్ గానము

చెవి సోకుతున్నది. కొత్తరకము లకుముకిపిట్ట తిరుగుతున్నది. మామూలు దానికన్న ఇది చాలాపెద్దది. రెక్కలు రెండూ నలుపు, పొట్ట నిమ్మపండుచాయ. బుల్‌బుల్‌పిట్టలు పడవకప్పు మీదికి ఎగురుతున్నవి. అక్కడ పెట్టి ఉన్న ఆహార పదార్థాలు కొన్నిపిట్టలు ముక్కున కరుచుకొనిపోయి తింటున్నవి. భోరా "తమాషా చూపించనా? నాచేతులో తినేవస్తువు కాస్త పెట్టండి" అని తీసుకొని కాస్త దూరముగా వెళ్ళి నిలుచున్నది. బుల్‌బుల్‌పిట్టలు ఆపిల్ల ఒంటిమీద వాలి చేతులో ఉన్న వస్తువు తినడము మొదలుపెట్టినవి.

చాలాచోట్ల సహజమైన ఊటలు కనపడుతున్నవి. సాయంకాలము పడవ ఆగినచోట బెర్నాగ్ అనే ప్రసిద్ధమైన ఊట కనపడ్డది. సాయంకాల భోజనానికి పడవ అక్కడ కట్టివేయించి గోపాలుడు మొదలైనవారు ఒడ్డుకు దిగినారు. ఊటనీరు పైకి లేచి కూడినచోట మొగలుచక్రవర్తి నాలుగు వైపులా విచిత్రమైన చలవరాతి కేళాకూళి కట్టించినాడు. సంధ్యారాగము పడడముచేత అందులో నిర్మలోదకము చిత్రవర్ణము ధరించింది. లోతును బట్టి నీరు కొన్నిచోట్ల నీలముగానూ కొన్నిచోట్ల ఆకుపచ్చగాను ఉన్నది. ఊట సమీపములో గుంపులు గుంపులుగా పచ్చని మెట్టతామరలు మొలిచినవి. రమాసుందరి కొన్ని తామరపువ్వు

లు కోసి పడవలోకి తీసుకువచ్చింది. రాత్రిల్లా పడవ అక్క డే కట్టివేశారు. మర్నాడు ఉదయము పడవ మళ్ళీ బయలు దేరింది

వారు ఆపగలల్లా ప్రయాణముచేసి సూర్యాస్తమానానికి శ్రీనగరము సమీపించారు.

నదికి రెండు పక్కలా గడ్డి ఎత్తుగా పెరిగిఉన్నది. దోనెలలో కాపు పడుచులు పళ్ళు దుంపలు మొదలయినవి పెట్టుకొని అమ్మడానికి శ్రీనగరము వెళ్ళుతున్నారు.

నగరము ఆట్టే దూరములో లేదు. పర్వతము మీదుగా గోపురము కనబడ్డది. క్రమక్రమముగా మేడల శిఖరాలుకన పడ్డవి. ఎదురుగా నదిమీద చిన్నపడవలు పెద్దపడవలు వస్తూ పోతూ ఉన్నవి. దగ్గిరికి రాగానే కొన్ని దుకాణపు నావలు నవగోపాలుడి పడవకు రెండు పక్కలా మూగినవి. నదే శ్రీనగరములో ప్రధానరాజమార్గము. పెద్ద పెద్ద దుకాణాలు రేవుల మీదనే కట్టి ఉన్నవి. చాలామంది వర్తకులు పడల లోనే ఉంటారు. కొన్ని దుకాణాలు సంవత్సరము పొడు గూతా పడవలలోనే ఉంటవి. హిందువులు ముసల్మానులు వస్తువులు చేతపుచ్చుకొని గోపాలుణ్ణి ఆకర్షించడానికి ఒక్క సారిగా కేకలు పెడుతున్నారు. చాలామట్టుకు ఆవస్తువులు కాశ్మీర దేశములో తయారైనవే.

వెండి రాగి వస్తువులు చిన్న పెద్ద రకరకాల పాత్రలు ఏనుగ దంతపు సామానులు, చెక్కిన చందనపు కర్రసామానులు చాలా ఉన్నవి. వాటితోపాటు విదేశవస్తువులు కూడా ఉన్నవి.

వాళ్లమాట చమత్కారానికి గోపాలుడు మొదట చాలా ఆనందించాడు. పట్నములోకి వెళ్ళితే మంచివస్తువులు దొరకడము ఎంతకష్టమో, ఊళ్ళో దుకాణ దారులు ఎంత మోసగాళ్ళో, దొంగలో, ధూర్తులో—అవన్నీ పెద్ద గొంతు పెట్టుకొని చెప్పారు. అయిదు నిమిషాలలో గోపాలుడు ఉక్కిరి బిక్కిరి అయి పడవలోపలికి వెళ్ళిపోయినాడు. బాబు తమ మాట వినక దూరాలోచన లేని పని చేశాడని శ్రీనగరములోకి వెళ్ళితే వస్తువులు కొన్నప్పుడు ధూర్తులైన వర్తకులు దయాదాక్షిణ్యాలు లేకుండా అతన్ని మోసము చేస్తారని కొంతసేపు బిగ్గరగా చెప్పి చెప్పి చివరకు మరొకరిని వేటాడడానికి వెళ్ళారు.

ఇంతలో ఇంకా చాలాపడవలు చేరినవి. కొన్నింటిలో బియ్యము వంటచెరుకు ఇతర సామగ్రిలూ ఉన్నవి. చిన్న దోనెలలో నగరవాసులు ఆవస్తువులు కొనడానికి వచ్చినారు. ఒడ్డున పండ్లదుకాణాలు కూరల దుకాణాలు ఉన్నవి. అక్కడ కూడా మనుషులు గుంపులుగా ఉన్నారు. ఎర్రచీరలు

కట్టుకొన్న స్త్రీలు తమ పచ్చని పిల్లలచేత స్నానాలు చేయిస్తున్నారు. మధ్యమధ్య ఒక్కొక్క చిన్నపడవ వేగముగా వచ్చేది. అందులో కళాసులు 'సాహెబ్ కా' అని కేకవేసేవారు; అనగా తెల్లవాళ్ళపడవ. నల్లవాళ్ళు చప్పున దోవ ఇచ్చేవాళ్లు.

చివరకు గోపాలుడి పడవ సదర్ ఘాట్‌కు వచ్చేసరికి పొద్దు కూకింది. ఆరాత్రింతా వారు పడవలోనే గడపవలె. రమాసుందరి సంధ్యారాగములో నగరము చూడడానికి ఆదుర్దా కనపరిచింది. బండీ మాట్లాడి గోపాలుడు రమతో బయలుదేరినాడు.

# ౩౨

శ్రీనగరము అంత శోభాయమానముగా ఉండకపోయినా చూడడానికి మొత్తము మీద సొగసుగానే ఉంటుంది. భరతవర్షములో ఇతర పట్నాలలో పాశ్చాత్య ప్రభావపు చిన్నలు కనబడతవి, ఇక్కడ కనబడవు. నిజానికి శ్రీనగరము పూర్వకాలపుది అనడానికి సందేహము లేదు. మంచి రాజ మార్గము ఒకటీలేదు. పెద్దమేడలు చాలా తక్కువ. ఇళ్ళు చిన్నచిన్నవి. వాటి బయటి గోడలమీద బొమ్మలుంటవి. కిటికీలమీద చెక్కడపు పనులుంటవి.

ఇళ్లు చాలావరకు మొగలాయీల అమలులో కట్టినట్టు కనబడతవి. దేవాలయాలు కాశీదేవాలయాల పంపిణీ మీద ఉంటవి. ఒకటి రెండింటిమీద వెండిపూత పూశారు. సూర్యకాంతిలో ఆలయాలు జాజ్వల్యమానముగా ఉంటవి. మసీదులు జాస్తి. శ్రీనగరము హిందూరాజధాని అయినప్పటికీ హిందువులకన్న ముసల్మానులే ఎక్కువ. వీధులవెంట తిరిగే మనుషులను చూస్తే ఈసంగతి బోధపడుతుంది. మసీదులలో షాహ హమాదాన్ ప్రధానమైనది. శ్రీనగరములో చూడవలసిన వాటిలో ఇదొకటి. మసీదంతా కర్రతో కట్టి

నారు. భూమిమీదనుంచి సమ చతుష్కోణముగా బయలు దేరి క్రమక్రమముగా గోళాకారము ధరించి ఎత్తుగా శిఖర ములోకి తేలింది. విదేశీయులు వచ్చి దీనిమీది శిల్పము చూచి ఆశ్చర్యపడతారు. ఐరోపాలో చాలా మ్యూజియ ములలో దీనికి నకళ్లున్నవి.

చిత్రపు పనులు చేసిన ఇళ్ళు దర్వాజాలు కిటికీలు నగరము లో ప్రతిచోటా కనబడతవి. ఈకర్రఇళ్లు చూడడానికి క్షణ భంగురముగా ఉంటవి. పెద్ద గాలి బలముగా వీస్తే ఎగిరి పోతవేమో అనిపిస్తుంది. ౧౮౮౫ సం॥ లో భూకంపానికి రాతిమేడలు అనేకము పడిపోయినవి. కర్రఇల్లు ఒకటీ పడలేదు.

నదికి సమీపములో ఇళ్లు దగ్గర దగ్గరగా ఉన్నవి. కొంచెము అవతల ఆవరణలు వగైరాలతో విశ్రాంతిగా ఉన్నవి. ప్రతి ఇంటి చుట్టూ తోట ఉంటుంది. అందులో పళ్లు, దుంపలు, కూరలు సహజముగా మొలుస్తవి. ద్రాక్షతీగలు ఒకచెట్టు మీదనించి మరొక చెట్టుమీదికి పాకుతూ ఉంటవి.

ఇది శ్రీనగర పటము బొమ్మ ఎలా ఉన్నా చట్టము అద్భు తము; స్వహస్తాలతో ప్రకృతి దేవత చేసినట్లుంటుంది. నాలుగు వైపులా పర్వత శ్రేణి అపూర్వ వర్ణముతో ప్రకా శిస్తున్నది. దూరాన పర్వతాలమీద మంచుగడ్డలు కమ్మి

ఉన్నవి. పర్వతపాదములో ఉన్న నేల అడవులతోను ఉప వనాలతోను నిండి ఉన్నది. దాని పక్కగాను మధ్యగాను చిన్న వాగులు పెద్దవాగులు ప్రవహిస్తుంటవి.

రాత్రి పడవలో గడిపి ఉదయము లేచి టీ తాగి కాస్తపొద్దు ఎక్కిన తర్వాత గోపాలుడు రాజభవనానికి బయలు దేరి నాడు. నగరములో జన సంకీర్ణమైన మార్గము దాటి అతని బండి రాజభవనపు సింహద్వారము దగ్గర ఆగింది. గోపా లుడు దిగి, చిన్న దివాంజీ కుమార ధనంజయ సింగుగారి దర్శనము చేయవలెనన్నాడు. దర్వాంజీ అతన్ని తీసుకొని వెళ్ళి చక్కగా అమర్చిన గదిలో కూర్చోబెట్టి కుమార బహద్దర్ గారికి తెలియ పరిచినాడు. త్వరలోనే తిరిగి వచ్చి దర్వాన్ గోపాలుణ్ణి వెంటబెట్టుకొని లోపలికి తీసుకొనిపోయి, "కుమార సాహెబ్ వస్తారు ఉండమన్నారు" అన్నాడు. కొన్ని నిమిషాలకు కుమార ధనంజయ సింగుజీ వచ్చి గోపా లుణ్ణి చూచి "గుడ్ మార్నింగు" అన్నాడు. కుమార సాహెబ్ బలిష్ఠుడైన రాజపుత్రుడు. ఆయనది నవ్వుముఖము. గోపాలుడు దగ్గర కూర్చుని స్వచ్ఛమైన ఇంగ్లీషులో ఆయ నతో సంభాషించాడు.

"ప్రయాణము కష్టముగా ఉన్నదా? శ్రీనగరము ఎలా ఉన్నది? ఎక్కడుంటున్నారు?"

"పడవ లోనే"

"హౌసు బోటా ?"

"కాదు. చిన్నపడవ"

"ఎక్కడుందా మనుకుంటున్నారు? ఇక్కడ హౌసుబోట్లు చాలా ఉన్నవి. ప్రతి దాంట్లో రెండు మూడు పడక గదు లుంటవి. కొన్నింట్లో డ్రాయింగ్ రూము లైబ్రరీ గదులు కూడా ఉంటవి. మీకు రాజసర్కారు నుంచి నివాసము ఏర్పాటు అవుతున్నది. బోటులో ఉండాలని కోరిక ఉంటే సర్కారుహౌసు బోటు ఒకటి ఇస్తాను. కొండ మీద ఉండ దలుచుకుంటే సర్కారీ బంగాళా ఒకటి ఇస్తాను. మీకు ఏది ఇష్టమో చెప్పండి."

గోపాలుడు దివాంజీకి కృతజ్ఞత చెప్పి "నదమీద చాలా గడబిడగా ఉంటుంది. ఏకాంతంగా బంగాళా ఉంటే మన శ్శాంతిగా ఉంటుంది." అన్నాడు.

దివాంజీ కొంచెము ఆలోచించి జవాను కోసము గంట నొక్కినాడు. వాడు రాగానే గుమాస్తాను పంపించమన్నాడు. గుమస్తా వచ్చినాడు. "మున్షీబాగ్‌లో బంగాళా ఖాళీగా ఉన్నదా?" అన్నాడు దివాంజీ.

"ఉన్నది."

"సరిగా ఉన్నదా?"

"రెసిడెంటుగారి స్నేహితుడు ఒకాయన వారంరోజులుండి వెళ్ళాడు. బంగాళా మంచి స్థితిలోనే ఉన్నది."

"మంచిది. బంగాళా మాష్టరు సాహెబు గారికి ఏర్పాటు చెయ్యి. వీరి పడవ రేవులో ఉన్నది వీరివెంటవెళ్ళి పడవ మున్షీబాగ్ ఘాటీకి తీసుకు వచ్చి సామానులు బంగాళాలో పెట్టించి తక్కిన ఏర్పాటులు అన్నీ చేయించు"

"చిత్తము" అని గుమాస్తా వెళ్ళినాడు.

తర్వాత దివాంజీ ఎవరి చదువు కోసము గోపాల్నుణ్ణి పిలిపించారో అతని సంగతి ప్రస్తావించాడు. ఆకుర్రవాడు మహారాజుగారి మేనల్లుడు. తండ్రి చాలా ఆస్తి సంపాయించి చనిపోయినాడు. ఆస్తి ప్రస్తుతము మహారాజుగారి అజమాషీలో ఉన్నది. మైనరు వెళ్ళినతర్వాత పిల్లవాడు ఆస్తి చూచుకుంటాడు. కుమార బలవంతసింగుకు పన్నెండేళ్లు. అతనికి వేట వెర్రి జాస్తి. చిన్నవాడైనా గుర్రపు సవారీలో ఆరితేరినాడు. ఇదివరలో అతనికి ఇంగ్లీషు చెప్పడానికి తెల్లవాణ్ణి ఏర్పాటు చేశారు. తెల్ల ఉపాధ్యాయుడితో కలసి ఉంటే వాళ్ళ భావాలు పట్టు పడతవి. మన ఆచార వ్యవహారాల మీాద శ్రద్ధ పోతుందని అతని తల్లి బాగా ఇంగ్లీషు వచ్చిన హిందూ ఉపాధ్యాయుణ్ణి ఏర్పాటు చెయ్యమన్నది. కుర్రవాడికిఉదయము రెండుగంటలు, సాయంకాలం

ఒక గంటా, పాఠాలు చెప్పించమన్నది. ఇంగ్లీషు పుస్తకాలు చదివించడముకన్న ఇంగ్లీషు సంభాషణ ఇంగ్లీషువారి మర్యాదలు నేర్పడము ముఖ్యమన్నది. బలవంతసింగు మౌల్వీ వద్ద ఫారసీ, పహల్వాన్ వద్ద కుస్తీ నేర్చుకొంటున్నాడు. ప్రతి వారము ఈ ఈ విద్యల కోసము నిర్దిష్టమైన సమయాలలో తప్ప తక్కినప్పుడల్లా గోపాలుడు కుర్రవాడితో ఉండవలె. ఈసంగతులన్నీ చెప్పి "మీకు అశ్వారోహణము అలవాటే నా?" అని దివాంజీ అడిగినాడు

"అవును"

"అయితే సాయంకాలము గంటా పుస్తకాలు చదివించడములోనే గడపక బుద్ధి పుట్టినప్పుడు గుర్రపు షికారుకు తీసుకు వెళ్ళుతూ ఉంటే, మేమనుకున్న శిక్షా విధానము సఫల మౌతుంది."

నవగోపాలుడు సంతోషముతో సమ్మతించి కుర్రవాణ్ణి చూడవలె నన్నాడు. దివాంజీ అతన్ని వెంట బెట్టుకొని పాఠమందిరము లోకి వెళ్ళినాడు. అక్కడ కూర్చుని బలవంతసింగు కోసము కబురు చేసినాడు.

కుర్రవాడు త్వరలోనే వచ్చినాడు. అతనికి పన్నెండేళ్ళే ఉన్నా మరి రెండు మూడేళ్ళు ఎక్కువ ఉన్నట్టు కనబడతాడు. బలిష్ఠకాయుడు. చాలా ఖరీదుగల దేశీయ వ-

ధరించినాడు. కటిబంధములో కత్తి వేలాడు తున్నది. దివాంజీ అతన్ని చూచి "బలవంత్, నీమాష్టరుగారు వచ్చారు" అన్నాడు.

బలవంతసింగు చిరునవ్వుతో వచ్చి గోపాలుడితో షేకుహ్యాండు చేసినాడు.

"వీరితో సంప్రతించి నీపారపరిణాళిక ఏర్పాటు చేసుకో" అని లేచి దివాంజీ "ఈగుమాస్తాను వెంటబెట్టుకొని నివాసము విషయమై అన్ని ఏర్పాటులూ చేయించండి" అని గోపాలునితో చెప్పినాడు.

సాయంకాలము గోపాలుడు రమాలక్ష్ములతో నూతన గృహములో ప్రవేశించినాడు.

మన్నది.

# 33

గోపాలుడి వివాహ మయిన తర్వాత ఆరు మాసాల దాకా కాంతిచంద్రుడు కుమారుడి పేరు కమలాదేవి కూడా తన యెదట ఉచ్చరించడానికి వీలు లేకుండా చేశాడు. తల్లి చాలా సార్లు కొడుకు సంగతి ప్రస్తావించా లనుకొన్నది, కాని సాహసించ లేక పోయింది. ఇప్పు డామె మనస్సులో కొంత అభిమానము కూడా ప్రవేశించింది. తండ్రికిష్టము లేని వివాహము చేసుకొన్నాడని ఒక్క కొడుకుంటే ఎల్ల కాలమూ విడిచిపెట్టి ఊరుకొంటారా! గోపాలుడు ఖులాసాగా ఉన్నసంగతి తెలుస్తూ ఉండడము వల్ల ఆమె కొంతవరకు మనశ్శాంతితో ఉన్నది. తనంతట తానే యీసంగతి యెత్తకూడ దనుకొన్నది. యజమాని ఎన్నాళ్ళు ప్రస్తావించకుండా ఉంటాడో చూతా మనుకొన్నది.

ఆరు మాసా లయిన తరవాత ఒకనాడు సాయంకాలము కాంతిచంద్రుడు అంతఃపురములో కూర్చుని భార్యచేతిలో ఒక ఉత్తరము పెట్టినాడు. అది గోపాలుడు వ్రాసింది, కమలాదేవి ఉత్తరము విప్పి చదివింది. కాంతిచంద్రుడు ఆవేళ "నబూ ఖులాసాగా ఉన్నాడా?" అని మాత్రము అడిగినాడు. "ఆ" అన్నది భార్య.

ఆరు నెల లయిన తర్వాత ఆయన ఇదే మొదటిసారి కొడుకు సంగతి అడగడము. ఆటుతరువాత కుమారుని కుశలము అప్పుడప్పుడు భార్యను అడిగేవాడు. ఎన్నడూ కోడలిమాట యెత్త లేదు. కమలాదేవి ఒకనాడు "గోపాలుడు బాగానే ఉన్నాడు. కాని కోడలి ఒంట్లో—" అన్నది.

"ఊహూ" అని కాంతిచంద్రుడు డక్కడినుంచి లేచి వెళ్ళినాడు. ఒంట్లో ఏమిటి, ఏమి జబ్బు అని అయినా అడగలేదు. రమకు జలుబు చేసి జ్వరము తగిలిందట.

మరి రెండు మూడు నెలలు గడిచినవి. వైశాఖమాసములో ఒకనాడు సాయంకాలము కాంతిచంద్రుడు మేడమీద పచారు చేస్తున్నాడు. సందె చీకటిలో పికూలీ నదిమీద పడవలు వస్తూ పోతూ ఉన్నవి. ఒకటి రెండు ఒడ్డును కట్టి వేసి ఉన్నవి. మనుష్యులు దిగి వంటలు మొదలు పెట్టారు. ఇదివరలో చాలా సార్లు గోపాలుడి వేడుక నావ అక్కడే కనబడుతూ ఉండేది.

ఇంతలో కమలాదేవి భర్త దగ్గిరికి పోయి "తాంబూలము వేసుకుంటారా?" అన్నది. ఆమె చేతులో తములపాకుల చిలక లున్నవి.

కాంతిచంద్రుడు ఆగి భార్య ముఖము చూచినాడు. చాలా కాలమునాటి సంగతి ఆయనకు జ్ఞప్తికి వచ్చింది. పూల

పాపను నాటి మాట. పదకొండేళ్ళ పిల్ల "తాంబూలము వేసుకుంటారా?" అని ఆమెను అడిగింది. ఈ రెండు మాటలూ అనేటప్పటికి ఆపిల్ల చెక్కిళ్ళు సిగ్గుచేత ఎర్రబడ్డవి. కాంతిచంద్రుడు తాంబూలము తీసుకొన్నాడు. అప్పటికీయన నడియౌవనములో ఉన్నాడు. ధనాశ అప్పటికి ఈయన మనస్సులో ప్రవేశించలేదు. ఆనాడు కాంతిచంద్రుడు భార్య చెక్కిళ్ళ మీద ముద్దు పెట్టుకొన్నాడు పెళ్ళి అయిన తర్వాత కొన్ని సంవత్సరాల దాకా భార్యా భర్తలు ఈసంగతి మధ్య మధ్య ప్రస్తావించేవారు; తర్వాత మళ్ళీ ఎన్నడూ ప్రస్తావనే వచ్చేది కాదు. ఇప్పుడు కాంతిచంద్రుడు చిరునవ్వు నవ్వినాడు.

"ఏమిటి?" అన్నది భార్య.

"ఒకసంగతి జ్ఞాపకం వచ్చింది."

ఆసంగతి యేమో ఆమెకు బాగా తెలుసు. ఆమె కూడా మందహాసము చేసింది.

చీకటి పెరుగుతున్నది నదీ జలము కనబడడము లేదు. ఆయన భార్యతో ఏమేమో కబుర్లు చెప్తున్నాడు. గోపాలుడి సంగతి వచ్చింది. మహారాజుగారు అతనిని ఎలా చూస్తున్నదీ, గోపాలుడి శిష్యుని పేరు, వయస్సు, మహారాజుగారికి అతను ఏమయ్యేదీ—ఇవన్నీ అడిగినాడు.

ఇవన్నీ చెప్పి కొంచెము సాహసించి "గోపాలుణ్ణి రమ్మని రాయనా?" అన్నది కమలాదేవి.

కాంతి చంద్రుడు ఊరుకొన్నాడు. కొంచె మాగి కమలాదేవి "ఏమంటారు?" అన్నది.

"ఇప్పుడు కాదు" అన్నాడు భర్త.

భార్య నిట్టూర్పు విడిచింది. "ఇంకెన్నాళ్ళకు?"

గోపాలుడు ఇల్లు వదిలి సంవత్సర మయింది.

ఇంకో నెల గడిచింది. జ్యేష్ఠమాసములో గోపాలుడు పుట్టిన రోజు. నిరుడు, అంతకుముందు, ప్రతి సంవత్సరమూ అతని పుట్టినరోజు పండగ చాలా బాగా చేశారు. కమలాదేవి ఈసారి పన్నెండుమంది బ్రాహ్మలను భోజనానికి పిలిచింది. భర్తతో ఈసంగతి చెప్పింది.

రెండు ఝాములు అయింది. బ్రాహ్మలు భోజనాలు చేస్తున్నారు. సూక్తాలు పండితులు పారాధన చక్రవర్తి అజమాయిషీ చేస్తున్నారు. కమలాదేవి పట్టుచీరె కట్టుకొని, లలాటాన చందన తిలకము పెట్టుకొని పక్కగదిలోనుంచి బ్రాహ్మలకు ఏమి కావలెనో కనుక్కొంటున్నది.

హఠాత్తుగా కాంతి చంద్రుడు అక్కడికి వచ్చినాడు. ఆయన ముఖాన నెత్తురు చుక్క లేదు. చేతులో టెలిగ్రాం.

ఆయన ముఖవైఖరి కనిపెట్టి కమలాదేవి ఆదుర్దాతో ఊపిరి బిగబట్టి “ఏమిటి?” అన్నది.

“గోపాలుడికి చాలా జబ్బుగా ఉన్నదని టెలిగ్రాం వచ్చింది” అనే మాటలు వినపడేసరికి ఆమె ఒళ్ళు వణికింది. తర్వాత నెమ్మదిగా “ఏం జబ్బు?” అన్నది.

“వేటకు వెళ్ళి గుర్రం మీదనుంచి పడ్డాడు. స్మారకం లేని స్థితిలో ఆసుపత్రికి చేర్చారు. మహారాజా టెలిగ్రాం ఇచ్చారు”

కమలాదేవి చతికిలబడి భర్త కేసి చూస్తూ “ఏమవుతుంది?” అన్నది.

“భగవంతుడు ఏం చేస్తే అది అవుతుంది!”

కాంతి [illegible]ద్రుడు కొంచెము సేపు క[illegible]బారి నిలుచుని “ఇప్పుడే కాశ్మీరం బయలు దేరుతున్నాను. మనా[illegible] తయారు చెయ్యమని చెప్పివచ్చాను” అన్నాడు.

“నన్నుకూడా తీసుకు వెళ్ళండి.”

భర్త మొదట ఒప్పుకోలేదు. చాలా దూరప్రయాణమనీ, శ్రమ అనీ అన్నాడు.

“కోడలు గర్భిణి” అన్నది కమలాదేవి.

“ఎన్నో మాసం?”

“ఎనిమిదో, తొమ్మిదో”

కాంతి చంద్రుడు కొంచెం ఆలోచించి "అయితే పద. ఇంకో మేనా తెప్పిస్తాను" అన్నాడు.

"ఇవాళ గోపాలుడు పుట్టినరోజు పండగ. తెలుసునా?"

"తెలుసు."

"ఇంకా బ్రాహ్మణ భోజనం కాలేదు. వెళ్ళి బ్రాహ్మణ ఆశీర్వచనం పొందండి. తరువాత బయలు దేరుదాం."

కొద్దిగా సామానులు తీసుకొని వారు రెండు గంటలలోగా బయలు దేరినారు.

# ౩౪

స్టేషను చేరగానే కాంతిబాబు కాశ్మీర కుమార రాజాసాహెబుకు టెలిగ్రాం ఇచ్చినాడు. ఆసాయంకాలము మెయిలులో కలకత్తా నుంచి సకుటుంబముగా బయలుదేరుతున్నానన్నాడు. గోపాలుడి సంగతి దానాపూరు స్టేషనులో తన చిరునామాకు టెలిగ్రాం పంపమని ప్రార్థించినాడు.

విచారగ్రస్తులయిన ఆదంపతులు రాత్రంతా నిద్ర లేకుండా పంజాబు మెయిలులో గడిపినారు. కమలాదేవి జపమాల తీసుకొని కేవలము హరి నామస్మరణతో గడిపింది. ఉదయము దానాపూరు స్టేషనులో మంచివార్త వినేలాగ చేయవలసిందని భగవంతుణ్ణి ప్రార్థించింది ఉదయము ఎనిమిది గంటలకు దానాపూరులో రైలు ఆగగానే కాంతిచంద్రుడు బండి దిగి టెలెగ్రాఫ్ ఆఫీసులోకి వెళ్ళినాడు. ఏసంగతీ తెలియ లేదు. టెలిగ్రాం రాలేదు

ఆఫీసులోనుంచి బయటికి వచ్చి ప్లాటుఫారము మీద నిలుచుని కాంతిచంద్రుడు ఏమో ఆలోచిస్తూ ఉన్నాడు. ఎందుచేత వర్తమానము రాలేదు? ఒకవేళ అక్కడి సంగతి బాగా లేదేమో. ఒకవేళ అంతా అయిపోయిందేమో.

ఆలా ఆలోచిస్తూ ప్లాటుఫారము మీద మనుష్యులను చూచి అసహ్యము వేసి అక్కడినుంచి కదిలినాడు. తన సుఖవైఖరి ఏమీ బాగాలేదనీ బుద్ధిలో దగ్గిరికి వెళ్ళితే భార్య మరింత విచారపడుతుందనీ ఎంచి కుళాయి దగ్గిరికి వెళ్ళి ముఖము కడుక్కొని, శాంతి తెచ్చుకోడానికి అనుకూలము చేసినాడు. మొ[illegible] కొట్టినాడు. మళ్ళీ టెలిగ్రాం ఆఫీసుకు వెళ్ళేసరికి కళ్ళజోడు పెట్టుకొన్న లావాటి బెంగాలీ ఉద్యోగి వచ్చి ఇంకా తంతి రాలేదన్నాడు.

"కొంతసేపటికి వస్తే నాకెలా అందుతుంది?"

"తమరు ఎక్కడికి వెళ్ళుతున్నారు?"

"కాశ్మీరం."

"తమ పేర తంతి వస్తే అప్పటికి మెయిల్ ఏస్టేషనులో ఆగుతుందో ఆస్టేషనుకు పంపుతాను."

కాంతిచంద్రుడు ఆయనకు కృతజ్ఞత చూపి, బండి దగ్గిరికి వెళ్ళాడు. ఆదుర్దాతో కనిపెట్టుకొని ఉన్న కమలాదేవి "వర్తమానం వచ్చిందా?" అన్నది.

"లేదు."

"మీరు ఆలస్యం చెయ్యడంబట్టి అప్పుడే అనుకొన్నాను."

భార్యను శాంతిపరిచే అభిప్రాయముతో కాంతిచంద్రుడు "బహుశా కుమారరాజాగారికి టెలిగ్రాం అందేసరికి చాలా

పొద్దుపోయి ఉంటుంది. ఆయన ఉదయం లేచి చూచిఉంటారు. అందుకే ఇంతవరకూ జవాబు రాలేదు" అని చెప్పినాను. ఆమె కిటికీలోనుంచి చూచి 'మధుసూదన!' అన్నది. మెయిలు తర్వాత గంటకు బక్సారులో ఆగింది. కాంతి చంద్రుడు వెళ్ళి కనుక్కొంటే అక్కడి హిందూస్తానీ గుమాస్తా "నహీ బాబుజీ, కోఈ తార్ నహీ ఆయా" అన్నాడు.

బక్సారులో బండి చాలాసేపు ఆగింది. తెల్లవాళ్ళు ఛోటా హాజిరీ చేశారు. మొగల్ సరాయి స్టేషనులోగా బండి ఆటే సేపు ఎక్కడా ఆగదు.

కాని దిల్‌దార్ నగరులో బండి ఆగీ ఆగకముందే ఎవరో "కాంతిచంద్ర బానర్జీ, కాంతిచంద్ర బానర్జీ" అని కేకలు వేసినాడు. కలాసివచ్చి ఆయనకు టెలిగ్రాం ఇచ్చినాడు. నవగోపాలుడికి స్మృహ వచ్చిందనీ, అపాయము ఇంకా దాటలేదనీ అందులో ఉన్నది.

ఈసమాచారానికి వారు శాంత పడలేదు. ఇతరులు శాంతించడానికి అవకాశము ఉన్నది. ఇంకా ఒడ్డున పడక పోయినప్పటికీ ప్రస్తుతము ప్రాణభయము లేదు. అయితే మమత్వము ఉన్నచోట భయము హెచ్చు.

మొగల్ సరాయిలో దిగి కాంతిచంద్రుడు కుమారరాజాకు మరొక టెలిగ్రాం ఇచ్చినాడు. ఇదివరలో రాజకుమారుడు పంపిన తంతికి కృతజ్ఞత చెప్తూనూ, అనుగ్రహించి రావల్‌పిండికి మరొక తంతి పంపవలసిందని ప్రార్థించినాడు.

ఆహారనిద్రలు లేక, మనశ్శాంతి లేక, బండిలో ప్రయాణ ప్రు బడలికవల్ల కమలా దేవికి ఒంట్లో బాగా లేదు. రావల్ పిండీనుంచి శ్రీనగరానికి బండిలో వెళ్ళదలచుకొన్న కాంతి చంద్రుడు భార్య శరీరస్థితి చూచి "బరాములానుంచి పడవలో వెళ్లుదాము!" అన్నాడు.

"అయితే ఎప్పుడు చేరుతాము? ఎంత ఆలస్య మవుతుంది?"

"రెండు రోజులు జాస్తి."

"అయ్యబాబో! నావల్లకాదు. తలుచుకుంటే మతి పోతున్నది!"

కాంతిచంద్రుడు మరేమీ మాట్లాడక రావల్ పిండిలో ఏమి తెలుస్తుందో చూతా మనుకొన్నాడు.

మరునాడు రావల్ పిండిలో వారు అనుకొన్న దానికంటె ఎక్కువ మంచివార్త తెలిసింది. "శరీరస్థితి చాలా వరకు బాగా ఉన్నది. అపాయం లేదు. ఆసుపత్రినుంచి ఇంటికి తీసుకు వచ్చారు."

ఈవార్త విని కమలాదేవి బొటబొట కన్నీరు విడిచింది. అవి ఆనందాశ్రువులు. భగవంతుడికి కృతజ్ఞతా సహితమైన అర్ఘ్యప్రదానము.

బరాములానుంచి వారు శ్రీనగరము పడవలో వెళ్ళినారు. గోపాలుడు నిద్రపోతూ ఉన్నాడు. కాలిచప్పుడు కాకుండా లక్ష్మి వారిని పడకగదిలోకి తీసుకువెళ్ళింది. గోపాలుడి

తలకు కట్టు ఉన్నది. ఒళ్లు కుప్పించి ఉన్నది. ఊపిరి నెమ్మదిగా విడుస్తున్నాడు.

కమలాదేవి నెమ్మదిగా మంచము దగ్గరికి వెళ్ళి కొడుకు ముఖము ముద్దుపెట్టుకొన్నది. అతనికి మెళుకువ వచ్చింది. తల్లిదండ్రులను చూచినాడు.

కాంతిచంద్రుడు ప్రేమతో కొడుకు చెయ్యి పట్టుకొని "ఎలా వున్నావు నాయనా?" అన్నాడు.

"బాగా వున్నాను."

తండ్రికొడుకులకు సమ్మేళన మయింది. తల్లిదండ్రి లిద్దరూ నవగోపాలుడి పక్కన కూర్చుని మాట్లాడినారు.

కాంతిచంద్రుడు ఎప్పుడూ కొడుకు దగ్గర కూర్చుంటున్నాడు. మధ్యమధ్య కుమార బలవంతసింగు వచ్చి కూర్చునేవాడు. కమలాదేవి రమాసుందరి సంగతి చూస్తున్నది. ఆమె తల దువ్వుకోక పోవడము చూచి లక్ష్మని చివాట్లు పెట్టడానికి కూడా వెనుదియ్యలేదు.

గోపాలుడికి మంచములోనుంచి లేచే శక్తి తర్వాత వారము రోజులకు వచ్చింది. కాంతి చంద్రుడు అందరినీ వెంటనే స్వగ్రామము తీసుకువెళ్ళుదా మనుకొన్నాడు. కమలాదేవి కోడలిని కదిలించడము మంచిది కాదన్నది. భార్యను అక్కడుంచి కాంతిచంద్రుడు స్వగ్రామము వెళ్ళినాడు.

శ్రావణమాసములో ఒకనాడు ధారాపాతముగా వర్షము కురుస్తున్నప్పుడు రమాసుందరి కుమారుని కన్నది.

కుర్రవానికి మొదటినెల గడిచి రెండవనెల వచ్చింది. కాంతిచంద్రుడు ఉత్తరముమీద ఉత్తరము వ్రాస్తున్నాడు — వారందరినీ రమ్మని. కుర్రవాడు ఇంకా కాస్త ఎదగ నివ్వండని వాళ్ళు ఆలస్యము చేస్తున్నారు. మూడు నెలలు నిండిన తర్వాత అంతా నిశ్చయించారు — కుర్రవాడు ఎదిగినాడని. నవరాత్రాలకు ముందు పంచమినాడు అంతా స్వదేశము బయలుదేరినారు.

రావల్ పిండి నుంచి ఒకసారి రాజస్థాన్ వెళ్ళి, చుట్టాలను చూచి, నెల రోజు లుండి, విశాలాక్షికి వస్తానని లక్ష్మి మొదట అన్నది. తీరా సమయానికి పిల్లవాణ్ణి విడిచి పెట్ట లేక అందరితో పాటూ బయలుదేరింది

స మా ప్త ము

సుజనరంజనీ ముద్రాశాల, రాజమండ్రి — 1935.